శ్రీ

॥ శ్రీనివాసపరబ్రహ్మణేనమః ॥

# సమాజసామ్రాజ్యము

లేక

# ఆదర్శ ప్రభుత్వము

పద్యకావ్యము.



గ్రంథకర్త:

ఉభయభాషాప్రవీణ

పంచాంగం వెంకటాచార్యులు

తెలుగు పండితులు

మునిసిపల్ హైస్కూలు

హాస్పేట

బళ్లారి జిల్లా.

1950



[వెల 2—0—0

ఇది

నాయేడుగడకు

శ్రీ వేంకటాచలపతికి

శ్రీనివాస భగవానునకు

అంకితము

# ప్రవేశిక

హాసపేట హైస్కూలుపండితులు శ్రీమాన్ పంచాంగం వేంకటాచార్యులుగారు రచించిన ఈ మాంధాతృచరిత్ర ఆంధ్రలోకమున నీశతాబ్దిని జననమొందిన గ్రంథములలో నుత్తమతరగతికి చెందినది.

'విశ్వశ్రేయః కావ్యం' అను కావ్యరచనోద్దేశమును పూర్వ ఋషులవలె గ్రహించి అట్టి ఆదర్శకావ్యమును నేటి లోకమునకు చూపనెంచి కృతార్థుడైనవా డీకవి.

అతిశయోక్త్యలంకారములతోను, కుచకుచ వర్ణనలతోను, అప్రస్తుతగాథాప్రసంగములతోను పామరజనము నాకర్షించి సులభ జనరంజకత పడయుప్రయత్నం మీ యుత్తమ కావ్యమున కనుబడదు.

మాంధాతృకథ చిత్రమునకు భిత్తివలె ఈతని భావపరంపరకు అవలంబనమాత్ర సాహాయ్యమే. వాస్తవమునకు ఈతని మాంధాత పాఠకుల సమకాలీనుడేగాని కృతయుగవ్యక్తి కాడు.

గ్రంథకర్త తన అనుభవములను, ఆదర్శములను, నేటి దేశస్థితి మీది జాలిని, అందువలన తనకుకలిగిన మనోవేదనను, మాతృదేశము నుద్ధరించి సంస్కరింప తానూహించిన కార్యక్రమమును ద్రవ్యముగా చేసికొని ఈ కథనూ కథానాయకునీ సృష్టించినాడు.

ఇట్టి భావశుద్ధిచే రచింపబడినది గావున ఈ గ్రంథశైలి నిర్దుష్టముగాను, మనోహరముగానూ వెలసినది. నవీనభావములు కవి నీనాటివాడని గుర్తింపచేయుచున్నవి గాని పద్యరచనాశక్తియు, సరళశైలియు, ద్రాక్షాపాకమును బట్టి ఇతడు ప్రాచీనకాలపు మహాకవి యన్నను కాదనువా రుండరు.

కృతయుగమునాటి సాంప్రదాయములకును ఆచారములకును భిన్నముగా ఈ మాంధాతృచరిత్ర నడచినదనుటను దోషముగా కాక నది యొకగుణముగా పాఠకులు గ్రహించి ఈ ఉత్తమకావ్య రసాస్వాదనచేయ ప్రార్థితులు.

అనంతపురము. పప్పూరి రామాచార్యుడు



శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రియైనమః

# సమాజసామ్రాజ్యము
## లేక
# ఆదర్శప్రభుత్వము

---

## ప్రథమ ఖండము

### ఇష్టదేవతాస్తుతి

శ్రీకాంతాలలితావలోకనలస త్స్మేరాంకురశ్రీసుధా
సేకోత్ఫుల్లవిరాట్స్వరూపుఁడు నిజాంశీభూతభూమీశ్వరా
నీకం దూర్జితధర్మరక్షణసము న్నిర్మలసన్మనోజ్ఞుండు మా
కేకాలంబును "శ్రీనివాసుఁడు" ప్రసాదించుఁగ వరిష్ఠార్థముల్ .1

ఉ॥ ఏమహితేచ్ఛచే జగము లెల్లఁ బ్రతిక్షణనవ్యరూపమై
గోమునఁ బొల్చు చున్నయవి కోరకపుష్పఫలప్రపూర్ణమా
భూమిరుహంబుపోల్కి నవమోహన పావనమైన యట్టి శ్రీ
ధాముని బంధురేచ్ఛ కవితారససిద్ధుని నర్చఁ బొనర్చెదన్. 2

### లక్ష్మీస్తుతి

ఉ॥ క్షీరసముద్రకన్య హరిచిత్తముఁ గాంచినధన్య కల్మిలన్
గోరికతీరభక్తులకుఁ గూర్మి నొసంగెడిభాగ్యజాత సం
సారుల సాపరాధులను సైఁచి కృపామతిఁ బ్రోవ నెన్నికన్
దీరుచు లోకమాత మము ధీబలదీప్తిశుభాళిఁ బ్రోవుతన్. 3

తే॥ లలితశృంగారకళల వి । లాసభూమి,
తల్లి పద్మావతీదేవి । దయమహోర్మి
భావనాశక్తి, సుమధుర । భావరసవి
లాసలలితోక్తి వైచిత్రి । లలినొసంగి. 4

విష్వక్సేనస్తుతి

ఉ॥ ఏనుగుమోముదేవరకు । నెందఱొయింకను వేనవేలుగాఁ
బూనికనేమహామహిమ । మోదముఁగొల్చెఁగఁ గొల్తు రట్టి సే
నాని, మహాంతరాయముల । నంటెడు వేలుపు మేటివిఘ్నముల్
మానిపి మాదుకావ్యమును । మన్చుత నోలిఁ బ్రపూర్ణమూర్తిగాఁ

గురుస్తుతి

తే॥ ప్రథితహారీతగోత్ర సం । భవుని సరతి
సుమహితాష్టాక్షరీమంత్ర । శోభితాత్ము
ననఘు తిరువెంగళాచార్య । తనుజు మంత్ర
గురుని వేంకటరమణార్య । వరుని దలఁతు. 6

తే॥ సంస్కృతాంధ్ర పౌరాణిక । చక్రవర్తి
సరససంగీతకవితాది । శాలకీర్తి
మత్పితృవ్యు జగన్నాథు । మధురవచను
నభినుతింపెద కావ్యవే । దాంతగురుని. 7

కవిస్తుతి

తే॥ మార్గదర్శిని వాల్మీకి । మౌనివరుని
విమలచరితుని వ్యాసాఖ్య । యమివరేణ్యు
దండి భవభూతి మాఘుని । నిండుమదిని
కాళిదాసుని, బాణుని । గౌరవింతు. 8

తే॥ ఎంతు నన్నయఁ దిక్కన । నెఱ్ఱనార్యుఁ
బోతన కవీంద్రు శ్రీనాథుఁ । బొగడి నేఁటి
కవులఁ బరదేశరచనాప్ర । కార పరులఁ
బలుకరింపెద నవనవ । భావకవుల. 9

గ్రంథకర్తృ వంశవర్ణనము

తే॥ సరసిజాసనసుతుఁడు కశ్యపుఁడు తత్పు
తుఁడు మరీచి తదాత్మజాతుఁడు మహాత్ముఁ
డంగిరస్సుఁడు తత్తనూజుఁడు హరితుఁ డతని
కులము—'హారీత'గోత్ర సంకలితమయ్యె
మొనసె వైదికమతముల నాఁట నడియె. 10

మ॥ ధరణిన్ బ్రహ్మముతోడి విశ్వమును సత్యమ్మంచు సన్మూర్తి తా
నరయన్ చిజ్జడయుక్తుఁడంచును విశిష్టాద్వైతమున్ జాటి శ్రీ
హరియొక్కండె యుపాస్యదైవమని యాఖ్యంగన్న రామానుజుం
డరుణస్ఫూర్తి జనించుటన్ మెఱసె మా హారీతగోత్రమ్మిలన్. 11

ఉ॥ సూరివరేణ్యులా యుదయసూర్యమరీచులు పోల్కఁగ్రమ్మ "నా
నూరి" సమాహ్వయంబగుచు శోభిలె భూతపురిన్ మదీయ మా
నూరికులమ్ము తిర్మలను జొప్పడి యుండెఁజిరమ్ము దాన నా
పేరును జంటగా వెలసెఁ బిమ్మటఁ బూర్వనివాస చిహ్నమై. 12

చం॥ తిరుమలవేల్పు చెంత వినుతింగను శిష్యులు గౌరవింపఁగాఁ
బరఁగెడు మా ప్రపూర్వులను భక్తిమెయిం దగ "నూజివీటి" పెం
దొర కొనిపోయి తానొసఁగెఁ దుష్టిగ "కొండురు" పేరియూరు నా
గురుతుగ నయ్యభిఖ్యయును గూడెను మాఁడవ యింటి పేరుగా. 13

వ॥ పిమ్మట కతిపయకాలంబు గతింప క్రమ్మర కడలికూడలికి దిగువ యోజనత్రయావస్థితయగు కృష్ణాస్రవంతికిఁ గ్రోశపరిమితపూర్వతీరమున కన్యాహ్రదంబు పొంత నూజివీటిభూజానివితరణ కుదాహారణమ్ముగా,

మ॥ వరశ్రీరంగపురాగ్రహారమును సంపాదించి యందొప్ప శ్రీ
హరి రంగేశున కన్వహమ్ముఁ గృతవంశాంగమ్ము విన్పించుచున్

భూతపురి = శ్రీ పెరుంబుదూరు. (ఇది మద్రాసు సమీపమందున్నది.)

మద్రాసు రాష్ట్రములో కృష్ణామండలమునందు "నూజివీడు" జమీందారుల యునికి పట్టు. వారు ఇచ్చిన గ్రామము "కొండూరు"

బరఁగన్ బూర్వులు; మాదువంశమునకున్ బాటిల్లె 'పంచాంగ' సం
జ్ఞ రుచిన్ నాలవయింటి పే రగుచు ప్రాజ్ఞత్వమ్ము రూపించుచున్

వ॥ ఇప్పగిది నస్మదీయ హారీతగోత్రంబు శ్రీమత్పదమ్మనూచానమై వెంటనంట "శ్రీమదాసూరి తిరుమల కొండూరు పంచాంగా"భిధానమై పరగె నందు.

చం॥ కలిమిపడంతిచెల్వ సహకారమునం బ్రభవించి రోలి మా
కులమున నెందరో గురులు కోమలశీలురు పుణ్యపూరుషుల్
వెలిసిరి మాకుగా తమదు నిర్మలవృత్తము వారలెల్లరున్
సలిపి మహోపదేశములు సంస్కృతమూర్తులఁ జేసి శిష్యులన్. 17

ఉ॥ ధైర్యఘనుండు మాదు ప్రపితామహుఁ డూరికిఁ బెద్ద వెంకటా
చార్యుఁడు రంగధామునకు సౌఖ్యముఁ గూర్చెడి ధర్మకర్త య
య్యార్యునకున్ నృసింహగురుఁ డాత్మజుఁ డామహితుండు ముగ్వురన్
గార్య పటిష్ఠులన్ సుతులఁ గాంచె నొగిన్ నరసింహ కృష్ణమా
చార్య జగద్వరాఖ్యుల విశారదులన్ జనతేష్ట శీలురన్. 18

వ॥ అందు జ్యేష్ఠుండు నృసింహాచార్యుండు

కం॥ నరసింహుఁడు మంగళగిరి నరసింహుఁడె యంచు బుధులు నా
డెము సేయన్
వరకర్మాచరణంబున ధర నావస్తంబుఁ డనఁగఁ దనరెన్ నిష్ఠన్.

ఉ॥ తామరతంపరై పయిరు తండము లేపునఁ బెంపు నొందుచున్
శ్యామలమూర్తులై కణిశ సంపదనూగుచు లెస్స పండగా
గోమున బత్తె లావులును కుంభము నిండగ పాలుపిండ, నా
సామిగ కృష్ణదేశికుడు సన్నుతుఁడయ్యెఁ గృషి ప్రధానుడై. 21

వ॥ మఱియు నమ్మహాశయుండు, 22

కం॥ ఇచ్చినది యౌషధమ్ముగఁ
బుచ్చుకొనన్ వ్యాధు లెడలి పోవఁగ జనులున్
నచ్చిన యారోగ్యమ్మున
మెచ్చఁగ నితఁ డమృతహస్త మితుం డనుచున్. 23

---

జగద్వరుడు= జగన్నాథుడు.

ఉ॥ పట్టినవారిరోగములు పాఱఁగ వెజ్జులమేటియొజ్జయై
ముట్టినదెల్ల బంగరుగ మోమున నవ్వువెలుంగు లూరఁగాఁ
బుట్టిన పుత్త్రపుత్త్రికలఁ బూచిన తంగెడుపోల్కి మించఁగాఁ
గట్టినయింటఁ గోరిన సుఖంబులనొప్పెను గేస్తు మిన్నయై. 24

తే॥ సరససంగీత సాహితీ జ్యోతిషముల
నుభయ వేదాంత పాండితి కొడయఁ డగుచు
పద్యగేయ ప్రబంధ సంపన్న రచన
బ్రథితుఁ డల్ల జగన్నాథ పండితుండు. 25

వ॥ మఱియు నీయాచార్యవరేణ్యుండు. 26

తే॥ రంగనాథునికోవెల రాచరికము
తీర్చుచును మంత్ర భాష్యోప దేశములను
తేనె చిలికెడు పల్కులఁ దెలియ జనులు
వించుచుఁ బురాణముల లలిఁ బేర్మిఁ దనరె. 27

సీ॥ అల కృష్ణమాచార్యుఁ డెలప్రాయముననుండి
యర్ధాంగి యగు నరసాంబయందు
పంచమూర్తులఁగొన్న పరమాత్మచందాన
పంచాత్మజాకృతిఁ బరిణమించె
నం దగ్రజులు నృసింహాచార్య లక్ష్మణ
వెంకటరంగార్య విభులునాకు
వేంకటవరదాఖ్య విజ్ఞుండు తమ్ముండు
వేంకటాచార్యాఖ్య విలసితుండ

తే॥ నస్మదగ్రజుఁ డల నృసింహార్యవరుఁడు
వైదికాచార నిష్ఠాప్రభావశాలి
గృహ్యవిధిసూత్రధారియై గేస్తుమిన్న
ప్రథిత రంగేశ్వరాలయ పాలకుండు. 28

తే॥ అట్టియగ్రజు సమ్మత హస్తానుపాల
నమ్ము, వెలుగిచ్చు పినతండ్రి నవ్యబోధ

నారసింహ కళాశాల నవ్యశిక్ష
పైకి గొనివచ్చె నన్నుఁ నీ పాటికాఁగ. 29

కృతిప్రశంస

తే॥ వేంకటేశుని మహితేచ్ఛ వెలుగుచూపఁ
గావ్యరచనకుఁ బూనితిఁ గౌతుకమున
మంచియెల్లను నావేల్పు మహిమ యిందు
చెడుగు సకలమ్ము నాచేష్ట విడుఁడు దాని. 30

తే॥ అమలమాంధాతృజీవిత మమృతరూప
మఖిలవేద్యమ్ములనుదెల్పు నాగమమ్ము
పావనస్మృతి యాచార పంక్తిఁ దెలుప
ఘనపురాణమ్ము విశ్వప్ర కార మరయ. 31

మ॥ మురళీమంజులగీతికాలహరి తీ పున్నింపు మాతృస్ఫుట
స్వరసంపూరము జీవజీవమునకుం జైతన్య మొక్కించు సి
ద్ధరసం బుజ్జ్వల ధర్మసంపుటము మాం ధాతృక్షమాపాల స
చ్చరితం బన్వహమెల్ల వారలకు వి జ్ఞానప్రదం బిమ్మహిన్. 32

తే॥ పూజ్యమాంధాతృచరితంబు మొదలనేను
పలికినాడను గద్యప్ర బంధకలన
పద్యకావ్యమ్మునర్చెదఁ బరఁగదాని
హారువుగ "సమాజసామ్రాజ్య" మనెడు పేర. 33

తే॥ గ్రంథములలోనఁ గ్రొత్తలు కానరాఁగ
వచనకావ్యంబు కథలోన వన్నెపెట్ట
నలఁతిమార్పులు కొన్నింటి నచటనచట
దీనఁ గావించినాడను తీయమెసఁగ. 34

కృతిపతినిర్ణయము

సీ॥ మాన్య "సమాజసా మ్రాజ్యాఖ్య" మత్కృతి
యెవరి కిచ్చిన నిది యొసకమెసఁగు

మచిలీపట్నమువద్ద "చిట్టిగూడూరు"లో "నారసింహ సంస్కృతకళాశాల" యున్నది

ననుచుఁ జింతింపంగ నర్థచింత యొకింత
 తలదూరి కడ కది తలఁగిపోవ
బాల్యంబునన్నన్ను బరఁగఁ బెంచిన యన్న
 కిచ్చుట మేలని యెంచుచుండ
ననయంబు నినుఁబ్రోచు నాశ్రీనివాసున
 కొసగ సర్వవిధాల నొదవు శ్రేయ
తే॥ మనుచు నాయంతరంగము నందు బోధ
కలిగె కవియును కావ్యము కవిత యతఁడె
కాన నొసగుదు నాయేడు గడను దీని
సరసి నీరును సరసిని జల్లినట్లు. 35

ఉ॥ నాయకుఁ డెచ్చువాడయిన నవ్యత కబ్బును కన్నకుం గథా
నాయకుఁ డొప్పువాడయిన నాణెము హెచ్చును కావ్యమూర్తికిన్
నాయకు లిర్వురున్ జగము నాయకులౌట మదీయకావ్యమ
త్యాయత తత్త్వభావమున నాయతి మంజుల వృత్త మయ్యెడిన్. 36

సీ॥ దేదీప్యమానమౌ దివ్యకిరీటమ్ము
 భానుకాంతి శిరమ్ము పైన మెఱయ
కమనీయ సుస్నిగ్ధ విమలాననమ్మున
 కస్తూరి తిలకంబు సిస్తు తనర
పుండరీకంబులఁ బురుణించు కందోయిఁ
 గరుణారసస్ఫూర్తి కడలుకొనఁగ
కౌస్తుభ శ్రీవత్స కలిత వక్షఃపీఠి
 గరుణాస్వరూపిణి కమల వెలయ
తే॥ మొదలిచేదోయి నరి దరములు రహింప
తక్కుఁగేల్దోయి నభయముద్రలు చెలంగ
తలఁపుఁ దన్నిడి నడుగుపొందమ్ములలర
శేషగిరి శృంగమున మించు శ్రీనివాస. 37

వ॥ భవదంకితమ్ముగా నొసఁగు "సమాజసామ్రాజ్య" సంజ్ఞకైన తన్మహా
కావ్యమ్మునందు. 38

చం॥ పలుకులు భావముల్ మధుర ÷ భంగిమఁ జొప్పడ సత్యవస్తుతా
స్ఖలిత కథాస్వరూపము ప్ర ÷ శస్త రసధ్వనిచార్వలంకృతుల్
లలితగుణంబులున్ మెఱయ ÷ లక్షణ లక్షిత వృత్త రమ్యమై
చెలువునమించి మద్రచన ÷ చెల్లఁగ నబ్బెనె సర్వకారణా! 39

వ॥ శ్రీవెంకటాచలపతీ! మున్ను వైశంపాయనుండు జనమేజయునకు
నెఱింగించిన తెఱంగు విన్నవించెద నవధరింపుము. 40

కథాప్రారంభము

ఉ॥ ఉత్తర కోసలంబున న ÷ యోధ్య యనం దనరారు పట్టణం
బుత్తమమై ప్రసిద్ధిఁ గనె ÷ నుర్విఁ బవిత్ర మహాస్థలంబులన్
సాత్త్వదిసూర్యవంశ్యులకు ÷ సొంపులనొక్కఁగ విశ్వకర్మ మున్
గోత్రలఁ దీర్చి వేల్పులకుఁ ÷ గోరికవుట్ట రచించె నప్పురిన్. 41

చం॥ ఒకమత మొక్కబాస కుల ÷ మొక్కటియై విలసిల్లు లోకులం
దొకటిగ నొక్కకట్టుబడి ÷ నొప్పుగ నిల్చు నభేద్యరూపమై
ప్రకటము తత్పురీవరణ ÷ బంధము వైరుల కట్టయోధ్యమై
యొకటిగఁ జుట్టియుండుట న ÷ యోధ్య యనంబడెఁ దత్పురంబిలన్.

కం॥ సరయూనది యా ప్రోలికి
వరణము వలుగడలఁ జుట్టి ÷ పరిఘాకృతిగా
నిరవయి పరిశుభ్రజలో
త్కరమునఁ దనరారుఁ గమల ÷ కమనీయంబై. 43

మ॥ సరయూసార జలప్రసేకముల సం ÷ స్ఫారంబు పెంపొందఁగా
నరటుల్ పోకలు నారికేళములు నా ÷ మ్రాసికముల్ ద్రాక్షవం
దిరులున్ దాడిమసంతతుల్ పనసలున్ ÷ నిండన్ ఫలశ్రేణి నా
పురికిం దోటలు చుట్టుశైత్యమును సొం ÷ పు న్నింపు నేకాలమున్.

మ॥ జలయంత్రమ్ములు నీటితుంపురులు వి ÷ స్తారమ్ముగాఁ జిమ్మఁ బ్ర
క్కలఁ బూఁదీవియ లల్లిబిల్లిగొని శృం ÷ గారంబు జూపింపఁ గ్రొ

వల రమ్యంబగు వింతమొక్కలగమి సువ్యక్తోరు వర్ణాకృతిన్
జెలువొందన్ శశికాంత వేదికలు సుస్నిగ్ధంబులై భాసిలన్ ॥ 45

చం॥ నగరచతుష్పథంబులకు నల్గడలన్ విరిదోఁట లొప్పఁ బ
ల్వగ చిలుకల్ మయూరములు పావురముల్ కనుదోయికామితన్
దగ ఘటియింపఁ దెమ్మెరలు తావులఁ దార్చి సుఖంబుగూర్ప విం
తగఁ బెనవైచి ప్రోచిన లతామయ జంతులఁ జిత్రచిత్రమై॥ 46

కం॥ పురవీథులు చిఱుసందులు
పురజనహృదయంబు లట్లు పొరి నిర్మలముల్
విరహిత కుటిలత్వంబులు
విరిబోణుల రమ్యకేశ వీథులు వోలెన్ ॥ 47

ఉ॥ ఆపురిసౌధరాజి, భవనావళి బారులుతీరి మింటికిన్
దాపయి సర్వతోముఖ సుధారచనాధవళప్రదీప్తులన్,
లోపము లేక కోకగణ లుప్తముఁగాక చెలంగు చంద్రికా
లేపము సర్వకాల మవలీల ఘటించును చుట్టుపట్లకున్ ॥ 48

శా॥ ఆ సౌధంబులమధ్య కెంపుజిగి రమ్యాకారమై ముఖ్యరా
ట్ప్రాసాదంబు సితాంబుజాళి నడుమన్ రక్తాబ్జ మట్లొప్పెడిన్
భాసిల్లన్ శిఖరాళి పర్ణములుగా, బంగారపున్ దుద్దుగా
భాసింపన్ వరచంద్రశాల, సిరులన్ బద్మాలయావాసమై ॥ 49

తే॥ ఇల్లుచూచిన నిల్లాలి యింపు తెలియుఁ
బురము కనుగొన్నఁ బౌరుల భోగభాగ్య
గరిమ లారోగ్యనాగరకతలుఁ దెలియుఁ
బ్రజలఁ గాంచిన పాలకప్రౌఢి తెలియు ॥ 50

చం॥ నెలసరిమూడువానలుగ నిండఁ దటాకము లేఱ్లు పార ని
ట్టలముగ నీటిపంటలు, కొటారులుపట్టని మెట్టపంటలున్
దలములు చాలకుండెడి విధంబున పండఁ గుబేరులై ప్రజల్
పిలపిల లాడ సంతతియుఁ బేర్మి చెలంగుచు నుండి రాపురిన్ ॥ 51

చం॥ పరఁగును రాచకర్జముల । పట్ల సమష్టికుటుంబ రూపమై
వరలును సాంఘికంబులను । వావిరి వృద్ధకనిష్ఠరూపమై
తిరుగు మతప్రమేయమగు । తెన్నున దేశికశిష్యరూపమై
కరుఁగుఁ గులంబు మేలిమికిఁ । గాంచనమై జనమప్పురంబునన్ ॥ 52

కం। వారలు పరోపకృతులన్
శూరులు నిజధర్మములను । సూరులు తీర్పన్
వీరులు లోకము లేలఁగ
ధీరులు భువనైకహితము । తీర్పఁగఁ బేర్మిన్ ॥ 53

మ॥ ఇటులాదర్శగుణపరిపూర్ణ జనతా । బుద్ధం బయోధ్యాఖ్య త
త్కటకం బిట్టులె కోసలంబును సమీ । కస్తోమముల్ వ్యాధిసం
కటము ల్లేమిని పాఁడిపంటలును వి । జ్ఞానంబు వర్ధిల్ల ముం
దటికాలంబున భాగ్యలక్ష్మికిని స । ద్మంబై చెలంగెన్ మహిన్ ॥ 54

యువనాశ్వుఁడు కోసల దేశమును
ప్రజానురంజనముగ పరిపాలించుచుండుట.

ఉ॥ ఉత్తమమైన తొల్లిఁటి స । మున్నతి చెందగ నేలుచుండె భూ
భృత్తులలోన మేటి ధన । వృద్ధుఁడు భానుకులోద్భవుండు రూ
పెత్తిన రాచవాడి పొడ । వెత్తినచాగము కార్యశూరుఁడు
న్మత్తుల వేరుపుర్వు యువ । నాశ్వుఁడు సన్మతిఁ గోసలావనిన్ ॥ 55

తే॥ ఆడికొందురు తత్ప్రజ । లాన్నృపాలుఁ
బరులదాక్షిణ్యలబ్ధికై । ప్రాకులాడఁ
డిచ్చవచ్చిన మేల్కార్జ । మెంతయేని
చెడుపుకలిగిన విడువక । చేయు ననుచు ॥ 56

తే॥ తప్పులెట్టివో యొప్పుల । తత్త్వ మేదో ;
తీర్చి చెప్ప నశక్యంబు । దేశజనుల
కళల విజ్ఞాననాగర । కతలఁ బట్టి
యొప్పు తప్పును వినిమయ । మొందుచుండు ॥ 57

తే॥ ఏది యెటు లున్న నచ్చట నెంచి చూడఁ
బ్రజలు రాజునకై రాజు ప్రజలకొఱకు
గ్రహణదోషంబు పవలును గలుగనట్టి
సౌమనస్యత్రముల మాడ్కి సాక్కుచుందు॥ 58

తే॥ భార్య చేసినపాపంబు భర్తఁ జేరు
ప్రజలొనర్చిన పాపంబు ప్రభువుఁ జేరు
నతనిపాపంబు తత్పురోహితునిఁ జేరు
శిష్యుఁడు పొనర్చుపాపంబు చేరు గురుని ॥ 59

తే॥ ప్రజలు నృపతియు నిటు తమ పాఁడి నెఱిగి
నడుచుకొనుచుంద్రు గాన నానాడునందు
కలుగ నొకరికి నొకరిపై నలుక లెప్పుడు
నందరికి నంద రయ్యెద రవసరముల ॥ 60

కం॥ మంతనములేనిపాలన,
చింతనములులేని చదువు చిత్తములందుఙ్
పొంతనములేని పొత్తును,
రంతులమూలం బటంచు రాజేంద్రుఁడు తాఙ్ ॥ 61

వ॥ సుమంత్రి సుషేణ సునీతి సుమతి సమాఖ్య సచివచతుష్టయ మంత్రంబు సాయంబుగాఁ జేకొని కోసలదేశంబు సుప్రశస్తంబుగాఁ బాలించుచు జీవితజ్యోతి యగు నిందిరాదేవితో సుఖంబుండె. అయ్యెడ నొక్కనా డయోధ్యాపురంబున —

యువనాశ్వమహీపాలుఁడు రాజకుమార
విద్యాలయ వార్షికోత్సవ సమితి కధ్యక్షుఁడుగా నేగుట

ఉ॥ బాలహితైషిణీసమితి పాలనభూషితరాట్కుమార వి
ద్యాలయ వార్షికోత్సవ సభాధిపతిత్వము చేకొనంగ వే
డ్కోలును దెల్పె పెద్దయటఁ గోమల రూపవిలాసశీలురౌ
బాలుర ముద్దుముచ్చటలఁ బాల్కొన నీకొని నీనృపాలుఁడుఙ్ ॥

ఉ॥ ఆసమయంబు తీర్ప యువనాశ్వుఁడు పుష్పరథాధిరూఢుఁడై
యా సభ కేగి పీటఁగొని హాయిగఁ బుత్త్రిలహాసరోచిరు

ద్భాసిత వస్త్రులన్ రుచిర § వస్త్ర పరిష్కృత రమ్యగాత్రులన్
శ్రీసుతమూర్తులన్ బలుక § రించెడి బంధులమధ్య నొప్పగాన్ ॥ 64

వ॥ ఆ తరుణంబున నా సంపన్నగృహస్థులు,

తే॥ పుత్రగాత్ర పరిష్వంగ § ముదముతోడ
సుతుల శిరములు మూర్కొను § సుఖముతోడ
కొమరుల విలాసభాషణ § భ్రమలతోడ
నితరమెఱుఁగకయుండ నీ § నృపతి యపుడు — ॥ 65

చం॥ గుటకలుమ్రింగుచున్ గెలనఁ § గుడ్యములన్ గుణబోధనమ్ముగా
ఘటితములైన చిత్రములఁ § గాంచుచుఁ దృష్టి విహీనుఁడై మదిన్
గటకటచెంది యేదో తన § కల్మికిఁ దక్కవగా నశాంతుఁడై
నటుల మెలంగుచుండఁ గని § యం దొకబంధువు సానుభూతిగాన్ ॥ 67

తే॥ "చిన్నియువరాజు లుదయింప § వెన్నుకరుణఁ
బాలశాలకు మాకును § బందుగులకు
ప్రజలకును హర్ష మయ్యెడిఁ § బ్రభుత వెలయుఁ
బోరసెడిని నవ్య తేజమ్ము § పూర్ణతయును ॥ 68

వ॥ అనుటయు నంత, 69

తే॥ పరిణతవయస్కుఁడు మఱొక్క § బంధువని యెఁ
దప్పక జనించు తేజస్వి § తనయుఁ డింతఁ
గంటి శకునంబు నామాట § కల్ల కాదు
వేగిరముచేయఁ బ్రొద్దును § వేగపడునొ! ॥ 70

తే॥ అనుడు నరపతి "ఉస్సు"ని § యాస్య మెత్తి
ప్రొద్దువాటాలినను వేఁడి § పో దదేమొ!
యుడుకపెట్టుచునున్నది § యుగ్రముగను
తడవదేలకొ ముందటి § తంతు నడప! ॥ 71

తే॥ అనుచు నటునిటుఁ దిలకించు § నంతలోనఁ
గార్యదర్శియు నరుదెంచి § "యార్యులార,
యగ్రపీఠముఁ గైకొన § నస్మదీయ
నృపవరులఁ గోరుచున్నాడ § నెలమినిందు" 72

తే॥ అనఁగ సభ్యులు నానంద మినుమడింపఁ
జప్పటులుగొట్టి తమయిష్ట మప్పగించి
రన్న రేంద్రుఁడు జేరె నగ్రాసనంబు
పౌనరెఁ దత్కంఠసీమను పూలమాల ॥ 73

అధ్యక్ష పదస్థుఁడై యువనాశ్వుఁ డుపన్యసించుట.

చం॥ అనియె నృపాలుఁ డంత వినయంబుగ మాలనుదీసి పీఠిపై
నునిచి, సులోచనమ్ములను నొయ్యనఁ దీసి చెమర్చుకన్గవన్
తనమృదులాంగుళిత్రయి నిదానముగాఁ బొదలించి చెన్నుగా,
నునుకయివల్వ నద్దములు నూత్నరుచిం జెలువొందఁ జేయుచున్ ॥ 74

చం॥ మనుకులముఖ్యులార! యిటు మన్ననఁ జేసిన మీ యుదారతా
ఘనత ప్రశంసనీయమిటఁ గార్యగురుత్వముచూపి యెల్లరీ
దినలలితోత్సవమ్మునకు దీప్తినొసంగుట శ్రేయ మెంతయున్
మనకులభాగ్యమీ శిశుసమాజ సమున్నతి గాదె చూడఁగన్ ॥ 75

తే॥ మనదు కులభాగ్యమే కాక మనుజకోటి
భోగ భాగ్యమ్ము లున్నతి పుణ్యతపము
లెల్ల సౌభాగ్యములు పేర్మి నెసగుఁ గెల్ల
నీ కుమారసమాజాభివృద్ధిఁ గాదె ॥ 76

తే॥ బాలుర భవిష్యమే దేశభాగ్యమగుట
నా భవిష్యపు సాధంపుటస్తిభార
మచలగతి కట్ట నవసర మదియు నేఁడు
పరుల నేరిమి యుప్పాట నరికెచోడు ॥ 77

చం॥ కులమతజాతివైరములు గూడులుకట్టి సమాజవృక్షమున్
మలినము జేసినై చెను కుమార్గము పట్టెను కూటధర్మముల్
తెలుపుట నన్యదేశ్యజన దీకృత విద్యలు; నాని నేలకున్
బులిమి యథార్థసంస్కృతిని ముందుకుఁ దెచ్చుట ముఖ్య మిత్తఱిన్,

మ॥ పరఖండస్థితధర్మహీనజనతా భద్రాంకరపాక్రియా
కరవా విద్యల పద్ధతుల్ విమల సంస్కారమ్ము తూలించుచున్

మరితాకారపు దాస్యవర్తనము పా § దూవాహతన్ నేర్పెడిన్
బరిపాలించెడి పాటి మేటినడతల్ § పాయంగ దూరంబుగాన్ ॥ 79

చం॥ బుడుతల మేలివర్తనకు § ముచ్చటఁ గూర్చెడి తేటపల్కులన్
నుడివెడు పాఠముల్ గలుపు § నూత్నవిధానము గూర్పఁగావలెన్
నడచెడు నర్థకామపు ట § నర్థగతుల్ విషమప్రచారముల్
తుడిచి పవిత్రధర్మమయ § దుగ్ధఝరమ్ములు త్రిప్పుడీ భువిన్ ॥ 80

చం॥ పరహిత వర్తనమ్ము పర § బాధ లడంచు నుదారశీలమున్
పరిజన వత్సలత్వమును § పాలన పాండితి బాహువీర్యమున్
చిరుతతనంబు నంద విర § చించెడిబిడ్డలు నేర్చనొప్పెడిన్
చిరుతతనాన లేనియెడ § చెట్టది వంగక మ్రాను వంగునే!! 81

తే॥ నేఁటిచదువులు కొమరుల § తేటఁదూల్చు
చిత్తమునకును, భారముల్ § చేతులకును;
బాల హితకారిణీసభ, § పాటుఁ గాంచి
ముఖ్య విద్యా విధానమ్ముఁ § బూన్పుగాక ॥ 82

వ॥ తదీయాభినవవిద్యావిధానం బగ్రిమనూనవసమాజాభ్యుదయంపు
మేలిప్రొద్దునకు నుషఃప్రభాపూరమై పరిఢవిల్లఁగాక ॥ 83

తే॥ కొమరుల వినోదములు గాంచఁ § గుతుకపడెడి
మీదు మధురక్షణమ్ములు § మ్రింగనింక
నమృతఘుటికల విధమున § నాస్యమందు
ఘటిక లియ్యెడ వికలల § కరణి కరుగు ॥ 84

వ॥ అని వచించి నిజాసనంబున నుపవిష్టుండయ్యె. తదవసరమ్మునఁ దదా
శయానుసారమ్ముగ హాస్యవీరరసోదంచనంబులైన యాటపాట లతి
చమత్కారంబుగా నడుచుటయు నందు ప్రతిభాశాలులగు బాలుర
కుఁ బ్రోత్సాహకరమ్ముగాఁ బారితోషికమ్ముల నిర్ణీతమ్ముల సక్ర
మమ్ముగా నొసంగి యయ్యధ్యక్షమహాశయుండు తుదిపల్కులు
వినిపించి సమితికి స్వస్తిచెప్పి తానును సగౌరవముగా వెడలి యట
జరిగిన బంధుప్రసంగంబు సంస్మరించుచు సదనంబునకు జనుదెంచి

చెలియలు సుపుష్టాదేవి సంతానమ్ముతోడఁ బ్రతిష్ఠానపురంబునుండి
వచ్చిన వార్తవిని యామెఁ జూడ నంతిపురంబున కరిగె నక్కడ ॥ 85

యువనాశ్వుఁడు, చూడ చనుదెంచిన చెలియలి సంతానపు
ముద్దు ముచ్చటలతో సుఖముండుట.

మ॥ పసివానిం దగ చంక నెత్తికొని సౌ ✽ భ్రాత్రింగా నేత్రంబులన్
బ్రిసరింపన్ "బటితండ్రి! చూడుమరుగో ✽ మామయ్య లేతెంచి" రం
చు సుతున్ లాలనచేయుచున్ ముదముతోఁ ✽ జొత్తెంచి నట్టింటి కం
త సుపుష్టాసతి యగ్రజున్ దరిసె నా ✽ ధాత్రీధవుం డర్మిలిన్ ॥ 86

మత్త॥ చిన్నియల్లురు వచ్చినారలొ ✽ జిల్గువెన్నెల తేటలై
చిన్నినవ్వులు జిల్గువాతెఱఁ ✽ జిందులాడఁగఁ గుల్కుచున్
జెన్నుమీరఁగ లక్కచిట్టియ ✽ చెల్వమొప్పెడి నోటితోఁ
గన్నతమ్ములఁబోలు కన్గవఁ ✽ గన్నకూరుము లూరగాన్ ॥ 87

తే॥ అనుచుఁ జిటిబుగ్గమీటఁగ ✽ హస్తములను
వ్రాలు నల్లుని గైకొని ✽ వలపు లూర
ముద్దులాడుచు నాసన ✽ భూషణముగఁ
గూరుచుండిన నిందిరా ✽ కువలయాక్షి ॥ 88

శా॥ చెంతంజేరిన, నల్లుఁ జేతులకు ని ✽ చ్చెం గూర్మిదీపింపఁగా;
నంతన్ శోణసరోజకోరకమనో ✽ జ్ఞానందమూర్తుల్ నిజ
స్వాంతమ్ముల్ విరియంగఁ దల్లికడకున్ ✽ స్వస్రీయు లేతేర న
త్యంతప్రేమఁదదర్భకాళిఁ గొని ము ✽ ద్దాడెన్ నృపుం డింపుగాన్ ॥

వ॥ అంతం జెంగట నోరగా నిలిచియున్న చెలియలింగాంచి తల్లీ! 90

తే॥ మఱఁదులకు మీకు సౌఖ్యమె ? ✽ మాన్యులైన
బందుగులకును సేమంబె ✽ భద్రమె కద
చిఱుతలకు ? నెల్లవారికి ✽ సేమ మగునొ ?
యెక్కువలు లేవె ? యిచటికి ✽ నెపుడు రాక ? ॥ 91

చం॥ అనుడు నిసర్గజంబగు భ ✽ యంబున నెల్గు వడంక కంతమున్
దనరఁగఁజేసి యావనిత ✽ దైవకృపన్ సకలంబు భద్రమై

పానరుచుమున్నదీ దినము * ప్రొద్దుననే యిలువిడి యింతకున్
మును పిటఁ జేరినారము ప్ర * మోదమె మీకు ననామయంబుగాన్?

చం॥ అసియొమనంత వృక్షముల * నంటిన బంగరు వన్నెమాయనై
చనుటయు గృహ్యాబ్జాతతి, * సంస్తుత చారుకపోతజాలమున్
గునగున వచ్చిచేరఁ దమ * గూండ్ల గనుంగొని “కుజ్జులార! వేఁ
జని పానరించి వచ్చెదను * సాంధ్యవిధిన్ వసియింపుఁ డియ్యెడన్”
తే॥ అనుచు నరపతి నిజసౌధ * మునకు వెనుక
నుపవనంబున నొఱపుగా * నున్నయట్టి
స్వచ్ఛతమ వాఃప్రపూర్ణ కా * సారమునకు
నరిగె బుడుతలఁ జెలియల * కప్పగించి ॥ 94

తే॥ అంతఁ గొన్నాళ్ళు కలకల * లాడె నగరు
పైనఁ బిక్కలఁ గుసుముల * బంతులందు
మామ కత్తెకు బుడుతలు * మక్కువగను
మెలఁగుచుండిరి వారును * మెలఁగి రెలమి ॥ 95

వ॥ ఆసమయంబున— 96

కం॥ ముద్దులగనులౌ నిసువుల
నుద్దులతో నాటపాట * సొంపులతోడన్
విద్దెలచెలువముతోడను
పొద్దులు తెలియకయ చనియె * భూరమణునకున్ ॥ 97

తే॥ ఇట్టు లొకనెల కడచనె * నెలమితోడ
నెఱవు సొమ్ములవేరికిఁ * దిరములగును?
చెల్లెలిని పంపుఁ డని వార్త * చేసె మఱఁది,
యనిచెఁ జెల్లెలఁ జిఱుతల * నవనిపతియు ॥ 98

యువనాశ్వుడు చెలియలను పిల్లలను బంపివైచి
చిన్నపోయిన ప్రాసాదమును జీవితమును తలచి చింతిలుట

తే॥ వారి నటుపంపి నృపతియు * వచ్చిచూడ
హర్మ్య మంతయు బావురు * మనుచు నుండె

ముంగిళులు మూకనోమును బూనియుండె
నంతిపురముండె నిర్జన మైనయట్లు. 99

తే॥ ఏదొ చీకాకు తలలోన నేదొ పుర్వు
తొలచుచున్నట్టు లటునిటు మెలఁగు నృపతి,
యూరకయ పోయి యొకమూల నొదిగి నిలచు
వికలుడై యుండు నవయవ వికలునట్లు. 100

తే॥ వెలయు నుపహార భోజన వేళలందు
బోసి బోసిగఁ గనిపింపఁ బొగులుచుండుఁ
బూవుఁదోఁటను శుక కేకి పూర్ణమైనఁ
గాంచు నిర్జీవమట్టులు కాంక్షమాని. 101

తే॥ ఏదిచూచిన జీవవిహీనమట్లు
కానిపింపఁగ, మున్నిటు కానరాదె!
అకట! చెలియలు సిరియెల్ల నపహరించె
ననుచు లోలోనఁ జింతించుఁ దనుపు లేక. 102

వ॥ నాటఁగోలె నాకోసల మహీశుం డపత్యహీనత తనకు తనమహత్తర
సంపదకును మేటిలోటుగాఁ గాన్పింప నాలోపముఁబు లోపించు తెఱం
గుఁగానక యంతరంగమ్మున గాటమ్ముగ మఱుగఁజొచ్చె. 103

వసంతఋతు వర్ణనము

ఉ॥ అంత వసంతమొప్పెను లతాంత నితాంతనవస్వరూపమై
కంతుసఖుండు కోకిలలు కమ్రరసాలకిసాలయంబులన్
బంతమెలర్ప నూచుచును పారణసేయుచుఁ జైత్రకావళిన్
సంతసమొందఁజేయఁగ, రసాతలమంతటఁ దానె రాజుగాన్. 104

సీ॥ మృదుహాసరాశినాఁ బొదలు వెన్నెలపోవు
బుడుతలనాడంగఁ బ్రోత్సహింపఁ
దలవాకిళులయందుఁ జలువపానుపుఁదెఱల్
విరిమల్లియల తావి వేడ్కఁగొలువ

కలవారిముంగిళ్ళఁ జెగిల ధౌతపాత్రిలు
కలమాన్నదధిపూర కలనమెఱయ
రచ్చపట్టులు వాడ రచ్చబండలు తిన్న
లిష్టకథాగోష్ఠి నింపుమీర
తే॥ మధురశుభకర మాధవ మాసమందు
శుక్ల పక్షపు మునిమాఘ సొంపు, మిగులఁ
బగటివేళల యుడుకుల వెగటుమాన్పి
ప్రాణికోటి సమాదర పాత్రమయ్యె. 105
వ॥ ఆయెడ నొక్కనాడు. 106

యువనాశ్వుఁడు రాత్రివేళ మారువేసమునఁ బౌరవృత్తమరయుట.

ఉ॥ రాతిరి వేళ భూపతి పురంబునఁ బేర్కొను నాత్మవృత్తి మే
రీతినొ గాన నొంటిగఁ దిరించిన యుజ్జ్వలవేషమూడ్చి పౌ
రేతరవేషమూని చనె నిమ్ములు నిల్పుచు సంనుగొందులన్.
జాతికథాప్రసంగములఁ జర్గుల వించును వీథివీథికిన్. 107

ఉ॥ అందు వినోదమంటపము నందున విప్రులు గుంపుగుంపుగాఁ
గ్రిందను చౌకముల్ పరిచి కేరుచుఁ గూర్చొని పవ్వళించియున్
బొందుగ పండువెన్నెల ప్రమోదముకూర్పగ నిచ్చవచ్చు వ
ల్చందముతైన సంగతులు చర్చలుచేయుచు నుండి రత్తఱిన్. 108
చం॥ ఒకఁ డనె పెండ్లికిన్ జగు ప్రయోజనమెయ్యదిః కామతృప్తియో!
ప్రకట తనూజ సంపదయొ! భార్గవదీక్షిత! పల్కుమింత నాఁ
డ్రికమక లేక యాబుధుఁడు తెల్పెను పెండ్లికి పుత్రసత్ఫలం
బొకటియె యాప్సితంబచట నుండదు రెండవుకోర్కి యంచనన్.
వ॥ నావుడు నావృచ్ఛకుండు వెండియు 110
తే॥ "ఒప్పు వేదమ్ములకు నగ్ని హోత్రఫలము
త్యాగ భోగ ఫలంబగు ద్రవ్య మిలను
పరఁగు రతి సుతఫలమయి పరిణయంబు—
శీల సద్వృత్త ఫలమయి చెలఁగు శ్రుతము". 111

చం॥ అనియెడి వృద్ధగాథ యుభ । యంబు ప్రయోజనమాచుఁ దెల్పఁగా
వినిచెద తద్విరుద్ధముగ; । వెల్లడిసేయుము తత్ప్రమాణ మం
చన వినవే వివాహ సమ । యంబున మున్నిడి పుత్రిసంపద
న్గనుట కటంచుఁ జెప్పఁగ! మ । వంబునఁ దల్పుము తత్సుపాత్రులన్.

వ॥ మఱియు వినఁదలఁచితేని వచించెద వినుము:—

సీ॥ ఆచార్యునకుఁ బ్రియ । మైన యర్థ మొసంగి
సంతాన తంతువు । సాకు మనుచు
సరవి విద్యాగణ । స్నాతకునకు విధి
యుపదేశ మొనరించు । చుంటఁ గనుము
సంతానమునఁ గాక । చదువుల ధనమునఁ
బురుషుఁడు పూర్ణత । బొందఁ డవని
ప్రజతోడనే గేస్తు । పరిపూర్ణుఁడగునని
ప్రాబల్క పత్యమ్ము । ప్రథమ మనదె!

తే॥ తగఋణత్రియ శుద్ధుఁడై । తనరువాఁడు
ముక్తిఁ బొందెడు నటు గాక । ముక్తి కొఱకు
జతన మొనరించువాఁ డఘః । పతితుఁ డవును
నిసువు దాటించు తండ్రిని । నిరయగతిని. 114

మ॥ వరశాస్త్రీయ కులీన సంతతికి గా । బ్రాజ్ఞ ప్రపంచమ్ము త
త్పరిపూర్ణత్వము కల్గ జన్మమునకున్ । వ్యారూఢ పాణిగ్రహ
స్థిర సత్కర్మ సుసంస్కృతిన్ నిలిపి రా । త్రిందోయు సత్సాంప్రదా
య రిరక్షామతి నన్యమార్గముల నిం । ద్యత్వమ్ము రూపించుచున్.

తే॥ సక్రమంబైన సంతతి । జాతి పెంపు
ఘన సమాజంపు నాగరి । కత్వ చిహ్న.
చెలఁగు వంశాఖ్యవిటపికి । జీవపదము
సొనరు పైతృకములకు నా । యుష్య మరయ. 116

తే॥ పుత్త్రుఁడొనరించు పుణ్యముల్ । పూర్వులకును
పుణ్యలోకమ్ముఁ గూర్చెడిఁ । బొనరువతని

వీర వంశమ్ము. కర్తకుఁ బెరుగు పుణ్య
జగతి సుఖములు భువినవి జరగు దనక. 117

తే॥ ప్రేమ మలక్ష్యంబు తావృశా వశ్య మిలను
కాంక్షఁ జేసెడి నాగరి క ప్రపంచ
మా యపత్యమ్ము పడయంగ నాత్మ వెలయ
జప తపో హోమ దానముల్ సలుపఁగనవె. 118

మ॥ అనపత్యం బగు గేస్తు మూసికి నా హాస్యంబు నగ్రాసనం
బును దూరంబును గేస్తు మూకమును; పు ప్పాగ్ గాయ లాగల్ పసం
దను పౌ వృక్షముఁ జీవకోటి వలె పు త్త్రిత్రా స పన్నునిఁ
జనులె వ్వేళల నాశ్రయించుటయు నా చారంబు నూ మిత్రమా!

శా॥ జాతీయాశయ సాంప్రదాయ విహితా చార స్వరూపమ్ము త
చ్చైతన్యమ్ము నొగిఁ స్వతంత్రతకి శి క్షారూఢి వెల్గింపగా
జాతివర్త్యనిరూఢమాత్మతయు సం భావ్యస్థితిఁ నిల్పఁగా
నాతిఁ బాణిగృహీతి ధర్మమున సం ధానించి రార్యుల్ సఖా.

వ॥ అదియునుంగాక. 121

తే॥ చంపకలతాంత సౌగంధ్య చారిమంబు
పారిజాత ప్రసూన స త్పరిమళమ్ము
నమృత సౌరభ మాధురి నతిశయించు
కోమలముద్దుల మధురిమఁ గోరఁడెవఁడు? 122

వ॥ అట్టియెడ —

ఉ॥ పాపల ముద్దుముచ్చటలు పండువులై హృదయేంద్రియావళిఁ
దీపనమొంచి వేసెడిని తీర్చుగృహమ్ము మహాత్మభావ్యతిఁ
గాపురమాశ్రితంబయి ప్రకాశిలనల్ప సమాజ శాఖలఁ
గోపుఁజెలంగఁ గెంజివుఁకు గ్రొందళుకుల్ వెలయించు నింపుగాఁ.

వ॥ కావున గృహిణి గృహస్థ జాతికి జీవనజీవాతువు. విశ్రంభవు
వినోదపరికరమ్మునగుటఁ దాదృశ సంతానమ్ము ఫలత్ప్రాప్తిఁ జే

యున్న. తొల్లి కర్దమాది తపోధనులుఁగూడ సంతానఫలంబుఁగోరి
గేస్తులగుటయుఁ దత్ఫలోపలబ్ధియగుడు నిలువాసి చనుటయు విదిత
చరంబని వెండియు నిట్లు వర్ణించె 125

తే॥ తండ్రి నిరయంబు దాటించి § తాఁ బుణ్య
జగతికెక్కించి యతఁడు § స్థానమునకు
నెట్టు ముక్తాతఁ బుత్త్రుఁడు § నిక్కువంబు
దానఁ బెండ్లికి ఫలము సం § తతి యొకండె. 126

తే॥ ఇచ్చవచ్చినయట్టులు § ముచ్చటించు
చాటుపద్యమ్ములంగాన § సత్యమిదలు
శ్రుతి నిరూపిత ధర్మంబు § సురిగిపోవ
జనులు పెడత్రోవఁ ద్రొక్కెద § రనియె నతఁడు. 127

శా॥ అంతం బల్లియ భాసుకుండొకఁడు స § ద్యస్సుక్త శేలాన మే
నంతం గప్పుచు వచ్చుకూర్యని యుప § న్యాసం బిదే మంచు న
త్యంతాసక్తిని బృచ్ఛసేయఁగ, వివా § హౌచిత్యలంబెద్ది నా
సంతానమ్మని చెప్పుచుంటిననియెన్ § శాంతాత్ముఁడై యాతడున్.

శా॥ కానీ మిత్రమ! మున్న మీనృపతి వె § న్కన్ బాలురే తేర ను
ద్యానాంతర్భవికేగి నాతనికి సం § తానంబు కద్దో? "ఉహూ"
యేను న్నీవు జనాళితో కొమరులా § నేఁ! బాప మాధార్మిక
త్మారాధుండును రిక్తుఁడయ్యెనుగదా! § సామాన్యమర్త్యస్థితిన్.

శా॥ ప్రార్థానుగుణంబుగా జగతిఁ బు § త్త్రప్రాప్తి లేకుండగా
ఘోరంబౌ ప్రతిబంధక ప్రకర మా § క్రోశింపఁజేయున్ గృహిన్
ధీరుం డాప్రతిబంధకప్రతతి భే § దింపన్ వ్రతేష్ట్యాదులన్.
దూరంబైన యపత్యముం దరిని సం § తోషంబుగాఁ బొందెడిన్. 130

తే॥ అనుచు భాషించుచుండంగ § నంతలోన
పాంసుపటలంబు పైఁబడఁ § బరిచినట్టి
చౌకములనెత్తి దులుపుచు § సత్వరముగఁ
జనిరి వారలు తమతమ § సదనములకు, 131

ఉ॥ ఆస్మృతి నోరగానిలిచి । యాద్విజభామల నాలకించుచున్
మేమర పాంసుజాలము స । మీరసమీరిత మై పయుంబడన్
మోదముడక్కి చిత్తమును । ముంపగ చింత యు గాలిదెబ్బ కున్
బోవిడిగ నాన్యపాలకుడు । పోయె గృహమ్మునకున్ ద్రుతమ్ముగాన్.

యువనాశ్వుండు సంతానహీనతకు చింతించుట

ఉ॥ వేసముమార్చి సెజ్జపయి । వెల్లికిలం బవళించి యాత్మలో
భూసుర వాక్యముల్ శ్రుతి వి । భూషణముల్ చవిగన్న వీయెడన్
ధీసచివుల్ విముగ్ధతను । తెన్ను నెఱుంగకయుండు నాకిటన్,
మోసము లేదు వీసమును । మోహము వీడి చరింతు ముందటన్. 133

మ॥ అహహా! సంతతిహీనజీవనము గా । ఢాంధప్రియంభావుకం
బిహలోకంబున పూరుషావళికి నూ । హింపన్ బహిర్జీవ మే
మహితంబైన యపత్యమయ్యది యు సం । ప్రాప్తంబు గాకున్న వా
ని హితంబెయ్యది? జీవచ్ఛవుడయి యున్ । నిర్జీవుడే వాడిలన్. 134

తే॥ మోముఁ గన్గొనఁ గన్గవ, । ముద్దు వెట్టఁ
బెదవులు, కవుగిలింపంగ । నెదయు, నెత్తు
కొనఁ గరద్వయి, యూరువు । లూరొవంగ
సొరిది నుబలాటపడ, నాత్మ । సుతుసెఁ గోరు. 135

శా॥ ఆ నాఁడాసభలో సపుత్త్రికుల మ । ధ్యన్ శూన్యదృష్టి న్మనో
హీనత్వస్థితి సొంపరన్ మెలఁగ న । య్యెంగాదె! యీయస్మదీ
యానూనోజ్జ్వల భాగ్యమారొదువ మా । యం జేసెనే చూడగన్
స్థానుల్లేని గృహంబె డారి నరుడ । చ్ఛోభమూర్ఛింతుండౌ దగన్.

తే॥ వలయు వలెనంచు మదిలోన । వాంఛలూర
మరుగు జనులకు సంతతి । నొరయకుండు
వలదు వలదోయటంచును । వాయివిడిచి
మిడుకువారికిఁ బైపయిఁ । బొడముచుండు. 137

తే॥ వైదికునియింట జనియించు । పరమశుంఠ
పామరునియింటఁ బుట్టును । పండితుండు

వికటకవియా విధాత్మని । విసముచెయిద
ములను దలఁచిన గిరగిర । తలయుఁ దిరుగు. 138

శా॥ చింతింపన్ దల యగ్గిపుత్రయగు గా । సిం చెందెదన్ డెందమున్
చింతన్మాని మహీసురోక్త విధినా । శీస్సిద్ధికై యిప్పుడే
శాంతంబౌ భృగుమౌని యాశ్రమమునన్ । సల్పంగ బోదుం దపం
బెంతేఁ గౌతుకమయ్యెడిన్ దపము సా । ధించున్ మదిష్టార్థమున్.

చం॥ తపముసకుం దురాపమగు । దైవము లేదు జగత్త్రయంబునన్
నృపులకు వార్ధకంబున ని । వృత్తి పథాసజరించు వారికిన్
దపమటఁ జోఫదారియగు । దాన సిహంబు పరంబు కల్గెడిన్
నిపుణమతుల్ ప్రధాను లిట । సేర్పునఁజూతురు రాజ్యభారమున్.

తే॥ ఇటులఁ జింతించి కోఱకేయి । యెటులొ పుచ్చి
తెల్లవారంగ కార్యంబు । లెల్లఁ దీర్చి
మంత్రిసామంతులకుఁ దన । మనసుఁ దెల్పి
చనియె లోనికి భోజన । సమయమగుట. 141

వ॥ మధ్యాహ్నావసరంబున నహుష్మహీజాని, సహధర్మచారిణి యిందిరా
రమణి సన్నిధికిఁ జనుదేర నల్లన నాసతీమణి కిట్లనియె. 142

మ॥ అతివా! ప్రాయము మీఱె మోముపయి వం । ధ్యాత్వంబు విస్పష్టమై
మతిఁ దూలించెడి నీరసంబయిన సం । సారంబు రోతయ్యెడిన్
గుతుకం బయ్యె తపంబొనర్చుటకు మా । కుం బుత్రసంప్రాప్తికై
సతమేకాయము! జేపపోవలయు వాం । ఛన్ దెల్పుమీ యుత్తరన్.

ఉ॥ నా విని యిందిరారమణి । నాథ! భవద్వచనామృతాప్తితన్
జీవము లేచివచ్చె నవ । జీవన లబ్ధికిఁ దత్తరించెడిన్
భావము; పోద మట్టులె ప్ర । భాతమునన్ మరుమాటమాని యీ
కేవలశుష్కజీవన మ । కించన మేటికి రుచ్యమౌ నిలన్. 144

తే॥ అంత భూపతి పత్నీస । మంచితోక్తు
లకును మనమున( బ్రీతిలో । నుల్లాస మడర
జతనమొనరింపు పయనంబు । సాగవలయు
మంత్రు లరుదెంచినా రట । మగుడివత్తు. 145

చం॥ అనిచని మంతనంపుగృహ । మందు సమాత్యులకెల్ల కర్జముల్
వినిచి "ప్రభాతమందున వి । వి క్రముగా భృగుమౌని యాశ్రమం
బునకు చనం గలారము ప్ర । బుద్ధులు మీకువచింపఁబోము మా
దినకరవంశ మీవసుమ । తిం దగ నేలునో! నేలఁబ్రుంగునో! 146

చం॥ తెలియగరాదు కాలగతి । దృశ్యము సర్వము కాలనిఘ్నమై
పొలియు నెదెట్లు లెప్పటికిఁ । బోలునొ! యయ్యదియట్లు లప్పటన్
గలియుగఁజేయుఁగాలమ యె । కాయెకి నిట్టుల నేము రాజ్యము
సులువుగ మిమ్ముమీఁడి వనిఁ । జొచ్చెదమంచుఁ దలంచినార మే." 147

వ॥ అనుచు నమ్మహీకాంతుండు కనుగొలకులఁ దుడిచికొని యథో
వదనులై యంతరంగమ్మునఁ గుములుచున్న యమాత్యుల నెచ్చ
రించి యయ్యెడ నట కరుదెంచిన మేటిదళనాయిఁ గూర్చుండఁ బనిచి
యవశిష్టంబుల నప్పగించి యుక్కుం డపరాద్రిఁజేర వారల వీడ్కొ
లిపి, సాయంసమయ సమయంబుల నెరవేర్పనరిగె.

యువనాశ్వుండు భృగుమునీంద్రు నాశ్రమంబునకు నేఁగుట

ఉ॥ వేకువలేచి కల్యముల । వేగమ తీరిచి రాజదంపతుల్
శ్రీకమనుజ్ఞమనంబున స్మ । రించుచు నంబరరత్నభూషణా
నీకము భూసురావళికి । నిర్మలభక్తినొసంగి వీఁకమై
ప్రాకృతవేషులై చనిరి । భవ్యభృగూత్తము నాశ్రమోర్వికిన్. 149

వ॥ తదనంతరంబ తదీయవృత్తాంతంబెట్టిదో వివరింపవే యని ప్రార్థించిన
జనమేజయనృపాలునకు వెండియు నవ్వైశంపాయనుండిట్లనియె 150

మ॥ మన యీ భారతభూమికిన్ బోలుచు సీ । మారేఖయై యుత్తరం
బున మిన్నుట్టెడి కూట పంక్తులను । సమ్మోదంబు కల్గించుచున్
గన దబ్జానలమూర్తి వంచమల పా । కంబై సుదూరంబు కాం
చన రత్నౌషధి కేంద్రమై యచల రా । జత్వంబు చూపించుచున్.

చం॥ నిరతము పూతపత్రయుతఁ బు । నీతలఁ జేసెడి దివ్యవాహినీ
వర లతాంతతతుల్ తొలుత । వ్రాలిన పావనసీమ పార్వతీ
చరణసరోరుహాంచల పవి । త్రితమై చెలువారు పారణీ
హిమపుగ రంజితంబది సు । హృత్తము మున్వె ధరాధరమ్ములన్.

ఉ॥ ఆ వలిగట్టుకోయల మ । హారభసంబునఁ బాఱు తెంచు గం
గావిమలప్రవాహ పరి । ఘట్టిత తీర పవిత్ర భూములన్
భూవర, రమ్యవిద్రుమ వి । భూషితముల్ మునిపల్లెలొప్పు సం
భావిత ధర్మకర్మములు । భవ్యశ్రుతిస్మృతిశాస్త్ర వర్త్మముల్. 153

ఉ॥ పున్నెపుఁ బ్రోవులార్యజన । భూరికుటుంబ నిరంతరంబులున్
బన్నని వేల్మికొంగ్రొంబొగలఁ । బ్రాకిన తావుల వాసితంబులున్
సున్న విరోధిభావములు । నొప్పలెఱుంగని సౌఖ్యపాత్రముల్
కన్నుల పండువుల్, మనసు । కాఠిమమాన్పెడి శాంతిధామముల్

ఉ॥ ఆ మునిపల్లెలన్ భృగు మ । హర్షి కులాగ్రణి ధర్మమూర్తి ని
ష్కామ తపోవిభూతి నతి । కాలఁ గఱన్ మొలపించుకొన్న ధీ
సీమను, బ్రహ్మవిష్ణుశివ । శీల పరీక్ష నొనర్చి వారిలోఁ
దామరసాక్షుఁ డెక్కుడని । తత్త్వము చాటిన మేటి యెల్లెడన్. 155

చం॥ చ్యవనమహర్షి తత్సుతుఁడు । సారతపోమహిమాన్వితుండు దా
ఘువచనుఁ డాతఁ డొక్కట మ । ఖంబున దస్రుల సోమపీథులన్
దవిలి యొనర్చె దా కిశ । తక్రతు వల్కము వజ్రమంపినన్
గవిసెడిదాని హుంకృతిని । గ్రక్కునఁ గూలిచి యొర్చె నింద్రునిన్

కం॥ ఏతాదృశ మహనీయో
పేతాశ్రమమునకుఁ గోస । లేశుం డుద్య
త్ప్రీతిన్ ద్వితీయతో సా
కేతంబును విడిచివచ్చెఁ । గృతకృత్యుండు గాన్. 157

యువనాశ్వుండు భార్గవాశ్రమమున మునివృత్తి వర్తించుట

ఉ॥ వచ్చి తదాశ్రమస్థలిని । పాఱులవాడ కొకింత దవ్వుగా
సచ్చరితుండు నూత్నముగ । సల్పిన పర్ణకుటీర మాత్మకున్

మచ్చికగాఁగ సంయమి స । మంచిత నూత్నకఠోరపద్ధతుల్
నిచ్చలు నొక్కటొక్కటిగ । నేర్చుచునుండెను వీడుచుం గరుమల్.

చం॥ ప్రతిదినమాస్యపోత్తముఁడు । బ్రాహ్మముహూర్తమునందు లేచి స
న్మతి సిరిచెల్వునిం బొగడి । నానిజలంబుల శుభ్రవస్త్రుఁడై
కృతతిలకంబుగా ముఖము । కేశవు భాస్కరబింబమధ్యసం
స్థితుఁ దొలిపల్కులన్ వినుతి । సేయును భక్తి వినమ్రుఁడై తగన్.

చం॥ పిదప యమాదులల్లడఁగఁ । జేర్చిన యింద్రియజాలమున్ బహిః
పదములనుండి త్రిప్పి పటు । బంధముతో బిగియించి దేహమున్
గుదుమ పడంగఁ జిత్తమును । గూరిచి యూర్పులు నిల్పి శ్రీధరున్
గదలక లోనిచూపునను । గాంచుచుఁ జొక్కును దివ్యమూర్తికిన్.

చం॥ అవులసమాధిబంధముల । నన్నిటి నొయ్యన మాన్పి సుస్థిరిన్
బ్రవిమలవేదిపై వెలయు । పావకు నర్చనఁ దన్పు వేళకున్
బవలి పనుల్ ముగించికొని । పండితగోష్ఠిఁ గథాప్రసంగముల్
శ్రవణసుఖంబుగా వినుచు । సత్త్వఁ గూర్చును చిత్తభూమికిన్. 161

చం॥ పురి సముదగ్రభాగ్యకృత । భోగవిలాసవినోదవృష్టి చే
నురువయి యొంటకన్నులుగ । కంఠఁగ నేల్బడి గంధుబూటి యా
యురవునఁ బాటు తప్పి తొలి । యే ప్రదుగంగ విరక్తిమార్గసం
చరణఁ గ్రశిష్ఠమాయదిః । సత్త్వఁ గూర్చుట యుక్తమే గదా! 162

ఉ॥ ఈవిధి నాన్నపాలమణి । యింతియుఁ దోడుగ నీడచాట్పునన్
సేవితమానివృత్తియయి । సేమముగా జరియించెఁ గొన్నినా
ళ్ళవల దారుణజ్వర ము । హార్నిశమున్ దహియింపసాగె నా
త్మవిభుఁ దత్కళత్రమును । సన్నని మేనులు తూలిపోవగన్. 163

చం॥ దగ మిటిమిటాడె నాలుక ని । తాంత మనార్ద్రముగాఁగ వేఁకిచేఁ
దగు నుపచారముల్ సలుప । దగ్గర చేరును లేమి నొంటమై
బుగులు బుగుల్మసంగఁ గుటి । మూసినకన్నులు విప్ప నీని మై
సెగ శయనంబు చుట్టుమనఁ । జెచ్చెరఁ బర్విడె మూర్పులన్తతిన్.

చం॥ తొలిమలినాడు నాకరణిఁ । దోగుట జార్తికృశానుకీలలన్
విలవిల లాడ నంగములు । వెన్నువిశీర్ణముగాఁ బిపాసమున్

వలిబిలియాచు మూఁడవ ది § నంబున సాయమువేళఁ దత్కుటీర
జలములు నిండుకొంటయు ర § సావిభుఁ డయ్యెడ దేవి కిట్లనున్.

చం॥ పెనువడి నాలు కాఱెడిని § వేఁడి కమండలు గోచరించెడిన్
బనుపఁగ నీరు తేర ముని § బాలురు బాలిక లేరు నీదెసన్
గనఁబడు జాడ కాన మిఁక § గర్జమదెట్టిదో తెల్పు వేగమే
యనవుడు "పోద మొండొరుల § యాపదతో భృగుమౌనిపాలికిన్".

రాజదంపతులు జ్వరపీడితులై భృగుమౌనిపాలి కేగుట

చం॥ మన రుజ లెల్ల మంత్రముల § మందుల మాత్రలఁ జేతఁ దీసివై
చిన క్రియఁ బాపు నయ్యమృత § సిద్ధుఁ డటంచును లేచి తన్వికాం
తునకుఁ గరం బొసంగ నది § తోడుగఁ గైకొని జేఁదులేచి నా
య్యాన కుటిపిడి వారు చని § రాత్మలుతూల నతిశ్రమంబునన్. 167

సీ॥ పెనుతాలపైనుండి § ఘనవేగమున జారు
చదలేటి తెలినీటి § చలువలోలయు
నొకవంకఁ బూఁబొద § లొకవంక ఫలశాఖ
సంతతు లిమ్ముగా § శోభింప
మన్యచతుర్భద్ర § మంజు లాకృతితోడ
నుటజంబు పంచల § నొప్పుచుండ
గోమయాలేపన § శ్యామ లాజిరభూమి
రంగవల్లీ చిత్ర § రాజి మెఱయ

తే॥ నగ్నిహోత్రగృహంబును § నతిథిగృహము
చదువులిల్లును సభతీర్పు § సద్గృహంబు
నెమరుబడురగ వజ్జల § నింపుఁగొలువ
నశ్రమం బొప్పె భృగుమునీం § ద్రాశ్రమంబు. 168

తే॥ పరిణతిసుఖాస్పదములైన § పవళులపుడు
పనసగున్నల వలిచాయ § లెనసి నట్టి
ముంగిట నలంతి బీరెండ § పొద్దునందు
గోష్ఠిసల్పుచు భృగుమౌని § కూరుచుండె. 169

శా॥ అంతేవాసులు కొంద ఱొక్కయెడఁ బూర్వాభ్యస్త సూక్తంబులన్
జింతింపన్ మఱికొంద ఱింకొకట శాస్త్రీయాంశముల్ నేర్వఁ ద
త్ప్రాంతమ్మందు పఠింప నొక్కగమి వేదాంతమ్ము; నింకొక్కటన్
సంతోషమ్మున సల్పుచుండిరి మునుల్ శ్రౌతక్రియావాదముల్.

తే॥ ఇటులనయ్యాశ్రమస్థలి నెల్లవారు
శాంతకర్మంబులన్ దిట్టిఁ జూపియుండ
"ధవ్వు" మను సవ్వు వీనులఁ దాకె వారి
దృష్టు లాదెస సంగతిఁ దెలియ నరిగె. 117

తే॥ తక్షణము వార లాశ్రమ ద్వారసీమ
నొడలెఱుంగక పుడమిపై నొప్పలేక
కుప్పకూలిన చందానఁ గూలియున్న
దంపతులఁ జూచి యాఁగి రాశ్రమున నటకు. 172

ఉ॥ ఏమిది రాజదంపతులె యీగతి జెందిరి; శిష్యులార! తెం
డీమెయిఁ జూతురేల? మన యింటికి వేగమ చేర్పుఁ డిద్దఱన్
సేమముగా చికిత్సలను జేయుద మంచు భృగుండు పల్కినన్
గోమలగాత్రులన్ గుసుమ గుచ్ఛములట్లుగఁ జేర్చి రింటిలో.

తే॥ సదయ సుస్నిగ్ధ హృదయుల సన్నిధాన
మబ్బుటయె కాదు పిమ్మట నిబ్బరంబు
తృషితులైనట్టి తెలివరి తృప్తిఁ బొందఁ
జలువపందిరి చేరుటే బాగు గాదె! 174

యువనాశ్వ నరేంద్రునిచే పుత్త్రకామేష్టి
చేయింప మునులు మంతనము చేయుట

ఉ॥ భోజనముల్ ముగించి ముని ముఖ్యులు రాత్రి తదాశ్రమస్థితుల్
సాజముగా నొకొక్కరుగఁ జావడిఁ జేరి మునీంద్రు తోడ "నా
రాజులు మీర లీనృపతి యున్న ప్రసూతి దశాల వేదవి
భ్రాజితమైన యిష్టి పలు పాగ వని పగ గాదె తేనికిన్. 175

మ॥ కో॥ పుత్త్రభోగులు వీర లిద్ద్యెడ బ్రాహ్మహాత్మున నిష్ఠమై
కట్టుకొంటుల నెల్లఁ గైకొని కాంక్షితంబుగ మేలిమిన్

భృగుమహర్షియుఁ గూర్కఁగ వెడలె నంతఁ
బల్లెయంతయు జడతా నిబద్ధమయ్యె. 183

సీ॥ తూరుపురాజేల నారయుపరి గోన
దేజరిల్లు మణిప్రదీప మనఁగ
యామవతీదేవి యలరుఁ గ్రొవ్వెదమీఁద
విరిసిన పెనుమల్లె విరి యనంగ
పతికి నివాళింపఁ బ్రత్యూషకామిని
పూసిన కపురంపు ముద్ద యనఁగ
దినమణి, నామము తీర్పంగ నరచేత
నూనిన తిరుమణి యుండ యనఁగ

తే॥ వెలయు నీరీతిఁ గ్రమగతి వేగుఁ జుక్క
తూర్పుదెసఁ దోఁచె మునిపల్లె తొఱఁగి జడిమ
మరలఁ జైతన్యవంతమై తిరుగఁ దొడఁగె
వసుధనల్లెడ వెల్గులు వ్రాలఁజొచ్చె. 184

భృగుమౌని యువనాశ్వునకు పుత్రకామేష్టి సలుపుమని చెప్పుట

ఉ॥ కులపతి యాభృగూద్వహుఁడు కోరికఁదీరిచి కల్యకృత్యముల్
పొలుపగు నింటిలోఁ గ్రహవిముక్త మృగాంకునిమాడ్కిఁ బత్నితో
నలువుననున్న యర్కకుల నాథుని గానఁగవచ్చి యిట్లనున్
"దొలఁగెను వేఁకి మీకిపుడు దోసపుఁజిన్నెలు లేవు మోమునన్".

చ॥ అని పరికించి యంగముల హాయిగనుండెను నింక జేపటన్
జనుపున నిమ్మగాఁగ నుప చారములం గొనుఁ డేరిచేత నే
మనుపొనగూడె మీకుల మాహను, మం దిదె గైకొనుం డికన్
మనమున నున్న నెవ్వగయు మాన్పఁగ నెంచిరి మౌనులెల్లరున్.

వ॥ అనుచుఁ జెంతనున్న యజినాస్తరణంబున నుపవిష్టుండై నిజపదంబు
లకు నెఱఁగు నాసతీపతుల దీవించి యంతికమ్మున నంతేవాసి పదు
వున నుపవిష్టుం డగు నుర్వీనాథున కిట్లనియె. 187

తే॥ జగతిసంతానవాంఛ సా జమ్మునమ్మ
గేస్తులకు గేస్తురాండ్రకు కేవలమ్ము

పుత్త్రితోడన పురుషుండు । పూర్ణుఁడనుచు
శ్రుతియు వచియించు లోకంబు । చెప్పునట్లు. 188

చం॥ వినుము భవాదృశున్ సుతుని । వేమఱు మిక్కిలి శాస్త్రసమ్మతం
బనువగునైన వేఱిదార । యాసరగైకొని లోకు లెల్లరున్
మనియెద రాలుబిడ్డల స । మంచిత సత్వదయాప్రబుద్ధులన్,
మనిచెడివారు లేనియెడ । మ్రందును లోకము దుష్ప్రవర్తనన్. 189

తే॥ అస్మదీయ తపోయోగ । పావనములును
సరిగనడచుట యొడయని । సాయముఁసనె
కాన మీకొద మాకొద । యానుగాదె
దానిదీర్చుట మాకును । ధర్మ మిపుడు. 190

కం॥ ఇడుములనెఱుఁగని మీరిటు
బడుగులగతి నిడుమపాటు । పాలయి యెంతే,
బడలుచు నుండగ నడలగుఁ
గడుఁగొనవచియింతు నొక్క । కర్జంబు తగన్. 191

చం॥ వినుము మహర్షిసత్తములు । విస్తృత సంసృతిమార్గచారు లౌ
జనులహితంబు గోరి మును । శ్రౌతవిధిన్ సవనప్రకారముల్
కనుగొని రందు వైష్ణవ మ । ఖంబు పవిత్రము పుత్త్రలబ్ధికిన్
జనవర యావరక్రతువు । కల్పితలంచిరి మానులిత్తఱిన్. 192

తే॥ బహుజనద్రవ్యసాధన । పటిమ తోడఁ
బూర్తి యగు నిష్టి జరుపంగఁ । బుడమి ఱేండ్ల
దక్కు లెవ్వాడ నొసరింపఁ । దన్మఖంబు
ధారుణీనాథ! పూనుము । తలఁపుతీరు.

యువనాశ్వుఁడు పుత్త్రకామేష్టిచేయుట కియ్యకొనుట

వ॥ అంత నన్నరపాలుండు హర్షోత్ఫుల్లలోచనుండై యిట్లనియె. 194

తే॥ తాపసవరేణ్య! యమృతంబు । త్రావినట్లు
మా కులంబును మమ్మును । మహితగతిని
బరగఁజేసెడి మీ దివ్య । వాణి వినగ
ప్రాణములు లేచివచ్చెను । బలముఁ గలిగె. 195

ఉ॥ గాడుపు చైదముల్ తనువుఁ § గాఱియ వెట్టఁగఁ ద్రుళ్ళి తూలుచున్
మూఁడెడి కాఱుచీఁకటిని § ముట్టి యెదుర్చుచు నిల్వపాటునన్
బీడఘటించు భూతముల § పీచ మడంచెడి పెద్దజోతిపై
నాఁడెడు స్రుర్వతెట్టఁ బరి § హాసము చేయుచు యజ్ఞశాలలోన్—
తే॥ మూలకంబంబుపై దీప్తి § మొనసియుండి
జాగరము చేయుచుండెను § జడత లేక
దాని చేరువఁ బవళించె § ధరణిపతియు
నాపసోపాలు గుడుచుచు § నజినశయ్య. 204
తే॥ మొదల సుకవాసి జూర్తిచే § పొనుగుపడియె
నేకవారాశనగ్లాని § యింత చేర
గొట్టువడ గాడ్పు పిలిచి § పట్టు చేసె
నృపుని దుర్దశ నేమని § చెప్పుదు నపుడు! 205
తే॥ గొంతు తడియారె మాటాడఁ § గూడిరాక
నాలుకయు గుడ్డపేలికఁ § బోలియుండె
నొడలు తేత్తెలిపోయెడి § నొడయుఁ డంత
కాలుసేతులు కదలింపఁ § జాలకుండె. 206

వ॥ నరపాలుం డాతరుణంబున తన దిక్కులేని దురవస్థ తెలిసికొని
యొయ్యన ప్రాకులాడుచుం బోయి పరిసరపాత్రంబులఁ బరికింప
నయ్యవి మోటిబోచ్చె లట్లు జలగంధంబు నెఱుంగని చందంబున
గోచరించుటయు నెదుర జన్మంపు జగతిపై వెలయు వారుణకల
శంబు మాత్ర జలపూర్ణంబుగాఁ గాన్పింప నప్పు డాత్మగతంబున
నిట్లు చింతించె. 207
చం॥ నిలువవు ప్రాణముల్ క్షణము § నీరము గ్రోలకయున్న, వేదిపై
నిలిపిన పూర్ణకుంభమున § నీరము గ్రోలుట యుక్తమిత్తఱిన్
గలిగెడి హాని ప్రాణముల § కాఱియ తీఱిన వెన్క చూచికో
నలువగు, నన్యమార్గము గ § నన్ మును త్రావెద నీజలమ్ములన్.
తే॥ అనుచు నాలుక లోనికి § నంతకంత.
కీడ్చుకొనుచుండ చటుకున § నెత్తి కలశ

మమృత సురభిళ జలమెల్ల ¦ నానె నొక్క-
గుక్కిలోనన వడివడి ¦ గుటకలడర. 209

ఉ॥ నిలువగలేక యొడిగిలె ¦ నిండిసటేని శరీర భస్త్రియుఙ్
కలశముజారె రిత్తయయి ¦ క్రైగవ రిత్తగ, లోని చేతనఙ్
దెలుపుచుసాగె నూర్పులు సు ¦ దీర్ఘములై నిరుపద్రవస్థితిఙ్
నలువుగ భూతధాత్రి కరు ¦ ణద్యుతిఁ జిక్కియుఁ దోచె
తూర్పునఙ్. 210

వ॥ అంత యథాకాలంబున ఋత్విగధ్వర్యప్రభృతులు మేల్కాంచి శయనంబువీడి వార్చి సవనవేదిపై రిక్త వారుణకలశం బొకవంకను తదారోపిత నారికేళంబు వేరొకవంకను పడియుండఁ బరికించి విత్రస్త విస్రస్తచిత్తులై సలుపు గడబిడలతోఁ గనులుదెఱచి యయ్యాజమానుఁ డుపాధ్యాయునికడ కృతాపరాధుఁడగు బాలకుభంగి వివర్ణవదనుండై లేచి పెదవులు తడుపుచు వారలనెల్ల నుద్దేశించి యల్లన నిట్లనియె. 211

చం॥ గురువరులార! యేమనెద ¦ కూరుకురాక ప్రజాగరంబుగా
దొరలుచు శయ్యపై, వడకుఁ ¦ దూలి శరీరము విశ్లథంబుగా
పొరుగుగ నాల్క యెండుటయు ¦ శుష్కగళాన నెలుంగు డిందగా
జరుపగలేక కాలమును ¦ చయ్యన తజ్జల మేన త్రావితిఙ్. 212

తే॥ ప్రాణములు పోవునఙ్ భీతి ¦ పట్టలేక
తప్పుఁజేసితి సైఁపుఁడీ ¦ తత్త్వమరసి
యనిన భృగుసుతుఁ డాలించి యనియె నార!
తా నొకటి తలఁప దైవంబు ¦ తలఁచు నొకటి. 213

చం॥ అమృతమయౌషధీనిచిత ¦ మాత్మతపోబల సంభృతంబునై
గమవిధి సంచిత మ్మఖిల ¦ కాశ్యపినేలెడి లక్షణాన్వితుఙ్
గొమరునొసంగు నీజలముఁ ¦ గ్రోలితి వప్రతికారదోషమ
న్గమనములేక; యాఫలము ¦ గాంచెదు నీవ విరుద్ధశీలతఙ్. 214

తే॥ మంగళస్నాన శుద్ధయౌ ¦ మాననీయ
యిందిరాదేవికిం ద్రావ ¦ నీజలంబు

నీయనుంటిమి లేవట నింతలోన
నిటులజరిగెను దైవ సంఘటన యార! 215

తే॥ అనిన నిర్విణ్ణుఁడై నృపుం డవనతాస్యుఁ
డగుచు లోలోనఁ గుములుచు నంతలోన
నరుగుదెంచిన భృగుమౌని యంఘ్రియుగళి
వ్రాలె నమ్మౌనివాత్సల్య వశతఁ బలికె 216

చం॥ జనవర! చేయుమించిన విచారము దీనికిఁ జింతచేయఁగా
జన దిది దైవసంఘటన సర్వముగంటి నుపక్రమంబునన్
దనయుఁడు గల్గు నీజలము త్రావినవారి కటంచు పేరువా
కొనమి కృతంబు భోజ్యమగు కొందలమందకు మేలుకూరెడిన్. 217

ఉ॥ కన్నులవిందుగా సుతుని గాంచెదు చంద్రుని సంద్రమట్టులన్
మన్నియమానుసారివయి మాజత వర్తిలుచుండు మిందు వి
శ్వోన్నతిఁగోరి పాలకయి యోపిక ఆతని మోయుమాడ్కి నే
బన్నము వచ్చిన న్నిలచి పక్షమునిచ్చుట రాచపాఁడియౌ. 218

తే॥ ఎవ్వనికినేని జీవిత మేకగతిని
నడచుటకడింది మార్పులు తొడరునెన్నొ
కాల్యములుతీర్పఁ బోవలెఁ గదలు మింక
ననుచుఁ గేల్పట్టి గొనిపోయె నవనిపతిని. 219

వ॥ అంత దుఃఖితాత్ముం డగు ధరణీశుం డయ్యాచార్యవర్యుని శాంతోక్తులకును తదీయ సుదుర్లభకరగ్రహణాదరణంబునకు నొకింత తేరిన చిత్తంబుతో నమ్మునీంద్రు ననుసరించె. ఇట ఋత్విక్ప్రముఖులును కాల్యకృత్యమ్ములు నెరవేర్ప నేగిరనిన విని జనమేజయుండు మునీంద్రా! వింత యయ్యెడి నవ్వాలి వృత్తాంతంబు వినిపింపవే యని వేడుటయు నా వైశంపాయనుండు వెండియు నిట్లు చెప్పఁదొడంగె నరేంద్రా! తదుపరి కతిపయదినంబులకు— 220

మ॥ తనదుద్యద్భృగునందనా రచిత సంకల్పంబు రూపెత్తి త
న్మనుజేంద్రోదరసీమ వింతగను నానాటన్ బ్రకాశంబుగా

మొనసె న్నారికేడంపు మొల్కకరణిన్ మోచాంకుర ప్రక్రియన్
గొనబౌ వంశపు మోసుపోల్కి మునివాక్కుల్ సత్యముల్ దప్పునే

చం॥ పలుకులఁ బట్టి యర్థములు పండెడి నాసమయాన; పల్కలే
సలుపగవచ్చు కర్జముల జాడల వచ్చెడి నిప్పుడత్తఱిన్
శిలలును మోకలెత్తును వచించినయంత మునుల్; విరుద్ధసం
కలన మనంగలేదు తెఱగంటుల తేఁడును నుల్కవారికిన్. 222

వ॥ తదుపరి తదీయ గర్భంబు పరిపూర్ణంబగుట నుపలక్షించి యొక్క-
నాడు భృగుమునీంద్రుఁ డాత్మగతంబున 223

చం॥ జరిగెను మాసముల్ సరిగ సౌఖ్యముగా ప్రసవంబునైనచోఁ
బరగుదు రాత్మజాప్తనల పావనమూర్తులు రాజదంపతుల్
మురిసెడి నీ ప్రజాతతియు ముందుకు వచ్చును మా విధానముల్
నరపతి డాయఁబోనదగు నాకవిభుం డరుదెంచు నంతలో. 224

వ॥ ఇట్లు తలపోసి తోడిజడదారుల డాయంజని తదర్చితుండై కూర్చుండి
మనోగతంబు తెలియంబలికి 225

కం॥ సమయము శుభకర మిప్పుడు
సమయము సరిపడియె మాదు సంకల్పముతో
యమివరులు! లెండు పోదమని
కమలజసముడైన భృగువు కదలె న్మొదలన్. 226

వ॥ జడదారులు నప్పలుకులు చేకొని యమ్మునివరు వెంట నడచిరంత.

కం॥ నారాయణ గాయత్రీ
పారాయణ పూతమ్మాని వదనశ్రుతి సం
వారారవ మేలిక శా
చారంబును జరుప నగ్రచారంబయ్యెన్. 228

ఉ॥ గాములపిండు సూర్యకుల కాంతుని గానఁగవచ్చెనా రుచి
స్తోమము త్రోవచూపగను జొచ్చెఁ గుటీరపు చత్వరస్థలిన్
సాములపిండు; భూపతి ని శాంతమునన్ మను దిన్నయట్లుగా
గో మెడలంగ గర్భభర కుంతి తుఁడై యొకవెంట నుండఁగాన్,

తే॥ పుట్టిన పెటిల్లు మనునట్లు § మొనసియుండు
నుదరభారంబుతో నేల § నూది లేచి
యతివరుల కెల్లఁ బ్రణమిల్లె § నవనిపతియు
నపుడు భృగుమౌని యర్మిలి § నాదరించి. 230

యువనాశ్వు నుదరంబున మాంధాత యుదయించుట

ఉ॥ పూతజలంబులన్ బసిఁడి § పూతమెఱుంగుల నుల్లసిల్లు త
ద్భూతలనాథు కుక్షిపయిఁ § బ్రోక్షణచేసె; నృపుండు మెల్లగా
నాతతభూర్జపత్రి రచి § తాసనసీమను గూరుచుండఁ బో
నాతనిఁ గుక్షి వ్రీలుటయు § నర్భకుఁ డయ్యెడఁ దోచె దీప్తితో 231
తే॥ కృతయుగం బది యద్దాన § కృతము కృతము
కృతమునకు మార్పుచేసెడి § వితము లేదు
కానఁ గృతయుగమనఁగఁ ద § త్కాలమొప్పె
కాల మహిమంబుతో నెల్లఁ § బోలుచుండు. 232
ఉ॥ అంత నచేతనుండగు ని § జాధిపుఁ గాంచి తదీయపత్ని పె
న్వంత వ్యాదంతరాళమునఁ § బ్రబ్బిన వేదన మూర్ఛఁ జెందెఁ గు
ఱ్ఱాంతరసీమ దోఁగుచును § నాత్రము చూపుచునుండెఁ గూన; యి
ట్లింత సహాయశూన్యులయి § యిమ్ముతొ లంగినవారిఁ జూచుచున్
ఉ॥ మంతరసాని కర్జమును § మాన్యభృగూత్తముఁ డంతఁ బూని, కు
క్ష్యంతరవర్తి నర్భకుని § హస్తములన్ బయికెత్తి యయ్యెడన్
జెంతనుజూచు నింతులకుఁ § జెప్పెడిదేమి గ్రహింపరాదొకో!
వంత యదెంత సేపు నృపు § పత్నిని పాపనిఁ జూచికొం డికన్. 234
తే॥ అనుచు బిడ్డని వారల § కప్పగించి
చెలఁగు సంధాన కరణితోఁ § జీలిపట్టి
జేసియుదరంబు సంధించి § మేనిమీఁద
పరగు సంజీవ కరణిని § బారఁ జేసె. 235
వ॥ అప్పు డాభూపాలుండు— 236
ఉ॥ మూతలువడ్డ కన్నులర § మోడ్పులుగా మెయినొప్పి తీరగాఁ
జేతులఁ బ్రాముచున్నటులఁ § జిక్కగబట్టిన కీలుపట్టులున్

మాతులు, విచ్చుచున్నటులు, § మున్నుగ మెల్లన నూర్పుపుచ్చిలోఁ
గౌతుక మూరుచున్నటులఁ § గాంచి తమిం గనుమూసె వెండియుం.

తే॥ తోయజాక్షులు కొందఱు § పాయ యుక్తి
నిందిరాదేవి కిమ్ముగా § నెఱుక కలుగ
వలయు నుపచారములు సల్పి § రెలమితోడ
దేవియును నల్లఁ గన్నులు § దెఱువసాగె. 238

తే॥ అచట నయ్యింటిలోపల § నమ్మ లక్క
లొండొరులు పల్కుకొన్నటు § లొప్పుగాగ
సతులు కొందఱు శిశువును § జతురమతులు
జలకమాడించి చేర్చిరి § శయ్యమీఁద. 239

ఇంద్రుఁ డరుదెంచి అమృతమిచ్చి శిశువునకు
"మాంధాత" యని పేరుపెట్టుట

సీ॥ వెలిమబ్బు తెరల సం § దులలోనఁ దులకించు
రిక్కలచెలికాని § రేకమాడ్కి
వెలిపాత్రికల నత్త § మిలి బిట్టు పసి యేఁప
నను జూడ రారేల § నెనరు లేదె!
యనియెడి జాడగా § హస్తద్వయంబెత్తి
యాడించుచును శావు § మనుచు పోరు
పెట్టుచుండిన కందు § నట్టెచూచి భృగుండు
"కింధాస్యతి" యటంచుఁ § గెలన మునుల

తే॥ నడుగుచుండగ నవ్వేళ § కమరనేత
వచ్చి "మాంధాస్యతి" యటంచు § వారిప్రశ్న
కుత్తరంబిచ్చి యమృతంపు § టూట లూరు
తర్జనిని జొన్పె శిశుముఖ § ద్వారమందు. 240

కం॥ జననము జగద్విరుద్ధము
చనువున జన్నియవచ్చు § జననియుఁ గలదే!
పెనుపరి మనుపరి తానే
కను కను హరిపనిచె హరిని § నమృతంబీయన్. 241

ఆ.వె॥ దిక్కు లేనియెడల § దేవుఁడే దిక్కండ్రు
నారుపోయువాడె § నీరు విడఁడె?
కడుపు కూటికొఱకు § కష్టాలుపడుటయు
జడియువారి చేత § జగతియందు. 242

ఉ॥ అంగుళి నిర్గతామృతము § నానుచు పాపఁడు నేకధాటిగా
పొంగుచు నాఱుమాసముల § పూపవితమ్మున నప్పు డేపునన్
సంగత నూత్నకాంతి నలు § చక్కియలన్ వెలిగించె చోద్యమే
రంగని యానుకూల్యము వి § రాజిల నన్ని విరాజిలుంగదా! 243

మ॥ యువనాశ్వక్షితిపుండు కన్నెఱచి సం § యుక్తాత్ముఁడై లేచి వా
సవు దివ్యద్యుతి వెల్గువాని నటపా § ర్శ్వంబందు శయ్యాగతుం
డవు కందర్ప సుమనోహరాంగు ముని వ § ర్గ్యాఘుంబు వీక్షించి ని
క్కువమో! స్వప్నమొ! ఏమొ! యంచు వెడగై § కూర్చుండె
నాపట్టునన్. 244

మ॥ భృగువంశీంద్రుఁడు పల్కె; రాజవర సం § ప్రీతిన్ రమాకాంతు డం
పగ నేతెంచె మహేంద్రుఁ డియ్యెడ సుధా § ప్రాశంబు గావింపగాఁ
దగ నీసూనునకుం దదర్భకుఁడు ను § త్సాహంబుతోఁ గ్రోవి రొ
మ్మనగఁ గేరింతలు కొట్టుచుండెనట స § మ్మోదంబగుం జూడుమీ.

శా॥ ఆయుష్మంతుడు చక్రవర్తివర చి § హ్నాఢ్యప్రోజ్వలుం డిమ్మెలన్
ఛాయుం బన్నము లీ ధరారమణికిన్ § బాసెన్ భవత్క్లేశముల్
పోయెన్ దుర్గతి మీపితృప్రతతికిన్ § మోదంబుగా నస్మదా
మ్నాయంబున్ జెలఁగెన్ యశం బమర వి § జ్ఞానంబు వర్ధిల్లెడిన్.

చం॥ అనవుడు నా ధరారమణుఁ § డంతన లేచి మహాత్ములార! మీ
కనయము నేగృతజ్ఞుఁడ సు § రాధిప! యుష్మదలభ్యదర్శనం
బున సఫలంబు మాపుటుక; పొందె సమున్నతి మాకులంబు, నీ
తనయుని బ్రోవుఁ డేకొదలు § తార్కొనకుండగ నెల్లవేళలన్.

తే॥ అనుచుఁ గేల్మోడ్చి పల్కిన § నమరపతియు
నరవర! కుమారుఁ డీతఁడు § నళిననేత్రు

నంశమునఁ జూని జన్మించి ౹ నందువలన
కొద లవేవియుఁ గల్గవు ౹ పొదలు సిరులు. 248

తే॥ ముందు మమ్మ్మ ధరించును ౹ ముదముతోడ
దాన "మాంధాత" యను పేరఁ ౹ దనరు నితఁడు
సుధను గ్రోలుట నాఁకలి ౹ సోఁక దితని
దప్పియును కల్గ దన్నము ౹ తాకువలను.

చం॥ అనుదినవర్ధమానగతి ౹ నందఱకన్నను నీతివిద్యలన్
గొనముల నున్నతుండయి య ౹ కుంఠితవిక్రముఁడై ధరాస్థలిన్
జనులను బ్రీతి నీసుతుఁడు ౹ సర్వ నరేంద్రులు సాగి మ్రొక్కఁగా
మనుచును నాల్గుపాదముల ౹ మాన్యత వర్తిల ధర్మ వెల్లెడన్. 250

తే॥ నిఖిల విద్యాగరిష్ఠుఁడై ౹ నెగడుదాక
నాత్మజునితోడ నుండుఁ డీ ౹ యాశ్రమమున
పోయివత్తుము మేమని ౹ పొసఁగఁ బలికి
మునుల వీడ్కోలుఁ గొని ౹ తాను మనికికరిగె. 251

వ॥ అంత నమ్మునిమండలియు నమ్మహీశునకు దిటముగలుగ సమయో
చిత భాషణంబులు పలికి నిజనివాసంబుల కరిగి రప్పుడు విప్రకాంత
లును రాజపత్ని సమాహితచిత్తయగుడు నభినందించి నిజసదనం
బులకుఁజనిరి. అత్తఱి నాప్రదేశంబు నిర్మాక్షికంబగుటయు.

చం॥ ఉదుటునఁబోయి సూనుగొని ౹ యూర్పులువీడక ముద్దుపెట్టుచున్
సదమలచిత్తయా సతియు ౹ చయ్యన చెంతకురాఁగ జేతులన్
బదిలముగా నొసంగె జన ౹ భర్త సతీమణియుం గుమారునిన్
ముదమున నెత్తి మస్తకము ౹ మూర్కొని యక్కునఁజేర్చె మక్కువన్

కం॥ ఇరువురుఁ బర్యాయంబునఁ
గరములఁగొని చిఱుతవానిఁ ౹ గాంక్షలు మిగులన్
మురువగు చిబుకము పుణుకుచు
మురిసిరి విజయంబుతోడ ౹ ముఖములు మెరయన్. 254

మ॥ ముఖనీరేజ వినిస్సృతామృతపుటా ౹ మోదమ్ము పైపాటుగా
సుఖముం గూర్చఁగ ఘ్రాణతర్పణముగా ౹ సొంపారు నెమ్మోము శ్రీ

సఖముల్ కర్ణము లిందిరా రమణికిన్ సద్మంబులౌ నేత్రముల్
శిఖరాంచద్భుజరమ్యవక్ష మరుణ స్నిగ్ధాంగుళుల్ పాదముల్.

చం॥ విడుమర లేక తమ్ము మఱి పెంపు నరంబులతోడ నాత్మతోఁ
గడుఁ జతురత్వమొప్ప నతిగాఢముగాఁ బెనవైచి లాగినా
బుడుతనిఁ జుట్టివైచిరి వపుర్లతలన్ దనుపార దంపతుల్
పుడమి! పసిండి! రత్నములొ! పెత్తురిపై మమతేలొ యింతగా!

చం॥ విలయము లేని భావముల వెల్లువ లాత్మల ముంచివేయఁగాఁ
గలిగిన సమ్మదంబది ముఖంబులఁ గన్నుల నింపివేయఁగా
వలిబిఱియాచు వారపుడు నందనుఁ జేతుల నల్లి వేయుచున్
దెలియరు తమ్ము నౌర! సుతునెయ్యపుఁ దీపు మహాత్వ మెట్టిదో

వ॥ ఇట్లు లాదంపతులు తమ యానందమ్మున కేకమాత్రి కేంద్రమ్మైన నందను ఫదనకమల దర్శన సుఖానుభవ పారవశ్యంబునఁ దమపడిన బన్నంబులు మఱచియుండుతఱి మునిపత్ను లాయర్భకు నరయు వేడ్క నట కేతెంచుటయు యువనాశ్వుండు వైతొలంగె. అంత నిందిరారమణి కొమరునెత్తి కరంబుల కందిచ్చె. అయ్యువిదలుఁ జేఁ జేతుల నందుకొనుచు నంతకుమున్న జనించిన పాపఁడాఱుమాసముల పూవపగిది పరిఢవిల్లుట కెంతయు నబ్బురంపడుచు, చిబుకంబు పుణికి చెక్కిలిగిల్లి ముద్దాడుచుఁ దత్తాదృశరూపరేఖలకు నివువుసల్పు "ఊ"కారంబు ననుకరించు కైతవంబున మెచ్చికోలు వెలిఁబుచ్చుచుఁ "దల్లి! ధను లౌ తిరి కష్టములు గడచినవి సుఖముండుఁడ"ని సరళంబుగ నాశిశురత్నంబును "చిరంజీవ" యని దీవించి రాజ్ఞికొసంగిరి. అందొక పురంధ్రీమణి మోముపై వెన్నెల విరియ "నిందిరా మాయీ! భవన్నందనునకు శక్రుండే నామంబిడె నని నామకరణ మహోత్సవంబునకు చక్రింబు చుట్టెదరే! భవదీయ గృహ గోపుర ద్వారంబులకుఁ బచ్చని తోరణంబులు ప్రకాశించు శుభసమయం బిప్పటికిఁ జనుదెంచె. భూరిసంతర్పణాల భూసురశ్రేణిఁ దనుపవలదే? మామేనులుఁ గానులు నిండ జాళువా జిలుగు వల్వ

లొసంగవలయుంజుండీ” యనుడు నాదేవియు నానందాతిరేకంబున
నిట్లు వచించె—

తే॥ చీఁకటింటికి వెలుతురు । చిక్కినట్లు
సమయు దీపంబునకుఁ దైల । మమరినట్లు
భవదనుగ్రహావశమునఁ । బ్రాప్తమయ్యెఁ
దనుజలాభంబు నేటికిఁ । దల్లి! మాకు.

కం॥ మాతపములు ఫలియించెను
మాతనువులు సార్థకములు మానక యెన్నన్
మాతనువులు మీమనములు
మాతరో! వెలయింతు మెల్ల మన్ననతోడన్. 260

వ॥ అంత నాయువనాశ్వుం డోరగానిల్చి యవ్వారల నుద్దేశించి యిట్లనియె. 261

ఉ॥ మీరలు మాకుఁ దల్లులు స । మీహితముల్ కొమరుల్ స్వయమ్ముగా
కోరక మున్న నెమ్మి సను । కూర్చుట ధర్మము, మాధనంబులన్
మీరలొసంగినట్టి పవి । మీక యొసంగుట మాకు నెక్కుడే!
తారసిలెన్ శుభంబు తటి । తప్పకచేయుదు మెల్ల వేడుకల్.

చం॥ అనవుడు తండ్రి! యట్లయగు । నంటిమియూరక పల్కవేడ్కకున్
దనుపుట మీపవిత్రజీవిత । ధర్మ వెలింగిన మీకు నేము తె
ల్పను బనిలేదు, మేము పరి । పాలితు లౌటను మీకుఁ దోడుగాఁ
బనులను జేయుటెల్ల పరి । పాటియ యౌ నిది మాకుగానిదే!

తే॥ పోయివత్తుము గృహకృత్య । ములకు వేళ
యనియె నాతన్వి యప్పుడ । య్యతివ వారి
ననిచెఁ గుంకుమ తాంబూల । మందనిచ్చి
చనిరి మునిపత్నులెల్లరు । సంతసమున. 264

చం॥ మునిజను లంకపాళుల స । మున్నత పావన శాములోలలన్
బెనువఁగ నాడునాటికిని । బ్రేముడిఁ గొన్నిన్నెలపోల్కి గోమునన్
దనరుచునుండె పాపఁడు ని । తాంతసముజ్జ్వలచారుమూర్తియై
మనుజవిభుండు పత్నియు స । మంచిత చిత్తత నుండి రయ్యెడన్.

ఉ॥ నిద్దపుఁ జెక్కులుం బసిఁడి నిగ్గులు తేరెడి మోము నొవ్వగా
దిద్దిన యుంగరా ల్కురులు, తీర్చిన కస్తురి నిట్టబొట్టుతో
ముద్దులనాడ నెక్కొనట సోయగముల్ విరజిమ్ముచుండు రా
ముద్దులపట్టి శైశవము మోహనమై విలసిల్లె నెంతయున్. 266
వ॥ అయ్యెడ నాశిశుశేఖరుండు. 267

మాంధాతృని బాల్యలీలలు

తే॥ మునివరేణ్యుల తావళా ల్పొడవడంచి
దాడిపై దాడి వెడలు న ద్గంసు ˜గుచు
తాళగ్రంథాల దళములు తప్పఁ గూల్చుఁ
బీఠములతోడ నెక్కటి బెదురులేక. 268

సీ॥ జననియుఁ బనిలోన మునిగియుండెడి వేళ
కొంగుకొంగునుబట్టి కూడఁ దిరుగు
జనకుండు మఱపించి జలక మాడఁగ నేగ
పడుచు లేచుచు వెన్క నడచిపోవు
పుండ్రముల్ ధరియించు తండ్రితోఁ దినమణి
మోమున మెయినిండఁ బులుముకొనును
వేలిమి పచరించి వేసి వేలుపు మ్రొక్క
గురునితోఁ జేతులు గూర్చి నిలుచు

తే॥ భక్ష్యములు తెచ్చి బాలుర పంక్తిఁ గూర్చి
విందు చేయును తల్లులు వింతపడగ,
నాటపాటల మాటల నోటుగదుర
నేడ్చుపాపల నుడుశార్చి యెలమిఁ దేల్చు. 269

వ॥ ఇట్లు దినదిన ప్రవర్ధమానుండైన యాశిశుచంద్రుం డొక్కనాడు.

సీ॥ పసిఁడి డిప్పలఁ బోలు మిసిమి బుగ్గలమీద
చిఱునవ్వు పాత్తెలల్ చిందులాడ,
పొడిచి గెల్చినయట్లు నిడుమొగ్గవమువున
నడరు నాసికశౌర్య మాటలాడ

వెలిదమ్మి రేకుల 5 చెలువంబు గెలిచెడి
కందోయి నిందిర 5 యందగింప
శష్కులీ మంజుల 5 శ్రవణద్వయంబున
శుభ్రతరత్న సూర్ణ్యర్ధి 5 పాలగు మీర

తే॥ చేతఁ జక్కెర చిలుకను 5 బ్రీతిఁ గనుచు
ముద్దు మూర్తిభవించెనా 5 మోహనముగ
టింగు టింగున నగురుచు 5 సంగడీండ్రఁ
గూడఁ బోయెను చానలు 5 కూడి చూడ. 271

ఉ॥ అందొకబొట్టె రాకొమరు 5 హస్తమునం జెలువారు చిల్కనున్
జిందులు త్రొక్కుచున్ జననిఁ 5 జేరుచు మూల్గుచుఁ గ్రందుచేయగా
ముందుకువచ్చి తల్లి వెను 5 మోదిన బిట్టుగ నేడ్చుచుండ నా
సందున నిల్చి రాబిడుత 5 చక్కెర చిల్కనొసంగి వ్యాసికిన్.

తే॥ ఏడువకు మింక మఱి తెచ్చి 5 యిత్తు నీకు
మీకుఁ జిల్కల నిప్పింతు 5 మీకుఁ గూడ
రండు పోద మని తను కుటీ 5 రంబునకును
సఖులు వెన్నాడి రా వచ్చి 5 సన్నిరముగ. 273

తే॥ తల్లి యొకకంపు టాడిఁజేరి 5 యల్లననియె
"అక్కగా రబ్బి యేడ్చెడి 5 నమ్మ పాప"
"యెందులకు? కొట్టినాడవా! 5 యేమిచేసె?"
"నెన్నఁడేఁ గొట్టితిని యమ్మ! 5 యేరినైన?"

ఉ॥ కొట్టితిఁగాదె మున్న పులి 5 కూనను నొవ్వఁగఁగాల్చు పాపమా
మట్టునఁ గుంటుచున్ జనియె 5 మన్ననఁ జేసితె? అమ్మకంఘువో
పెట్టఁగ మీదచేయి గుసు 5 వెట్టుచుఁ గోరలు చూపఁ గొట్టితిన్
బెట్టితిఁగాదె జింకలకుఁ 5 బ్రేముడి నివ్వరిగింజ లొప్పగాన్ 275

తే॥ సరియె కానిమ్మ నీకు నా 5 సఁగిన చిలుక
నేమిచేసితి వన గెల్చి 5 యెలమి యదర
పోగిరిపోయిన దని తల్లి 5 మొగముఁజూచె
శర్కరాకీర మొగుసునే 5 జాణ! చెప్పుమ! 276

తే॥ "అక్కగా రబ్బికిచ్చితి § నమ్మ యిపుడు"
"ఎంగిలిది యిచ్చినాడవా!" "ఏలయిత్తు?"
"తినుట యొసఁగుట వలదని § తెల్పినావు
మున్న!" "అవునోయి చిటితండ్రి § యన్నదాన". 277

తే॥ అనుచుఁ జిబుకంబు పుణికి ము § ద్దాడి యతివ
శిక్యమున నున్న చక్కెర § చిల్కలంది
బాలకుల కందు తల కొండు § పంచి ప్రీతిఁ
గొమరునకు నొక్క చిలుకను § గూర్మి నొసఁగి. 278

తే॥ 'ఏది' మొగిరింపు మిద్దాని § నేను కందు,"
ననిన 'నెగిరింతునే దీసి § నాడుకొనఁగ
వలదా'! యనుచును ముఖపద్మ § మలర సఖులఁ
గూడి చని నాడు వేడ్కరా § కొమరుఁడంత. 279

ఉ॥ ఈవిధి నక్కుమార వరుఁ § డిమ్ముగ నెల్ల కుమారపాళిపై
జీవముగా వయోధిక వి § శిష్టతనూత్కటసత్వసారసం
భావ్యక శేముషీముఖిత § మంజులరూపలసద్గుణావళీ
ప్లావిత సత్ప్రవర్తన సు § భాషితముల్ విలసిల్ల వర్ధిలెన్. 280

మాంధాతృని విద్యాభ్యాసము

మ॥ సవినోదంబుగ నక్కుమారు లుపనా § చారం బనూచానులై
నవిధిన్ జెల్లఁగ క్రీడిదిద్దెలను ప్రి § జ్ఞాశాలి యబ్బాలకుం
డవలీలన్ గ్రహియించె సత్వరము కా § వ్యప్రక్రియల్ మానులున్
నవరింపన్ ద్విజసంస్కృతిన్నిగమ శా § స్త్రంబుల్ పఠించెన్ రుచిన్.

చం॥ అలరు మొగంబుతో గురుని § యంఘ్రియుగంబును సాగి మ్రొక్కి భ
క్తిలలితరీతిఁ గూర్చొనఁగఁ § దీయని నీటికిఁ జేవ లెక్కిన
ట్లలఘు వచోవిధేయతను § నిమ్ముగ విద్యలు రెండు తొమ్మిదుల్
వలచెఁ గుమారు మార్పులకు § పద్ధతి లేకయ యేమిచోద్యమో!

వ॥ ఒక్కనాడు వసుహోముం డను రాజర్షి సత్త్రముండు చనుదేర నాద

రించి భృగుమౌని యమ్మహనీయుతోఁ బ్రసంగవశమ్మున యువ
నాశ్వ తనయు నుద్దేశించి యిట్లు వచింపఁ దొడఁగె. 283

చం॥ మధుమధురమ్ము లౌచతురు । మంజులవాక్యము లాలకింపగా
బుధులకు వేడ్కఁ జేయు లలిఁ । బూటకుఁ బూటకుఁ గ్రొత్తక్రొత్తలై
సుధఁ జిలుకున్ రసోర్మికల । శ్రోత్రహృదబ్జము లూచు నేత్ర స
న్నిధి నిడు క్లిష్టవస్తువును । నిద్దపు టద్దముబింబముం బలెన్. 284

మ॥ వసుహోమంబుం డిటు లా భృగుండు వినిపిం । పన్ గర్ణపేయంబుగా
వసుధేశాత్మజుఁ డామ నిష్టము వచిం । పన్ మౌనివర్యుండు సం
తసమారం బ్రియశిష్యు రాఁబనిచె । మాం । ధాతృండు
మోదమ్మునన్
వెస నేతెంచి గురూత్తమాంఘ్రులకు సం । ప్రీతాత్ముఁడై
మ్రొక్కెడిన్. 285

చం॥ యమివరుఁ డాకుమారునకు । నాదృతినిట్లను 'నిమ్మహాత్ముఁడీ
హిమగిరి మంజుపృష్ఠమున । నిమ్ములనుండెడి రాజయోగి యి
న్విమలగుణుండు చంద్రికుల । వృద్ధుఁడు తా వసుహోమసంజ్ఞుఁడై
సమములు పెక్కు లుర్వి జన । సమ్మతి నేలిన మేటి పుత్త్రికా! 286

తే॥ అనుచు దరహాసచంద్రిక । లాననమున
రాజిలంగను మాంధాత । రాజయోగి
వసున కభివాదనమొనర్చి । సరగ నతఁడు
నుబ్బుటదతోడ ముందుకు । నొనరవ్రాలి. 287

తే॥ మేను పులకింప బాలు న । మ్మౌని ప్రణతి
చెంతఁ గూర్చుండఁజేసి వ । చించె మునికి
ధన్యుఁ డుర్వర యువనాశ్వ । ధరణిధవుఁడు
మాదు జాతంబు మిహిరుని । మాడ్కి వెలయు. 288

వ॥ అనుచుండు నంత నడఁకువతోఁవ నా రాజసుతుండు— "జనకులు వేచి
యుందు రనుజ్ఞ యే మగుడివచ్చెద" ననిన రాజర్షి మోవిపైఁ జిఱు
నవ్వు చిందులాడ నేమును వెడలనుంటి మని భృగుమౌని నవలోకించి
యిట్లనియె. 28

నా కుమారుని వెచ్చన । నప్పళించి
శిష్యులెల్లరు విన నిట్లు । చెప్పె మౌని. 296

చం॥ గురి విడఁ జేసి మానవుఁ డ । కుంఠిత విక్రముఁడై యొసంగెడిన్
గరిమ సమాజమందునఁ బ్ర । కాశిలు కార్యములుం గ్రమంబునన్
జరుగు సురల్ వరంబులు ప్రి । సన్నత నిత్తురు మేల్మిచేకురున్
గురి విడనేని సేయఁదియుఁ । గూడదు కుంఠితుఁ డౌ నతండిలన్. 297

కం॥ విలుకానికి లక్ష్యమునకు, నెలిగాఁ జూపుండఁ జనదు । విద్యార్థికి నే
నిలుకడ లక్ష్యముపైనను, కలుగని యా చదువు గొంతు ।
గాసియ కాదే. 298

చం॥ జతనము సల్పగా వలయుఁ । జాలు నటంచును నొంటరెండిటన్
జతికిలియుఁ డంగాఁ జనదు । సాధకు లప్పని కిచ్చగింప రీ
హితము మనంబునం దిడి స । మీహితసిద్ధిగ నుండు నేటికి
జతనము మాని పోవుదము । సాగు డటంచును సాగ ముందటన్.

కం॥ అజ్ఞునకును ప్రాజ్ఞునకును
సుజ్ఞానము సహిత గురుఁడు । చొప్పడ నేర్పున్
తజ్ఞతఁ గలుగును భేద ము
పజ్ఞత మణితోడ గాజు । వచ్చెనె సమమై. 300

భృగుమౌని మాంధాతృనకు దివ్యాస్త్రంబు లొసంగుట

ఉ॥ ఆవల నొక్కనాటి యుద । యంబున నా యువనాశ్వ పుత్రుతో
పావనజాహ్నవీసలిల । పార్శ్వమునందు భృగుండు "వత్స! సం
సేవిత సర్వవిద్యుఁడవు । సిద్ధకగుండవు నెల్లవాఁడ, మా
కోవకుఁ జేర్చి యస్త్రముల । గుట్టెఱిగింతు సమంత్రకంబుగా.

చం॥ అని శుచిమూర్తియై శుచిత । సంఘ్రిలముందట భక్తి నమ్రుఁడై
మనము తిరంబు జేసి నియ । మంబునఁ గూర్చొనియున్న శిష్యవ
ర్యునకుఁ బ్రయోగసంహరణ । రూపమునం గల యస్త్ర
మంత్రముల్.
పనుగొన సాంప్రదాయ పరి । పాటి మెయిన్ వచియించె నెండియున్

తే॥ పలికె మార్గి త్రియామాస్త్రము । లలుపములకు
వాడకుము వత్స, యి మ్మంత్ర । పంక్తి నిపుడ
శాంతచిత్తుండవై పున । శ్చరణ సలుపు
మ స్త్రదేవతలు ప్రత్యక్ష । మగు నటంచు. 303

చం॥ పలికిన దేశికోత్తముని । పాదములం బడి లేచి నిష్ఠతో
నిలిచి యుదఙ్ముఖంబుగ వి । నిర్మలుఁడై జపియించె మంత్రమా
ర్తుల సపనీశనందనుఁడు । తోఁచి తదగ్రిభువిన్ తదస్త్రముల్
వెలుగులు పర్వ నొక్కొకటి । వేగ ఘటింపు మభీప్సితం బనన్. 304

తే॥ అనిన నాశ్చర్యచకితుండై । యస్త్ర విబుధు
లార! భవదీయ దర్శన । లబ్ధిచేత
ధన్యతముఁడను దలఁచిన । తత్క్షణంబ
నిలచి నిజశక్తి ప్రకటింపుఁ । డెలమి కలుగ, 305

చం॥ అని ప్రణమిల్లి యిక్కకు ద । యామతి సేగుఁడనన్ దదస్త్రముల్
చనువున "సల్లయూ"సని వ । శం వగతన్ విశదంబు చేయుచున్
జనియె మునీంద్రుఁగాంచి యరు । సంబున; నంత గురుండు శిష్యుఁడున్
గనుగొని కొండొరున్ లలిముఖంబులఁ దృష్టి తురంగలింపఁగాన్.

వ॥ అంత నాగురువరుండు వినీతుండగు నయ్యంతేవాసితో నిట్లనియె.

కం॥ సమయము నారడిసేయక
సమయమహాత్మ్యంబు నెఱిఁగి । సల్పిన చెయ్వుల్
సమయంబున ఫలియించును
సమయజ్ఞత లేనినాడు । శ్రమయే మిగులున్. 308

కం॥ తతినాటిన బీజము భువి
శతగుణముగ వృద్ధిఁ బొంది । సంపత్కరమౌ
తతినాటని విత్తన మది
యతఫలమయి పెంపులేక । యాఱిఁ బోవున్. 309

చం॥ విను మొకనీతి వత్స! మఱి । పెంపు గలప్పుడె చంకకెక్కుచే
యనువయినట్లు వేలుపుల । కైన శుభావసరంబు నంద మే

ల్పములకు మేకొనన్ విజయ । లాభము చేకుఱు కాలపాకముల్
గనుగొను నేర్పు చేకొనుము । కాలము మూలమ దెల్లవానికిన్.

తే॥ చెప్పవలయును మఱి వి । శేషించి నీకు
ఛాయ నిరూప మయ్యెడి । సదనమునకు
పోవుద మటంచు తాము ను । పోవసాగ
భ్రాతృఁ డేగెను వెనుకను । ఛాయ వగిది. 311

వ॥ తదనంతర మ్మొక్కనాడు. 312

మాంధాత గంగాతీరమునకేగి ప్రాకృతదృశ్యములు విలోకించుచు
వసుహోమ ఆశ్రమమునకేగి యట నా రాజర్షిపుంగవుచే
"ఆజగవం"బను చాపంబును అక్షయము లైన శృంగనిర్మిత శరంబులను బడయుట.

ఉ॥ తీవ్రతలంపు లుల్లమునఁ । దీఁగెలయట్టులు వానకాలమునన్
మోపుగఁ బ్రాఁకి పాదతల । ముం గిలిగింతలు గొల్పె నా ధరి
త్రీపతిపుత్త్రిఁ దొంటిమొఱఁ । దెమ్మెరి పిల్లలు వేడ్క పెంపఁగా
జూపులు తీపి రూపుసిరి । సొంపును నింపఁగ మోముఁదమ్మిపై. 313

చం॥ కిచకిచ పెట్టుచుండ రవి । ఘృష్ణులు పశ్చిమదిక్కుభాంగికిన్
సచివగతిన్ సమీరము ప్ర । సన్నత వర్తిల పీడి మందిరం
బచిరమున న్మరున్నదికి । నంతి వసించెను సైకతస్థలిన్
బ్రచురతరంగకన్యకల । భద్రవిలాసములొలిఁ జూచుచున్॥ 314

వ॥ పదంపడి యక్కుమారశేఖరుండు తత్పరిసరమ్ము లందు. 315

చం॥ ఒకచిని మించి వేఱొకటి । యుజ్జ్వలరూపము చూపుచుండ నా
సికతిలధారణిన్ విడచి । చెచ్చెర నగ్రిమ వృక్షవాటికా
ప్రకట మనోజ్ఞదృశ్యములు । భావముఁ గొన నేగిఁ జూడఁగా
నికట మహీధ్రపాదములు । నేత్రవినోదము సల్పుచుండటన్. 316

చం॥ చని యటఁ గాంచె ముందు హిమ । శైల సమున్నతచారుకందరం
బును సరళద్రుమావృతము । పొంత మనోజ్ఞఫలోరు గోస్తనీ

గుణవృత్తిగల్గు నాశ్రమము | కన్నులపండువు సేయఁ జూచి న
య్యనఘకులభూషణుం డరిగె | నిమ్ముగ నవ్వసుహోముఁ డయ్యెడన్.

ఉ॥ స్వాగతమంచు మాణవక | చంద్రము మ్రొక్కెడువాని మక్కువన్
గౌఁగిటఁ గ్రుచ్చి "వత్సక" య | కాలమునం జనుదెంచినాఁడవి
యోగము దైవికంబు పడ | యుల్లము నీపయిఁ బారె మా కిటన్
బాగని కేలు పట్టికొని | వచ్చుచు లోపల నున్న పత్నితో 318

తే॥ తన్వి! ఇటవచ్చె నెవర | త్నంబు గంటె?
రాజకులమండనంబు వి | రాజమాన
కోసలమహీశభుజంబు | గురుకులమున
శాణితంబిది కళలఁ బ్ర | శంసితంబు. 319

చం॥ అనవుడు నవ్వధూటి దర | హాసరుచిన్ ముదిమోము దీప్తమై
తనరఁగ డాయుచుం దనప | దంబులకుం బ్రణమిల్లు మాన్యశీలునిన్
దనయునిమాడ్కిఁ గూర్మిఁ గయి | తమ్ములఁ జేర్చి మస్తకంబు మూ
ర్కొని మునివ్రేళులన్ జిబుక | ముట్టలముల్ సవరించి ముద్దిడెన్.

తే॥ తండ్రి! కూర్చుండుమంచు నా | దంగతులును
పీటఁ గైకొని రంత నా | వృద్ధమహిళ
"గురులు మున్నుగ నెల్లరు. కుశలు లౌరె!
యనినఁ గుశలులె యవ్వరో! | యనియె నతఁడు. 321

వ॥ అంత సుగుణవత్సలుండగు వసుహోముండు పత్నితో నక్కుమారు నుద్దేశించి యిట్లనియె. 322

చం॥ అమలమనీషశాస్త్రముల | నన్నిటఁ దార్చె నతం డసీమఁ బు
ణ్యముల సరమ్ములట్లు సతి! | పౌరుషమూనిన పల్కుబోటి శీ
లమునకు దర్పణంబు శుభ | లక్షణుఁ డార్యగుణైకతానుఁ డీ
కొమరుని బాహుసంశ్రయముతఁ | గుంభినియుం గరువంబు నొందెడిన్.

వ॥ అంత నా కుమార వసుహోముల కిట్లు సంభాషణంబు జరిగె. 324

తే॥ అనుచు వెనువెంట నిర్యాయ నా(శమమ్ము
దాఁటి చని కన్నుమఱుఁగగు దనుకఁ జూచి
బాలు బలశీలము లఁగూర్చి పలికికొనుచు
మఱలివచ్చిరి ముఖకాంతి మందగింప. 339

తే॥ తలవని తలంపుగా నీవు ధనువు తనకు
హస్తగతమాట నవలీల నాత్మలోనఁ
బొడలు తలఁపులు పురిగొట్టఁ బొదలుకదల
నడుగు గొడగఁబడనంత వెడలె వటుఁడు. 340

తే॥ దైవమున కిష్టమగునేని తలఁపు తాన
పొడము తదనుగుణమ్ముగ నడమకొనును
తెలియుకయు జీవి తోడన కలుగు ఫలము
ననుభవించును శుభమైన నశుభమైన 341

తే॥ సఖుల విడువక చరియింపఁ జనని కట్టి
కీశతమ్మునఁ జను తలఁ పేలఁగలై?
నెన్నఁడెఱుగని యునుకుల కేలపోయె?
కాన నిదియెల్ల దైవఘ ఘటన కాదె!. 342

చ॥ పసుచుఁదనంపుఁ బెంపడరు బాహుజవీరుల మూపుబంధ యా
మృతుని శరాసనబు జన మేయను! చారుహిమాద్రి దృశ్యముల్
దడదడ తాలపైదొరలు దైవత గిరి మున్నుచ్చటల్
బుధులవజీరు నుద్దపటి పొంకమడంప వదేమి! యత్తటిన్. 343

వ॥ కతిపయదినంబులు గతించినపిదప. 344

ప్రాతఃకాల వర్ణనము.

చం॥ పలపల తెల్లవార ముని పల్లియ బాపలు వేల్పుటేటిలోఁ
బలుకుచు దేశకాలములఁ బద్ధతి నొప్పన మున్కవెట్టుచున్
బిలపిల లాడుచుండి పృథివీసురపత్నులు నొక్కరేవునన్
జలుపుచు నాత్మకృత్యముల సందడి నుండిరి సద్దులాడుచున్. 345

చం॥ అకలుషజాహ్నవీతటము నందున విప్రులు కొంద ఱుద్యద్భా
నుకరము సోఁకకుండ శిఖ నూత్నరుచుల్ వెలుఁగొంద శ్రీల్వఁ ద
న్నికట తలానఁ గొంద ఱవ నీసురు లర్కుని జూచి హోమము
న్సకలము నిర్వహించు జత నంబుల నుండిరి శిష్యయుక్తులై. 346

వ॥ అంత నట మునిపల్లియందొన 347

సీ॥ ఒకతల్లి పంచలో నున్న యావునుపిండి
యెడపాపనికి త్రావ నిచ్చుచుండె
ఒకయింట బాలెంత యెవ్వగాఁ గూర్చుండి
నిసువున కుగ్గు పా లొసఁగుచుండె
ఒక వధూమణి జరా వికలాంగు లగు నత్త
మామలసేవమై మసలుచుండె
ఒకసతీమణి యంగ వికలుఁడౌ భర్తను
తొలిసంజపనులకుఁ గలుపుచుండె

తే॥ తెవ్రలుమువ్వల తీండ్రిన దిటవు తొలఁగఁ
బడక పెట్టిన జనకుని పజ్జఁ జేరి
పుత్త్రికయొకండు శుశ్రూష పొసఁగఁజేయ
శ్రద్ధమై పాటుపడుచుండె శాంతమతిని. 348

సీ॥ మరకతమణికాంతి మంజులం బగు సాంద్ర
శాద్వలస్థలముల సౌరభేయు
లానందమూర్తులై యందాలపోవులై
యావురావుర మంచు నాత్మమఱచి
పులుమేయుచుండె సర్వత్ర్యాశ్రమస్థలి
చత్వరంబుల మృగ శాబకములు
విప్రార్భకులువెట్టు వెన్నలు నములుచు
నాలవేగలఁగూడి యాడుచుండె

తే॥ వనిల శిశువులు సయ్యాట లాడుచుండెఁ
దీవె పావలతోఁ గూడి తియ్యమెసఁగ

వ॥ అనిన విని జనమేజయుండు మునీంద్రా! యీ తెఱవాటుమూకల దుండగంబులు పెక్కుడల వినవచ్చెడిని. అమ్మూకల పూర్వ వృత్తాంత మ్మెట్టిదో వివరింపుఁ డని వేడుటయు వైశంపాయనుఁ డిట్లు చెప్పందొడఁగె. 356

దస్యుజన వృత్తాంతము

చం॥ అరకొరలేని ప్రాయము న ౹ హమ్మతి, ప్రాభవ, మర్థసంపదల్
పరిగొన విఱ్ఱవీగ నర ౹ పాలక పుత్త్రులు తొల్లి దుష్టచె
కర ముగు బాధలన్ జనులఁ ౹ గాఱియ వెట్టఁగ నోర్వలేక త
ద్గురువులు పంపివైచి రతి ౹ దూరము వారల నిష్టకోటితో. 357

తే॥ యౌవనంబును ప్రాభవ ౹ మర్థబలము
నజ్ఞతయు నొక్కడొక్కండె ౹ యతుల హాని
గూర్చు నరునకు నివినాల్గు ౹ గూడెనేని
కలుగునుపద్రవ వర్ణింప ౹ నలవియగునె? 358

ఉ॥ ఈకరణిన్ వివాసిత మ ౹ హీశసుతావళి నాడు నాటికిన్
బ్రాకెను పశ్చిమోత్తరపుఁ ౹ బర్వతసీమల కిష్టకోటితోఁ
జేకొని తన్నివాస జన ౹ మిత్రత నవ్వల బంధుభావమున్
జేకొని నూత్న వంశముల ౹ గృష్టికి గారణమైరి వారలున్. 359

చం॥ ద్విజజనయోగ్య సంస్కృతి త ౹ దీయ సుతాళికి దూరమౌటఁ ద
త్ప్రజ లిలఁ బాటిగా వెలసె ౹ వ్రాత్యత, దానను భారతప్రజా
వ్రజము నికృష్టతం గనుచు ౹ వచ్చెను వారల సూర్యచంద్ర వం
శజులిటు భ్రష్టతన్ మనెను ౹ మంతువు సైతురె భారతప్రజల్. 360

తే॥ వైర మిది తరతరముల ౹ వచ్చుచుండ
నాటవికజాతి శీలము ౹ లనుగమింప
వ్రాత్యరాజన్య సంతతి ౹ వానకాఱు
పుర్వు తెర లట్లు నల్గడ ౹ బూరటిల్లె. 361

తే॥ పశ్చిమోత్తర సీమల ౹ పర్వతముల
కందరములందు హిమగిరి ౹ గహ్వరముల

వింజముల లోయలందును । వేఁకదన్ని
క్రిమముతో దండకాలని । దాపురైరి. 362

తే॥ ప్రజలఁ గాఱించి ధనధాన్య । పశుగణంబు
నపహరించుచు నప్పుడప్పు । డాశ్రమముల
మైలపఱచుచు నొంచుచు । మౌనిజనము
నలగుచుండెను బలిమి నా । ఖలగణంబు. 363

ఉ॥ ఈనృశచేష్టలం గను ని । హీనత వర్తిలు క్రూరపాళి నీ
మేదిని దస్యులంచు మును । మేలి కొలంబులవారు పల్కి రీ
చేమగొనంగఁ బుర్వులను । చేష్టల విప్లవమే ఘటిల్లె నీ
వైదిక పుణ్యభూమికి ని । వారణ దక్షనృపాల హీనతన్. 364

ఉ॥ కాలకరాళమూర్తులగు । ఘాతుకులం గనినంత ప్రాణవా
తూలము తూల నప్పుడర । దోరిన విప్రకులంబు దీనతన్
“జాలము చేయఁ గాదు మనఁ । జాలము చయ్యనరంతు కావ రా
జ్యాలకులార! దస్యుగణ । పాణుల జిక్కితి” మంచుఁ గూయిడెన్.

తే॥ ఆశ్రమావని నల బల । మాలకించి
యొంతలో నున్న పనులకు । నంతలోన
స్వస్తి వచియించి శ్రచ్చర । వచ్చుచుండి
వెలిగ నచటికిఁ బనులలో । మెలఁగువాఁడు. 366

వ॥ ఆసమయంబున—

మాంధాత దస్యుగణంబును తతిమివేయుట.

తే॥ పడుకపట్టిన తండ్రికిఁ । బార్శ్వమందు
బాలచంద్రుఁడు మాంధాత । లీల హరిణ
శిశువునకు వన్యబీజాళి । చేరతోడఁ
బెట్టి తేనియ రుచులొల్కఁ । బట్టుచుండ. 368

ఉ॥ ఆయెడ వీనులం బడిన । యార్తసినాదము లేరి కెందు నే
మాయె నటంచు మానసము । నాదెస వీనులనంపి బాలకుం
డాయతమా శరాసనము । నంటుచు మార్గమునై ప్రజాచుచున్
పాయము లేవి తండ్రిదెస । జాలిగఁ జూచుచునుండె నంతటన్. 369

చం॥ తటుకున లేచి తీక్ష్ణముగఁ దాఁకెడి సంపరకోర్వలేక యా
కటికులు బాలుపైఁ గవిసి కార్ముకముల్ వెస లాగివైవఁగాఁ
జటుగతిఁ జుట్టుముండ నరి భంగి భ్రమించుచు యుక్తిశాలి యా
వటువు శిలీముఖప్రతతి వారిపదంబుల గ్రుచ్చి యుగ్రతన్. 377

చం॥ పరిగొనమాని రోసమునఁ బైల గుహాంబుల జాల రువ్వఁ బో
గరముల యంగుళుల్ తునియఁ గాటికి వెట్టుచు నంగకంబులన్
దొరఁగఁగ రక్తధారలు కుతూహల మారగముంచె నమ్ములన్
శరముల నేయుటల్ తొడుగు చందములుం గనరాని యట్టులన్.

తే॥ ఈసుమై వచ్చు కొండజం టీగ లట్లు
విసురునవ్వచ్చి గాడగ విశిఖ వితతి
గాయములనుండి రుధిరముల్ గారుచుండఁ
బుష్పిత పలాశతతిఁ బోలు ముచ్చిచ్చుమూఁక. 379

తే॥ "ఒడలిపై నొక్కటేటును పడఁగనీదు
వేయుఁ గన్నులఁ జూచును వీఁడు చూడఁ
గుఱ్ఱకాదుర చోదుల గురువుకాని
వీనిపసపట్టుదము ముందు వెడలి రండు." 380

తే॥ పలికొని యిట్టు లొండేమి సలుపలేక
బండపై నత్తికొట్టిన భాండమట్లు
వికలమై పోయె నామూఁక వింతయౌర!
ఆకుఁ గదలదు కీటక మూఁక చచట. 381

ఉ॥ ఈగతి దిక్కుకొక్కఁడుగ నేగుచు నుండఁగ బాలవీరుఁ డా
త్యాగలఁ గాంచి యిట్లను బిడాన పలాయితులౌట శౌర్యమే?
యేరితి రింతె నిల్చినవి యిట్టివి మానుషుపుల్ మగంటిమి
చేగయు నొడ్లనొంపనే? యి సీ యివి యేటికి పాడుపుట్టువుల్.

చం॥ అనుటయు ధూర్తుఁ డొక్కఁడు నృపార్భకు వంక మహోగ్ర
దృష్టులన్
గని వెనుబాటుగా నొదిగి కార్ముక మెక్కుడు పెంచునట్టి రా

ట్టనయుని మీఁద క్రూరముగఁ । దాకఁగ జాలిని దవ్వి బల్కిరౌ,
జనియె రయాన చోరునకు । చౌర్యము కాక మహోత్కటబ్బునే.

వ॥ అంతలోన.

చం॥ సిగముడి వీడఁ జందెములు । చేతులపై దిగజార కొమ్ములో
బిగువెడలంగ ధోవతియు । పిడులు బాహులఁ గాళ్ళ రక్తమై
తగులఁ బదాలు తొట్రిలఁగ । దైన్యధురీణతవర్తి గాసురుల్
తెగడుచు వచ్చెఁ బట్టియుఁ, జను । దెంచిరి రాజకుమారు
ప్రోలకున్. 384

తే॥ అశనిఖండ నిభంబైన । యస్త్రకమ్ము
మసృణ సుకుమార గాత్రుఁడౌ । మహితలాధి
నేతృసుతు జీవపదమైన । నెమ్ము గనఁగ
దగిలె హా హా రవంబులు । దడదడించె. 386

ఉ॥ అంత భృగూత్తముం డతిర । యాన శిలాపరిహారమ్ము వేదనన్
సంతమసమ్ము గ్రమ్మ ధరఁ । జాపశరమ్ముల త్రోసఁ గూలు నా
కంతుసమాన బాలకుని । కైగవఁ బట్టి నిజాంకపీఠిపై
నెంతయు నొచ్చుకొంచు మది । నిమ్ముగఁ జేర్చెఁ గృతాసనస్థుఁడై.

తే. ఆశ్రమంపు బహిర్ద్వార । మైన కట్ట
వేడినెత్తురు లత్యగ్రి । విధిని బాఱ
మోము జేవురుముద్రగా । మూర్ఛ మునిఁగె.
నచటఁ బశు పక్షి మృగములు । నడలె నపుడు. 388

చం॥ మునికులనాథుఁ డున్ గొమరు । మోముగతిన్ బొడగాంచి
బాష్పముల్
చినుకఁగఁ, జూచు చేడియలు । చెక్కులు నశ్రులు జాలువారగా
వసరిరి. కన్నవారు పెర । వారలయైనను సన్నికర్షచే
నొనరు మమత్వమట్టి దది । యోగిమనంబులనేఁ గలంచెడిన్. 389

వ॥ అంత. 390

ఉ॥ క్రూరశిలాహతిన్ దనుదు । కోమల హృత్కుసుమంబు గాసిలన్
దూరుచు దుర్విధిన్ మిగుల । దుఃఖితులై గురువర్యులెల్లరున్

జేసి సుఖోపచారములు । చేయుము “ సిద్ధరసాదులేపనౌ
షధుల నీతఁ డింక ముని । పుంగవ! గాసిలఁ జెందఁ జేయువే 391

తే. బాల్యసమాఘాత సాధ్వస । భావ మార్చి
మనుజ సమాఘాతటస్థిత । ననిచి వెలికి
నమరగుణముల మున్నాడి । యునికి దిగిన
బాలునకు మే లొనర్పుట । పాడి మనకు”

భృగుమౌని మాంధాతృ మేనునకు సిద్ధరసము పూయుట.

ఉ. నావిని మే లటంచు ముని । నాయకుఁ డౌషధపుంగ రాటమున్
వావిరిఁ దేర శిష్య । పరివారము గైకొని దాన మున్న సం
భావిత మైన మందుఁ గల । వంబు నలంది కుమారు మేనునం
బావన లేపనంపు మహి । మన్ మృదుశీలుఁడు బాలుఁ డంతటన్.

తే. కనులు నులుముచు నిద్ర మే । ల్కాంచినట్లు
లేచి కూర్చుండి యుత్సాహ । లీల మెఱయ
కెలన బలసిన గురువిప్ర । కులముఁ గాంచి
వింత గన్పట్టు మైపూఁత । నంతఁ జూచి 394

తే. వినయ భయ విస్మయంబులు । పెనగొనంగ
హస్తములు మోడ్చి యలన । యార్యులార!
“శ్రమము పెట్టితి మంతువు । సైఁపుఁ” డనియె
మోము లలరంగ నిట్టులు । మునులు ననిరి. 395

కం. “మా కెఱుక లేని తెఱగున
నే కాశిత నిట్లు దస్యు । బృందము తెఱువన్
నీకొదవె నింత యుంతువు
చేకొని సైచితివి లెమ్ము । క్షితిప కుమారా. 396

తే. ఈ వొనర్చిన యుపకార । మెన్నఁ డేని
మాఱుపరాదిది దీన నీ । మతు వేవి?
“పొసగ మీచేత నుపచార । ములను గొనుట
తప్పిద మొనర్చినట్టులే । తలఁప నగును”. 397

తే॥ "ప్రాణములు కాచినట్టి దా  పన్నుఁడైన
నాదుకొనుట మనుష్యున  కగ్రిమనిధి"
"పైరు పెట్టి రక్షించెను  ఫలము నేఁడు
విహితకృత్యము లుపకార  విధుల కగునె!" 398

తే॥ "విజ్ఞుఁడవు నీకుఁ జెప్పెడి  విధులు కలవె?
రాజనందన! నీమేను  రసవిలిప్త
మగుట నొగిలించ వెట్టి ప్ర  హారములును
పోరులం దింక శ్రమమెల్ల  తీరినదియొ." 399

వ॥ అనుటయు నాబాలకుండు. 400

ఉ॥ "తీరె శ్రమంబు సౌఖ్యముగ  దేహము తొల్లిటి కన్నఁ జేవమై
తేరకొనెన్ భవత్కృతి వి  తీర్ణ వరాకృతి భాగ్యమయ్యె" నా
వేరము పొమ్మ పెట్టికొని  వృద్ధులు నీవయి పంచప్రాణముల్
దారిని చూచుచుండెద ర  తంద్రత వారల జెంగ మాన్పుమీ. 401

తే॥ అనుచు గురువరు లానతి  నవనిమీద
సాగిపడి మ్రొక్కి యెల్లరు  సంతసమున
దీవనలొసంగి పంప నా  ధీరుఁ డెలమిఁ
జనియె మిత్రులు తనకు జై  జయలువలుక. 402

మ॥ ధనువంశంబున వ్రేల నాయతశర  ద్వంద్వంబు నూగించుచున్
దనతో డన్ వడివచ్చు మిత్రతతి మి  త్రఖ్యాతి దీపించు రా
ట్తనయున్ జూచుచునిల్చి యించుక జటా  ధారి ప్రకాండంబు తాఁ
జనియెన్ దుర్గుణశీల రూపములు వి  జ్ఞానంబు రూపించుచున్. 403

శశిబిందుఁడు మాంధాతృనకుఁ గూఁతు నిచ్చెదనని
యువనాశ్వుని వద్దకు బురోహితు నంపుట.

వ॥ ఇట్లు ప్రథమ విజయలక్ష్మీవిరాజమాన తదాత్మజకిశోరుం డభ్యుదయ
శాలియైయుండ నొక్కనాడు శశిబిందుచక్రవర్తి సాకేతపురీప్రభు
శేఖరునకు శుభోదర్కంబుగ 404

శా॥ "ఆయుష్మంతు" భవత్తనూజుఁ గని యా  త్మాధీన విద్యాలయ
శ్రేయఃప్రాపక వార్షికోత్సవ సుగో  ష్ఠీవేళ తచ్చరిత్రముల్

మాయింటన్ వెలయింప నాప్తగతి సంభావించి రం దెల్లరున్
ధ్యేయస్థాన మొసంగె 'బంధుమతి' పుత్రీరత్న మద్దానికిన్. 405

ఉ॥ పుత్త్రిన దగ్రగణ్య! జనపూజ్యుల వియ్యము మాకుఁ దివ్యమౌ
గోత్ర పవిత్ర వృత్త! మన కున్ నవమాన్యుల, బాంధవమ్ము స
న్మైత్రియుఁ గీర్తి, శిల్పిముని మాదు పురోధ మదీయ పుత్త్రికా
చిత్రము యుష్మదీక్షణ గుణ చిస్ఫుట భావముఁ బూని యుండటన్.

వ॥ అని యిట్లు మేనకమ్మ వాయించి నిజపురోహితుని కై వస మొనర్చి యాఁపె ననిన విని జనమేజయుండు మునీంద్రా! శశిబిందుఁ డట్టి చరిత్రంబు గలవాఁ డెయ్యది యారాజయ్య రాజధాని! తద్వృత్తాంతం బాకింత తేటపడఁ దెల్పవే యని వేఁడ వైశంపాయనుండు వెండియు నిట్లు వచించె.

శశిబిందుని వృత్తాంతము.

ఉ॥ భారతభూమినంటికొని పశ్చిమవారధిలోన నొప్పెడిన్
జేరినదీవి చందముగు పృథ్వి "కుశస్థలి" నా మహాపురం
బార రమావిలాసములు నాకపురంబు నలకాపురంబులన్
గేరుచు భారతేందిరకుఁ గేలఁ జెలంగెడు నబ్జమో యనన్. 408

మ॥ ధర నానర్త నివృత్ప్రధానపురమా తత్పట్టణాధీశు ను
ద్ధుర సత్త్వాంచిత చక్రవర్తి శశిబిందుం డాతఁ డాసక్తి న
ధ్వరముల్ పెక్కొనర్చి దక్షిణలు విస్తారంబుగా నిచ్చి భూ
సుర దేవావళిఁ దన్పి పేర్గనిన సుశ్లోకుండు భూపావళిన్. 409

సీ॥ పాశ్చాత్యసీమల బాహుబలంబున
సాధించి మించెనే చక్రవర్తి
విశ్వమానవకోటి విత్తేశుఁ డితఁ డనఁ
బాగడఁగ కెక్కెనే పూజ్యతముఁడు
మేల్మి నొంటొకటిని మించు దక్షిణలతో
యజ్ఞముల్ పెక్కులే యజ్వచేసెఁ
దనరారుజాతి రత్నంబులు పదునాల్గు
కలఁ డని యే మేటి గణుతికెక్కె

తే॥ రసికుఁ డాతఁడు శశిబిందు ✽ రాజవరుఁడు
మధుర సురభిళ మంజుల ✽ మహితమూర్తిఁ
దనరు మాంధాతృ రాజ ర ✽ త్నంబుమీఁద
మనసు వెట్టెను రతనాల ✽ మమతచను నె? 410

వ॥ అంత నా పురోహితుండు కతిపయ ప్రయాణంబుల భార్గవాశ్రమంబు
నకుఁ జనుదెంచి భృగుమునీంద్రు సముచితంబుగ సందర్శించి తన
వచ్చిన యుదంతం బాద్యంతంబు విశదపరిచి తదనుజ్ఞాతుండై జరా
రుజా క్రాంతులై శయ్యాగతులైన యారాజదంపతుల సుముఖా
ర్తంబునఁ గాన్పించికొని తదీయాదర సత్కారంబులు వడసి కొని
వచ్చిన శుభలేఖ విప్పించి చేతనిడి నిజరాజపుత్రియగు బంధు
మతీదేవి నిలువు చిత్తరువు తత్పురోభాగంబున నిలిపిన నయ్యవస
రంబున. 411

చం॥ కని యువనాశ్వ భూతి వి ✽ శాసమునం జెలువార చక్షువుల్
వినయముతోఁ బురోహితుఁడు ✽ వీనుల విందుగఁ గన్యశీలముల్
గొనములు విద్దె బుద్ధులును ✽ కోమలభంగి వచింప రక్తిగా
విని చెవులూర గేహినికి ✽ వేడుకఁ జూపుచునుండెఁ జిత్రముల్.

వ॥ అనిరీక్షితంబుగా నాతరుణంబునఁ దత్కుమారుండు. 413

తే॥ లచ్చికొమరుని రూపు వి ✽ లాస మడర
ద్రాక్షపండ్లను గైకొని ✽ దరికి రాఁగఁ
బూసగ నాబాలుకజ్జను ✽ వెసఁ బురోధ,
తమ నృపాత్మజనిలువు చి ✽ త్తరువు నిలిపి. 414

మ॥ కనుఁ డీప్పాటఁ గుమారుఁ గోడలిని నా ✽ తొల్లక్ష్మి శాలాకృతిన్
గొనవై యున్నది మీ తనూజుఁడును వై ✽ ...తుండె యచ్చంబుగా
ననువై యున్నవి జాతకంబు లివి యా ✽ హాయంచుఁ జూపించి త
న్మనముల్ మట్టఁగ ముచ్చరంగనిదె కో ✽ మూంచంబు
దీపింపఁగాన్. 415

ఉ॥ శయ్యలపైన డిండులకుఁ జాఁగనాని విలోకనంబులన్
సయ్యమునించ, నాస్యమున నిర్మల హాసరుచిప్రరోహముల్
తియ్యము పెంపఁ జూచికొని తృప్తత నొందొను నా సతీపతుల్
చయ్యన జూచి రాత్మజుఁ బ్రసన్న ముఖాంబురుహాంబు
నొక్కటన్. 416

వ॥ అంత నక్కిశోరుండు. 417

తే॥ తల్లిదండ్రుల మధురసందర్శనమున
సంతసంగాన గిలిగింత లడరినట్లు
తానుఁ దటుకునఁ గాంచి చిత్తరువు వంక
విహసిత మొనర్చె రత్నాలు విరిసె నచట. 418

తే॥ మధురదృశ్యంబు నద్దాని మానవేశుఁ
డంత వీక్షించి యుత్కంఠుఁడై హస్తయుగళి
నాత్మజుని దీసి యక్కున నదుముకొనుచు
శిరము మూర్కొని మేనిపైఁ జేత నిమిరె. 419

మత్తకోకిల॥ భూసురేంద్రుఁడు వారిపొందిక ముద్దుగాఁ బొడగాంచుచున్
"కోసలేశ్వర! వీరియోగము కూర్మితో సుసౌరభ
న్యాసమై మణికాంతులట్టుల నందనంబయి పొల్చెడిన్
వాసరేశకులమ్ము మించు శుభమ్ముగన్ సెలవిమ్మికన్".

ఉ॥ నాపుడు హర్షనిర్భరవినమ్రిత నించుక లేచి యిట్లనున్
భూవరుఁ "డో ద్విజోత్తమ ప్రమోదము కల్గె భవచ్ఛుభోక్తులన్
భావుక కాంక్షి మద్గురుని పల్కు శుభావహ మా మహాత్ముఁడే
యావిరిఁ గర్జముం దెలుపు వాంఛిత సిద్ధిగ సత్వరమ్మునన్". 421

తే॥ అనుచుఁ గొమరుని సత్కారమాచరింపఁ
బనిచె సత్కృతిఁ జెలువారు బ్రాహ్మణుండు
నాశిషము లొప్పఁ బల్కి ఫలాక్షతలను
కరముల నొసంగి చనియెను గౌతుకమున.

వ॥ వెంట నా భూసురు సాగనంపఁ జిరంజీవి యరుగుటయు నయ్యవసరంబున నాకోసలేశుండు కుటుంబినితో.

శా॥ ఈడుంజోడు సమానమై యడరె నన్యోన్యానుక్తిరూపంబుతో
డోడ స్పందనరూపుఁ గన్నులకు విందై దుర్జేయు చుండెన్ సతీ
తోడం బాన్పకు దార్ఢ్యమబ్బ నొనరింకతుర్ బెండ్లి శీఘ్రమ్ముగాఁ
గూడెన్ మా చిటితండ్రి పెండ్లి గన నాకై ఘోషింతు
రాష్ట్రంబునన్ 424

మ॥ శశిబి-ముప్రభునంతవాడు మనకున్ సంబంధి కాగోరుచున్
వశవర్తిత్వము చూపె గాగల మహాభాగ్యంబు బన్నంబు నే
దశ తప్పింపగలాడెవాడు? మఱి నా దైవంబు మేలెంచినన్
భృశ సంతోషముతోడ భావిదశ వర్తించున్ శుభశ్రీకమై. 425

వ॥ అనునంత నాత్మజుండు చదురంగమాటయుఁ దత్సంభాషణంబు రూపాంతరంబునొందె నిటు లాదపతో లగ్రిమశ్రేయఃఫలంబునకుఁ జేఁజూపి యున్నస్ఫూర్తి మీఁదుమూచుచుండ శుభము శుభమ్మె ననువర్తించు ననుటకు నిదర్శనంబుగా.

కోసల మహీప్రజలు కుమారుని పట్టాభిషిక్తుఁ జేయుం డని
యువనాశ్వునకు విన్నవించుట.

చం॥ కువలయనాథ! మాకములకుం గనవయ్యెను రాజదర్శనం
బవిరళహాయనంబులుగ, నాత్మసమానుఁ గుమారచంద్రమున్
బ్రవిమలతేజునిన్ విబుధరంజన సర్వకలాకలాపునిన్
బవినిభసాయకప్రకరపాటిత దస్యుతమఃకలాపునిన్. 427

చం॥ శుభవిభవోజ్జ్వలస్థితులు చొప్పడఁ గోసల భూప్రజాళికిన్
బ్రభువుగఁ జేయు డుర్విని సుపర్వజగద్ద్యుతి మించ నేలు నీ
శుభతరుణంబునం దనుచు సూరులు శూరులు కోసలప్రజల్
ప్రభునకు విన్నవించిరి శుభంబని పార్థివుఁ డొప్పె నంతకున్. 428

రాజదంపతులు కాలకంచితులగుట.

వ॥ ఇంతలో "తానొకటి తలఁచిన దైవంబు వేరొకటి తలఁచు ననునట్లు తలంపులు తీరకమున్న దుర్దైవం బాదంపతుల ప్రాణవాయువులం బుట్టినింటికిం బాఁడోలె."

ఉ॥ ఏరికి నేఁ ప్రపంచమున ‡ నెల్లదినంబులు నేకరీతిగాఁ
దీరవు, రాటపాటులగ ‡ తిర్ చనుమంచు సుఖంబు దుఃఖముల్
దోరపు సౌఖ్యముల్ విడచి ‡ తోయజనేత్రతో నృపుఁ డాశ్రమావనిన్
జేరి కుమారుఁడై వెతలఁ ‡ జెంది ఫలంబును గాంచె నట్టికిన్. 430

ఉ॥ పౌరులు మెచ్చ బందుగులు ‡ పాయనిప్రేమను ముద్దుచేయగాఁ
గోరక స్వస్థలంబునను ‡ పుట్టిన నొవ్వగు నెల్లవారికిన్
గోరిక లట్లయుండ, నర ‡ కూకు భుజించెడి నాశ్రమంబులన్
జేరిన రాచకూనలకుఁ ‡ జెల్లునె ముద్దులు? వేడ్కతీరునే. 431

ఉ॥ పుట్టిన పట్టికిన్ విభవ ‡ భూషిత పోషణలేమి జాలికిం
బట్టయి, కల్లుముందట శు‡భంబని దంపతు లుండి రాసన్నై
కట్టకసయ్యె మీరుకనఁ ‡ గ్రైకొననెత్తిన ముద్దుకోటికిం
బెట్టికొనంగ నీ కకట! ‡ మృత్యుముఖంబునఁ ద్రోసె నారలన్. 432

పత్నీయుక్తుఁడై ప్రతిష్ఠాన పురాధిపతి మహాభౌముడు వచ్చి
మేనల్లు మాంధాత నాదరించుట.

మ॥ విని యుదారుణవార్త నెడ దమ విని ‡ ర్భిన్న స్థితిన్ గుందఁ జె
ల్లెన నేత్రెంచెను పత్నితోడను ప్రతి‡ష్ఠాన ప్రభుం డాశ్రమా
వనికిం బాలకు నాదరింపఁగ "మహా ‡ భౌముండు" తద్బాలకున్
గనినంతన్ బహిరుచ్ఛ్వసద్విపుల శోక ‡ ప్రాప్తులై పాల్గగల్.

మ॥ తన కందోయికి నుల్లసత్ప్రవాహఁ జం ‡ ద్రికాప్రియుల్ శైత్యముల్
జనవుం గూర్చెడి తల్లిదండ్రులపుడీ ‡ చన్ సుప్తసం ద్రోఁచినన్
దన మేనత్తను మేనమామఁ గనినం ‡ తన్ బాలుఁడున్ బావురం
చును దుఃఖించెను ముక్తకంఠముగ నం‡తుల్ కాల్వలై పారగన్.

మ॥ సహజోదార గుణాఢ్య వత్సల సుభ ‡ ద్రాదేవి మేనల్లునిన్
మహి రుత్పూరశుగగ్నిభీకర శిఖా ‡ ముక్తాఘునిం జేతులన్
బహిరుద్భూత నిజాసులన్ మరల నా ‡ బంధించు చ ద్దున్మనన్
మహితోరస్థలిఁ జేర్చి మై నిమురుచుం ‡ బాష్పమ్ములన్
ముంచె దాన్. 435

చం॥ ఎడ నెఱిమించు నెవ్వగపు ¦ టెంగలముల్ దిగఁద్రోచి
యూర్పులన్
పొదల భవత్సుమంత్రత, పరి ¦ బుద్ధుకనై చరించుతు వెంబడిన్
పదఁడు భవన్మనోరథము ¦ భాస్వరకమై పరిజ కిమ్ముఁ గూర్చి సం
పద లొదవించుఁ గాక గురు ¦ వర్యుని యానతియుల్ లభించెడిన్.

చం॥ నయమున నిట్లు పల్కి నృప ¦ నందనుఁ డయ్యెడ లేచి నిల్చినన్
బ్రియత చరిత్రుఁ డాసచివ ¦ వర్యుఁ డుదంచిత కౌతుకమ్మునన్
మెయి పులకింప నాశ్రమరు ¦ మెత్తని చేతులఁ గౌఁగలించుచున్
బ్రియుత శిరంబు మూర్కొనియె ¦ వృద్ధులుచూడ నిసర్గ వత్సలుల్.
తే॥ జనకసందిట నొదిగిన ¦ చందమునఁ
గొమరుఁ డుండెను వృద్ధుని ¦ క్రోడసీమఁ
గనులు తుడుచుచు నగ్రిమ ¦ కార్యపరత
విడివడిరి యంత ముకుళంబు ¦ విరిసినట్లు. 451

భృగుమౌని మాంధాత్రునకు రాజధర్మము లుపదేశించుట

వ॥ నాటి రేయి యేకాంతమున నా భూష్ణువునకు భువనహితంకరుం డగు
భృగుమౌని యి ట్లుపదేశించె. 452
చం॥ విదితము లెల్ల విద్యలును ¦ వేద్యము లిత్తఱి రాజధర్మముల్
విదితము కాఁగ వాని విని ¦ పించెద వత్స! గురూపదేశ ము
న్మదులకు పాలుపాములకు ¦ మాణిక్య, భయంకర దోషమూలమౌఁ
దుదిఁ బలితుల్ సదాత్ములకుఁ ¦ దోవలు చూపుచుఁ దుష్టిఁ
గూర్చెడిన్. 453

ఆ॥ వె॥ వికట దర్పణమున ¦ వికృతమై బింబమ్ము
గానిపించినట్లు ¦ కలుషమతికి
తెలియఁ జెప్పినట్టి ¦ తిన్నని తెన్నులు
కుటిల రూపములుగఁ ¦ గోచరించు. 454

తే॥ అదుపులేనట్టి యావన ¦ మట్టివాని
కబ్బియుండిన నజ్ఞత ¦ కవధి కలదె!

యంధకారసమం బడి * యౌవనంబు
చపలతను నిక్క గరువంపు * చలువ కెక్కె. 455

చంపకమాలిక॥

పడుచుఁదనంపు దుందుడుకు * పాటు లెఱుంగని యార్జవంబుతో
నడరు భవాదృశుల్ ప్రథిమ * లాత్మలె సుమ్ముపదేశపాత్రు లీ
యెడ విను పుత్త్ర! తొల్త ధర * నోర్మిఁడు శాంతి దమ క్షమాగుణా
ఢ్యుఁడయి విశుద్ధ వర్తన ప * టుత్వమునన్ జనదర్పణమ్ముగా
నడచుచు నెవ్వరేయది వి * నమ్రతఁ జెప్పిన వీను లిచ్చి పెం
తడవుగఁ జల్పుఁ బోక గుణ * తత్త్వములం బరికించి యుక్తమున్
దొడగుట మేలు ధర్మముల * త్రోవలు తప్పిన జేఁటు, కంచెయే
చెడుగుల నడ్డుకుండ మఱి చేనును మేసిన నేమి చేయునో? 456

చం॥ తెలియుము వత్స! రాజ్యమది * తీవ్రగఁ జొప్పడనట్టి బంధనం
బలవున నట్టిబంధమున * కగ్గము చేయగ నుంటి మిత్త్రతన్
బలసి వయస్యులుచ్చ్రుకత * భావన నల్పుచు నిచ్చవెంటరా
నెలమిఁ జరించుచుంటివి య * థేష్టముగా నటుకూడ దింకటన్.

సీ॥ అంగరక్షకులు వె * న్నంటియుండి చరింప
తరవారిబంటులు * దారిచూప
కుశలచింతకులు నీ * కుశలంబు గమనించి
విశదీకరించిన * వితముతోడ
వర్తింపవలయు భూ * వరుని కవగ్రహం
బులు చంద్రునకుఁబోలె * పొడము మిగుల
ఆపదలెన్నని * దావరించినవాని
నోసరించి సుఖాల * కాసమాని

తే॥ దండ్యజనులను దండించి * దయ చెలంగ
సాధుజనులకు సంరక్ష * సలుపవలయు
గానినకష్టంబు ప్రజలకు * కూర్చుచుంట
పార్థివున కిల పరిపాటి * బరగునీతి. 458

చం॥ కువలయరంజనుఁడై నను
ధ్రువముగ నెలపోల్కి నృపుడు § దోషాకరుఁడై
భువి పరిపాలించెడు నెడ
నవశత దోషములు ప్రబ్బు § నఘజనకంబుల్. 459

తే॥ దోషములు గల్గునంచును § దొరతనంబు
వీడి వని కేగ నృపతికిఁ § బాడి గాదు
తనదు ధర్మంబు నడవక § తప్పఁగుప్రజను
నతఁడు నిజజాతికంతకు § హానికరుఁడు. 460

చం॥ ధరణిఁ బ్రవర్తకుండగుట § ధర్మములన్నియు ధారుణీశు నా
సరగొని వర్తిలుం దగ బ్ర § జల్ నిజధర్మము తప్పకుండఁ దా
నరసిన ధర్మమూర్తియయి § యందును నిందును మేల్మిఁ బొందెడున్
ధరణిపుఁ డాత్మధర్మమును § దప్పిన లోకము దుర్వినీతమౌ. 461

చం॥ అవకతఁ గల్గు దోషముల § సద్వర నిర్వహణ ప్రశస్తిచే
నవిరళ దానధర్మముల § నావలఁద్రోచి క్రియావిశుద్ధుఁడై
తవులక యింద్రియార్థముల § దర్పణరూపమునన్ వెలుంగు భూ
ధవుడు పటిష్ఠత న్నయము § తప్పక యేలిన ముక్తిఁగాంచెడిన్.

చ॥ ప్రజకు సుఖంబు గూర్చుటయ § పార్థివు నగ్రిమధర్మ మెందు నే
బ్రజలబలంబ వెన్నుముక § ప్రాభవశాలికి భద్రశీలికిన్
నిజసుఖముల్ త్యజించియును § నీతి దలిర్పఁగ నేలుచున్ ధరన్
బ్రజలకు సేవచేయు నర § పాలకు డించును చంద్రకీర్తియై. 463

మ॥ పదియున్నాలుగు రాజదోషముల సం § వర్జంబు పోనాడి సం

---

పదునాల్గు రాజదోషములు —

1 నాస్తికత్వము 2. అనృతము 3. క్రోధము 4. ప్రమాదము 5. దీర్ఘసూత్రత 6. ప్రాజ్ఞులకు దర్శనమీయకుండుట 7. ఆలస్యము 8. ముఖస్తుతులకు లోబడుట 9. శత్రువుల నొంటిఁ జింతించుట 10. అర్థశాస్త్ర కుశలులుగానివారితో మంతనము సల్పుట 11 నిశ్చితములైన కార్యములు నెరవేర్పఁబూనకుండుట 12. మంత్రితాంత్రములు బయలుపుచ్చుట 13. లోకమంగళములగు సత్సవాదులు సలుపకుండుట 14. ఎంతటివారరుదెంచినను ప్రత్యుత్థానము చేయకుండుట.

పద మూలంబుల నష్టకర్మముల ని । ర్వర్తించు మార్గన్ బెంపొప్పుచోఁ
బదనుస్మేర కుపాయ సప్తకము నా । పాదించు నీతిన్, వశం
వదమై వర్తిల రాజకంబు ప్రజలన్ । బాలింపుమీ పేర్మిమిన్.

చ॥ తగవులు పెట్టి తీర్చుటయు । తద్దయుఁ బెద్దరికంబు, వేశ్యలన్
దగులము నూ మహా రసిక । ధర్మము, తప్పులువట్టి చూపుటల్
తగు ప్రతిభావిశేష మన్ను । తంబులు వల్కుడినేర్పు పాండితీ
ప్రగతి, వినీతి, దుర్వ్యసన । రక్తి మెలంగుట లీల, పెండియున్.

తే॥ వృద్ధవచన నిరాసంబు । పెరల పలుకు
లాలకింపమి. యుచ్ఛృంఖ । లాత్మవృత్తి
పరగ నిచ్చమెలంగుట, । భంగ మోర్చి
యుంట తాలిమి యానఁట । కంటె వత్స. 466

చ॥ గురుజనతా సమక్షమునఁ । గొంకొకయింతయులేక దుష్క్రియల్
జరుపుట ధైర్య, ముల్లమునఁ జాపల ముత్సహానంబు, ముందటన్
గర మనురక్తిఁ బల్కునుడి । కారము కీర్తి, భటాళి నిఘ్నతన్
దిగుగుటయే సుసేవ్యత, మ । తిం దలపోయుదు రిట్లు బాలిశుల్. 467

ఉ॥ ఇంతలు సన్నగొల్ది మఱి । విన్నది దేవగురు ద్విజాళికిన్
మంతువు మోపుచుంట మహి । మంబట! సామ్యములేనివారితో
పొంతన సర్వసామ్యమట! । పూరుష పూర్ణత కామవృత్తపుం
బంతల సంచరించుటట! । మూర్ఖుల బుద్ధు లెఱుంగు మెట్టివో! 468

తే॥ పెరల కుపకారములుసల్పు । వేసమూని
యాత్మకార్యంబు సాధించు । నటమటీం డ్రి

---

అష్టకర్మములు —

1. కృషి 2. వాణిజ్యము 3. దుర్గ రచనము 4. సేతుబంధనము 5. గజ సంపాదనము 6. గనులనుండి రత్నాదులు వెలువరించుట 7. ఆకరములనుండి సువర్ణాది లోహములు తీయించుట 8. కప్పము గైకొనుట.

సప్తోపాయములు —

1. సామము 2, దానము 3. భేదము 4, దండము 5. మంత్రప్రయోగము 6. ఔషధము 7. ఇంద్రజాలము.

నేను లిఖితి నరసి చరింపు వారి
శ్రవణ చక్షువులకు దూర చరుల నల్పు. 469

కం॥ చిరముగ చదువులు నేర్చిన
నరుడుగ విజ్ఞాన మెంత యార్జించిన యేఁ
గిరగిర త్రిప్పుచు శిరమును
గురుతర లక్ష్మీశ్వరాబు గూడుదు తెమ్మ్ఁక. 470

ఉ॥ మానగు దాని త్రిప్పులకు బ్రాంగను వెట్టక సత్వశాలివై
పూని యుధామిత రాజ, రజి పూజ్య పురంజన దుంధుమార స
మ్మానిత పాలనక్రమము; మన్నుచు భూతల మేకనాథమై
యీన సమస్తసంపదల నిమ్ముగ నీప్రజపాలికల్ వ్రజల్. 471

తే॥ శ్రీకరంబగు పట్టాభి షేక విభవ
మునకు శుభయుక్తమైనది ముందుదశమి
అమరె గురుదేవతానుగ్ర హంబు నీకు
కూడెనన్నియు జనకుల కొంతయొకఁడె. 472

ఉ॥ భీతిని చేరనీకుమను వీకయు తేజవ మించఁ గర్జముల్
బ్రాంతి కొనర్చె వెంబడిన భాసటగా చదువెంతు మిల్లెకన్
నీతినెఱింగి వర్తిలుము నీకు శుభంబగు వత్స, నాగ మాం
ధాత గుహూప వేశమునఁ దద్ద సుధారస మానినట్టులన్. 473

చం॥ పసిమనె లిప్పుఁడైన యుబఁ బాతము గల్పిన భంగి నాత్మకున్
సురుచిర భూషణావళులు పొంపుగఁ బెట్టిన చందమున్న సం
బరమున మున్నతంబులగు భావపరంపర లుల్లసిల్లఁగా
గురువరు తోడ నిట్టులనెఁ గూరిమి నేమి నించుపల్కులన్. 474

ఉ॥ నూరుని మాడ్కి లోకులకు సూరిజనాగ్రణి! బంధుహాపుతా
మీరలు సాయమై నడవ మేదినినేలుట దెంతపాటి గం
భీర భవత్ప్రబోధ రుచి జగ్గిని నా హృదయాంధకారముల్
పేరము వారెఁ గార్యములు వెన్నెలవత్తువులట్లు తోచెడిన్. 475

చం॥ భవదుపదేశబీజములు భావమునం బదిలించి వేళలన్
యువజన మానసస్థలుల నెవ్వగ నొక్కటి వేయుహాపులై

వివిధఫల ప్రసూతులుగ § వి త్తైద కోడలి క త్త కిమ్మగా
నవనిఁ బోన ర్తు మీాయడుగు § లాన యటంచు మునీంద్రు సంఘులన్
మ॥ లలితోత్సాహముతోడ ముట్టుటయు లీ § లాహాస దీ ప్తిచ్ఛటా
కలితాస్యుండయి మాని, శిష్యవరు వే § డ్కన్ గొఁగిటంగ్రుచ్చి వ
త్సలతన్ మూర్కొని మ స్తమున్ బలికె వ § త్సా! మోదమయ్యెన్ మహీ
వలయం బున్నతిఁగాంచ వర్ధిలు శుభా § వా ప్తిన్ బ్రజల్
మెచ్చగాన్. 477

తే॥ అనుచు దీవించి శయనింప § నరుగుమయ్యు
వలయు స్వ స్త్యయనంబులు § సలుపవలయు
దినముఖమ్మున, కల్యముల్ § తీర్చి వేగ
రమ్మనియె నంతఁ జనియెను § రాజసుతుఁడు. 478

వ॥ మరునాటి ప్రాతఃకాలంబున. 479

కం॥ సిలాటి రేవులోపల
చేలంబుల నుదికికొనుచు § చెలువలు నిరతిన్
జాల న్నిలబడి యొండొరు
లీలీలన్ ముచ్చటించి § రిమ్మగ గంగన్. 480

ఉ॥ ఓసి సుసీల! వింటివె య § యోధ్యను పట్టముగట్టి రాజుగా
జేసెదరంట రాకొమరుఁ § జెప్పిరి నూ పయనంబు నేడ చే!
బోసిగనుండు పల్లె యిఁక § మున్నె తదీయగురుల్ గళించుటన్
జేసి గళించెఁ గొంతకళ § శేషము నేడది పూజ్యమయ్యెడిన్. 481

మ॥ పదునేనేండ్లు గదే సు ! యిటకు నా § భవ్యాత్ము లేతెంచి? "ఛీ"
ఎది? మైత్రేయుడు కుక్షినుండునపుడే § యేతెంచి రాదంపతుల్
పదుమూఁడేడులు వాని కిప్పటికి నూ § పండ్రెండు మాంధాతకున్
బొడలెన్ వారి శుభాగతిన్ మన తపో § భూమిన్ మహా
భాగ్యముల్. 482

చం॥ దినమును నేవొ దానములు § తియ్యని యామెత లామతింపులున్
తనియఁగ దక్షిణల్ బహు వి § ధంబులు భూమలుజిల్గు చేలలున్

మనకు ముదంబుగా నొసగ ౯ మాసిన వాసర మేను గాన నీ
తనయుఁడు పుట్టుడున్ మఱియుఁ ౯ దత్కరయుగ్మము లక్ష్మి
శూన్యముల్. 483

చం॥ కొమరులు పల్కిరేమిటికి ౯ గోత్రధరుం డొకఁడైన మెచ్చగున్
దమకులవృత్తి కీవికిని ౯ దక్షిణహస్తము మీదుకట్టె రా
కొమరుఁడు చిన్ననాడె. మన ౯ కుఱ్ఱల కూటువఁ గోలుకాని చం
దమున మెలంగు ముచ్చటగు ౯ దర్పమెఱుంగడు కాదె యింతయున్.

ఉ॥ అబ్బుని యట్టిపుత్త్రుఁ గన ౯ నందఱకున్! మఱి నేడు చన్న చో
దబ్బున వచ్చునే యిటకు ౯ దారకుఁ డక్కరో? ఏలవచ్చునే?
యుబ్బుననుండు నంతిపురి ౯ నొవ్వులకువ్వగ లెస్స సేవకుల్
గొబ్బున నెల్ల కార్యములు ౯ గూర్చఁగ జాచరికంబు సల్పుచున్.

మ॥ రుచికా చూడవె ప్రొద్దువంక! చను దే ౯ రుం డమ్మలారా యిక౯
వచనాసక్తిని వేళఁజూడవుగదే ౯ వాసంతి! "ఔనౌనె" యుం
చచిరం బాతరుణుల్ హారిద్ర నదికిం ౯ తర్పించి తచ్ఛేషమున్
రుచిరాస్యంబున మెత్తి తాళిపయినా ౯ రోపించి సుస్నాతలై. 486

చం॥ వడివడి నాచమించి నవ ౯ వాసరకాంతున కర్ఘ్యమిచ్చి మే
వడిని నమస్కరించి నుతి ౯ వాక్కులు పల్కుచు శుద్ధమూర్తులై
పిడిచిన వస్త్రసంహతిని ౹ బెట్టి శిరమ్మున, బిందె సందిటన్
దొడిగి రయంబునన్ జలము ౯ తొల్కఁగ నేగిరి టెంకి పట్లకున్.

వ॥ అవ్వేళకు.

మాంధాత భృగుమునీంద్రునకు గురుదక్షిణపెట్టి తదనుజ్ఞాతుండై మరలివచ్చుట.

చం॥ ప్రచుర మణిప్రదీప్తిగతి ౯ భవ్యతనుద్యుతిపూర మంశు మ
దుచ్చులకు మార్పొలుంగ తను ౯ రోమము ఉల్లసిలంగ భాజనా
రచిత దుకూల పుష్ప ఫల ౯ రమ్య పరీమళ గంధవీటికా
నిచయముతో నృపాత్మజుఁడు ౯ నెమ్మిఁజనెన్ గురువర్యు నింటికిన్.

వ॥ అట్లు చని యెదుర.

సీ॥ శ్రీపతి వలగొన్న ౯ శేషాలయంబు నా
శిరమున ఘన జటా ౯ శిఖర మలర

దానిదెల్పిన శిరమున ౹ దాల్చి నిరతి
పరంగ నొసరించి ధన్యత ౹ పరలువాడ" 494

వ॥ నా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె 495

చం॥ తనువునకు చిత్తమర్మిలి ను ౹ దారతం బ్రోచిన తల్లిదండ్రులన్
దనరు గురూత్తముల్, మతియు ౹ తాంపవ! యుచిత భక్తి యున్నెడ
తనువక దేహపాత మగు ౹ దాక తపంబులు దానధర్మముల్
ఘనముగ జేసిన న్నరుడు ౹ గానడు గా ఋణశుద్ధి గాంతయున్.

వ॥ అనవుడు నాసుధీమణి యున్నరపాలునకు వెండియు నిట్లనియె 497

కం॥ జీవికిం దనువును హృదయము
చేవలు దగ నాని వెలయం ౹ జేసిన వారిన్
సేవించి మెప్పుపొందిన
జీవుండు ధర శుద్ధుడగును ౹ శ్రేష్ఠగం బరంగున్. 498

వ॥ మఱియు నొక్క విశేషంబు. 499

కం॥ అనవద్యంబగు విద్యా
ఘనబలమున నుపశ్రుశిష్యుం ౹ గను నొప్పారన్
జనకుండు వీర్యబలమ్మున
తనయునిగను గురువుమిగులు ౹ తండ్రికి మేత్తె. 500

కం॥ జనకుండు శరీరమిచ్చుటం
బనుమును భవ కష్టదశల ౹ పాలై మెలంగన్
గనం గురువు తెలివినిచ్చుట
మనుమను జీవితము శాంతి ౹ మయమై పొదలున్. 501

చం॥ జనకః తీక్ష్ణశక్తియు ని ౹ శాకరుకైవడిం బేర్చి వింతగా
దినగతి చూపటున్, మిగులు ౹ దేహ వినూతన నన్నగూక్తి సం
జనిత వివేకశక్తి యని ౹ సారసమిత్రుని పోల్కి బర్వంగన్
మనుచు భువిన్ దివంబున న ౹ మంచిత మూర్తి నొసంగి జీవునిన్.

వ॥ నరేంద్రా! తాదృశ గురువరేణ్యు ఋణాభారంబునకు శిష్య విశే
యతాభరం బాకండ సమంబగు ననుటయు నాజనమేజయుండు

మధ్యగుపదేశ్యులకు ననంత ప్రణామంబులని మునీంద్రా! యవ్వలి
వృత్తాంత మానతీయవే యని వేడ తదనంతరంబ వైశంపాయనుండు
వెండియు నిట్లు వచింపఁ దొడంగె రాజేంద్రా! కుశలమతియగు
నక్కుమారచంద్రుండు గో స్తనీలలితరసాస్వాదపేశలంబుగ మరల
నద్దేశికోత్తమున కిట్లు విన్నవించె. 503

ఉ॥ నాదుశరీర మర్ధమును ✶ నాదెవ్వు విజ్ఞత ప్రాణ సత్వముల్
మోదముతో మదీయ ఘన ✶ పుణ్య సువృత్తము లెల్ల మీకుఁగా
మీదుగఁ బెట్టినాడ నని ✶ మిత్ర కృపామయ! వీని నెప్పు నే
భేదము లేక చేకొనుచుఁ ✶ బ్రీతిని శిష్యు ననుగ్రహింపవే. 504

తే॥ అనుచుఁ బులకాంకురోల్లాస ✶ మడర మేన
భక్తిభర నమ్రుఁడై తగ ✶ బమ్మ వెలుగు
లుట్టిపడు నోజ్జయడుగులు ✶ ముట్ట వ్రాలె
భృగుమునీంద్రుఁడు నాశిష్యు ✶ వీఁపుఁ దట్టి. 505

చం॥ నగవు వెలుంగు లాననము ✶ నందు నటింప సెబాసు పుత్రకా!
నెగు లుడుగంగఁ బల్కితివి ✶ నిక్కము సల్పెదు పల్కినట్లుగా
మగఁటిమి మించ నియ్యెడఁ బ్ర ✶ మాణము నీ బుజావర్తనంబు నీ
తెగువయుఁ గూరుచుండుమిటఁ ✶ దెల్పెద నాత్మగతమ్ము
నంతయున్. 506

వ॥ అని యంతికమ్మున నుపవిష్టుండై తనదెస మనోదృష్టులఁ గేంద్రీ
కరించిన శిష్యసత్తమునకు నయ్యాచార్యవర్యుం డిట్లనియె.

ఉ॥ మైకముగ్రమ్ముఁ గన్గవకు ✶ మానసవర్తన మెట్లొయుండు నీ
లోకపజాడ లాఁయగ; ✶ లుప్తము లైనవి సర్వధర్మముల్
మేకొనఁ జేస్రుపుండును స ✶ మీకృతి ధర్మపు లెల్ల సిల్లఁగా
నేకముగాఁ బ్రజాతతి ✶ నేలఁగ ధర్మిత శాంతి నెక్కొనన్. 508

చం॥ కలియుగ పాపముల్ తనువుఁ ✶ గైకొననా, చెలరేగి దస్యులీ
యిలఁ బలతావులం బ్రజ ✶ నేఁచఁగ సాగిరి, వారిఁ గూల్పగా
బలియుఁడు లేడు నేఁడు నర ✶ పాలకులందునఁ గూడఁ దొంగలుం
గలుగుట నున్న దీన మతి ✶ కల్గెడి సాయ మతప్పలాళికిన్. 509

తే॥ అదిమి కప్పమ్ముల౯ గొంచు ✽ నవనిపతులు
తద్ధనమ్మెల్ల తమదిగాఁ ✽ దలఁచి యాత్మ
సుఖములకె వెచ్చపెట్టుచుఁ ✽ జొప్పఁ దప్పి
మెలఁగుచున్నారు ప్రజలకు ✽ మేలుఁగనక. 510

చం॥ నరనిచయంబు సోమరిత ✽ నంబు శిరంబునఁ దాండవింప శ్రీ
కరకులధర్మకర్మములు ✽ గైకొన కన్నిటి వీటిఁబుచ్చి యొం
డొరు జగడంబు లాడుచుఁ గు ✽ లోచిత సుస్థితి తూల నిచ్చలు౯
బరధన దార సంగ్రహణ ✽ పాండితి వర్తిలుచున్న దిత్తఱి. 511

చం॥ తలకొక బాసయు న్మతము ✽ దైవము నేర్పడ భిన్నభావముల్
నెలకొన నైకమత్యమవ ✽ నిం గలసెగ్ గృషి జీవనంబుల౯
గలుపరు కేలు జూదమునఁ ✽ గల్పెద రారడిపోయె సత్కళల్
పలువురు సంఘవంచకులు ✽ పాడరె లోకము సర్వభంగుల౯. 512

చం॥ కలియుగ దుర్విలాసములు ✽ కాఱియపెట్టుచునుండె నేఁటికి౯
నిలకడలేనియట్లు ధర ✽ నీప్రజ నొంతయుఁ దద్దురాకృతం
బులు నరపాలసంఘమునఁ ✽ బొత్తుగనుండి ప్రజాచయమ్మున౯
మెలఁగుచునున్న వక్కతన ✽ మేదిని మేలిమితూలెఁ బుత్త్రికా 513

ఉ॥ న్యాయములెల్ల భూపతుల ✽ యాసరవర్తిలు నేయుగాననే
నా యుగరూపు లాన్నృపతు ✽ లందునఁ దద్గతి లోకవృత్తమా
నేయుగవేళ ధర్మగతు ✽ లేయవి వర్తిలఁ బోలు వానితో
నాయుగముల్ భ్రమించుట య ✽ నాది విధానము రాజవర్తన౯ 514

తే॥ కృతయుగమునందు మొలకెత్తి ✽ కెరలుచున్న
ధర్మవిజ్ఞాన శౌర్యసంతతుల సిరుల
ధరణి విలసిల్లెఁ జక్రాంగ ✽ సరసిజముల
కరదుదంచిత ఘనసరో ✽ వరము కరణి 515

తే॥ గ్రీష్మకాసార మట్లు ధ ✽ రిత్రి యెల్ల
నల్పరూపులు నల్పాయు ✽ రల్పబుద్ధు
లైన ప్రజతోడ సిరిఁబాసి ✽ యంత్యయుగము
నందు జీవన్మృతస్థితి ✽ నడఁగియుండు. 51

తే॥ ధర్మసత్రంబు పోల్కి నీ ధరణితలము
సజ్జనశ్రేణి వసియింప సముపశోభి
తమ్ముఁ దనరు దుర్జన తతి వసింప
నపరిశుద్ధమ్ము శిథిలమ్ము నగుచు నుండు. 517

వ॥ కుమార! విచిత్రవిభిన్నపృథక్పథ రాజకీయసంఘ సంఘర్షణ ప్రచండ వాతూలవిఘాత మ్మొకవంకను, సర్వతోముఖ సంప్రవృత్త స్వార్థపరతా సముద్గతావినీతిపాంసుపటల దురాక్రమ మ్మొకవంకను, సాభ్రాతృసముచ్చాటన జాతిమతద్వైతభాషాద్వైవిధ్య వినిసృతవిద్వేష మహాపూర మ్మొకయెడను, నియమవిరహితాహారవిహారసంప్రాప్తాసంఖ్యాకవిషమవ్యాధి ప్రచారసముద్గతాకస్మికజరావికారాపసవ్యమరణవ్యథ లొకయెడను, భౌతిక విజ్ఞాన విస్ఫారతాసమారోపిత సముత్తాలకామసవమాధ్యాత్మ దరిద్రతా దవానల ప్రపీడన మొకనైపునను, ముట్టడించి మట్టుపెట్టుచుండ మర్త్యభువనమ్ము, శిథిలశిథిలంబై, చౌడరిన మహాసౌధంబు చందంబున విసారమై, విచ్ఛాయమై, విరూపమై, యెల్లభంగులఁ బాడుగు పడియున్నయది. కేవల సమాజహితంకర పవిత్రధర్మసూత్ర సంధానితైకాదర్శప్రభుత్వ నియంత్రణ మొక్కండ యీదుఃస్థితులనెల్లఁ బోకార్పఁజాలు సూత్రంబు. మానవభువనమ్ము సర్వమ్ముఁ దత్తాదృశాదర్శప్రభుత్వనియంత్రితమ్మైనప్పుట యస్మదపేక్షితంబు. అదియు విశ్వమానవ కళ్యాణంబు. అద్దానన మానవజగమ్ము ఖిలమ్మును పవిత్రసౌభ్రాత్ర భాసురంబై, సార్వత్రికైకత్వాత్మకయితస్వరూపమై, సర్వవిధ విజ్ఞానవికాస పేశలంబై, సర్వసంపదున్మిషితంబై, సుధాళన జగమ్మునకు సమమ్ముగా మనియెడిని. 518

ఉ॥ వేయు వచింపనేల! సద విశ్వ ధరణీతల మేకపాలనా
ప్యాయితమై రహిం గృతయు గాంచిత వైభవ పూర్ణతం గనం
జేయుట కీవు పూనవలెఁ జెప్పితి సంగ్రహయుక్తి నెల్ల నా
రాయణుఁడుండు నీడవలె నంటి జయ మ్మగు వత్స! యెమ్మెకన్.

చం॥ అనవుడు శిష్యశేఖరుఁడు హాసరుచుల్ చెలువార దేవతా
జనగణవంద్య! లోకహిత సాధన సిజవి సార్థకంబుగా
మొనయుదు మీ సమీహితము మున్నుగ మీ సదనుగ్రహంబునా
కనయ మమూల్యసాధనమ టం చరివాణములోని మాల్యముల్.

ఉ॥ కైకొని దేశికోత్తముని కంఠమునం జెలువార వైచి త
ల్లోకమలాపహాంఘ్రులకు లోలత సాగిలి మ్రొక్కి "యాజ్ఞయే
నాక"ని, రుద్ధకంఠమున నా మునిచంద్రున కుత్తరంబు నీ
నాఁ కిడినట్లు కావుటయు నా ఋణమేగెను నీరవంబుగాన్. 521

చం॥ చటుకున సంబళించికొని సంయమిచంద్రుఁడు కన్నులొత్తుచున్
వటుమణితోడ "శ్రేయమగు వత్స! ప్రయాణపువేళ యయ్యెడిన్
దిటతనమూని వర్తిలుము తేఁకువ వీడక పోయి రమ్మ"నన్
బటుమతి ముందుకుం జనుచు బాలుఁ డొకించుక నిల్చి వెండియున్

చం॥ వెనుకకుఁజూచి మౌనివర వెంటన మీరలు రావలెం జుడీ
పనుపుమ నున్నవార లొక పద్ధతి నన్నొక పెద్దఁజేసి నా
మనమిటనే చరించు నన మౌనియుఁ దత్సుముహూర్త వేళకున్
గనియెదు మమ్ము నిసఖులఁ గాంచెద వొజ్జలఁ గూడ నంచనెన్.

తే॥ మూడు నాల్గంజలను వైచి ముందుపోక
సంశయించు పదంపడి సాగు వెన్క
కెదిరియె లాగినగతి బాలు డింత తగ్గు.
ముందు కెద్దిరియొ త్రోసిన పోల్కిఁ దూలు. 524

తే॥ అపుడు భృగుమౌని ప్రియశిష్యు నంసతలము
నప్పళించి ప్రసన్నత నావటించి
కార్యభారము ప్రియంబుఁ గడకు నెట్టు!
నడుపుము కుమార! పయనంబు నడవవలయు. 525

కం. సమయము సమీపమ్మైనది
సమయము దాటింపఁ జనదు సమయజ్ఞులకున్
సమయం బమూల్యమైనది
సమయంబున సంభవించు సకల శుభంబుల్. 526

చం॥ తనువునఁ బుల్కలుల్లసిల । దారకుఁ డంతట నేగుచుండఁ బా
వనతమ తత్తపోవనము । వాయుకుమారులు కమ్మతావులన్
దనువుచు వెంటసాగిరి సు । ధామధురప్రసవాళిఁ జల్లె త
ద్వన కుజముల్ పికార్భకులు । పాడిరి పంచమ సుస్వరంబునన్
జనువునఁ దీవె కన్నియలు । సల్పిరి లీయమెలర్ప లాస్యముల్
కను నిల భాగ్యశాలి ఘన । కాననసీమలనేని భోగముల్.

శా॥ విద్యాస్నాతకు డక్కుమారుఁడు । సమావృత్తుండు, తత్కాల సం
పాద్య ప్రోజ్జ్వల ధర్మముల్ సలిపి స । మ్యగ్వ్రతాహారుఁడై
ప్రోద్యన్మైత్రి నృపాప్త గోష్ఠిఁ గుతూహలం । బొప్పార వించుండ సం
వేద్యంబుల్ పయనంపువేళ తెలిపెన్ । భేరీధ్వనుల్ పైపయిన్.

మాంధాత అయోధ్యకు వెడలుట

చం॥ పయనపు దుందుభిస్వనము । పర్వఁ దపోవన భూమినల్గడన్
రయమున రచ్చమానుకడ । రాజకుమారుని గాంచ మౌని సం
చయము కుమారవర్గమును । చాలఁ జేరిరి రాట్సుతుండు స్వ
స్త్యయనము సల్పి భూసురులు । స్వస్తి వచింప సువేషధారియై.

చం॥ చెలువముమీర మంత్రిగణ । సేవితుఁడై లలితాంగు లయ్యెడన్
ఫలసుమ భాజనాలఁ గొని । పావనమూర్తులు వెంటఁ గూడిరా
నలువున నింటివేల్పులకు । నమ్రత జోతలువెట్టి మాన్యముల్
చెలఁగఁ గుటీరముల్ వెడలి । చేరెను చైత్యముచెంత నంతలోన్,

మాంధాతృనకు వివాహ మంగళము మున్నుగాఁ బట్టాభిషేకము జరుపఁ గోరుచు
భృగుమౌని పాలికి శశిబిందుఁడు సందేశమంపుట.

చం॥ టకటకమంచు శబ్దము మహాత్తుగ వీనులసోఁక నద్దెసన్
సకలజనంబు చూడఁగను । జయ్యనవచ్చిన మేటిరౌతు త
న్నికట మహీరుహంబుకడ । నిల్పి సపక్షహయంబు నమ్రుఁడై
సుకృతపురాశి నాఁజను వి । శుద్ధమహీసురపాళిఁ జొచ్చి తాన్.

చం॥ విస్మయకర బ్రహ్మతేజమున । వెల్గుభృగూత్తము మౌళి భక్తితో
గనిగనమస్కృతి త్రయము । సల్పి శుభాకృతితోడఁ బైఁడివ్రా

యసమున మించు గమ్మత్తివిన ; యుంబున నీపుఁ బరేంగితజ్ఞుఁడం
త సచివముఖ్యుఁ డందికొని ; తాఁ జదివెన్ వినఁ బెల్లవారలున్.

చంపకమాలిక॥

"అమృత మయాత్మ! యుష్మ దమలాంఘ్రి సరోరుహాయుగ్మసేవనా
విమలమనస్తనుండు "శశి ; బిందుఁడు" వందనపూర్వకంబుగా
సమయమునన్ భవచ్చరణ ; సన్నిధి కంపిన విన్నపంబు ము
న్నమలమునీష్ఠుతైన యువ ; నాశ్వ నరేంద్రులతోడి వియ్యమున్
సుమహిత బుద్ధిఁ గోరుటయుఁ ; జొప్పడ నారలు నియ్యకొంటయున్
దమ కపరోక్షవృత్తమిది ; దానఁ జిరాయువులున్ గృహస్థ రూ
పమున నృపాలపట్టమున ; భాసిల నిత్తతి నింపగున్ భవ
త్సుమధుర మంగళోక్తి మము ; శోభిలఁ జేయువడిన్ గృహావళిన్.

తే॥ కమ్మకమగియంగ నానంద ; కాంతు లొలయ
భృగుమునీంద్రుడు సాకూత ; ముగను శిష్యు
దెసకు తిలకించె మాంధాతృ ; తేటమోము
స్మేరరుచిమించెఁ గెంపారు ; చెక్కులలర. 534

ఉ॥ మేలు సెబాసటంచు గురు ; మిత్రులు మెచ్చ మునీంద్రపత్నియున్
బాలకు బుగ్గఁ జెక్కునిడి ; ప్రవ్విన వేళ్ళను చిన్నిగడ్డమున్
వేళ్లఁ బుణికి ముద్దిడుచుఁ ; "బెండ్లికుమారులొ హాహా"!
యనం భృగుం
డాల శిరంబు దువ్వ చనె ; నాశుభ మొందు శుభమ్ముఁ గూడెడిన్.

తే॥ మునివరుం డిట్లు పలుకంగ ; ముఖ్యమంత్రి
"మీ చలువకాదె యిది యెల్ల ; మేలు"! ననియె
వెండిశుభలేఖ నంపుఁడు ; వేగ మనిన
భృగుమహాని యాజ్ఞచెల్లించెఁ ; బ్రీతి నతఁడు. 536

సాగనంపవచ్చిన యాశ్రమవాసులను ప్రణామపూర్వకముగా
వీడ్కొని రాకొమరుఁడు స్యందనారూఢుఁడై సాకేతంబునకు జనుట.

ఉ॥ మంగళతూర్యరావములు ; మాసిత ఘోషమంత్రనాదముల్
సంగత సైనికప్రకర ; సాధు జయధ్వను లక్వహేష లు

ప్రాంగు సముద్ర ఘోష గతి ముట్టఁగ మిన్ను మునీంద్రు నాజ్ఞ సా
గెం గమలాప్తగోత్రమణి క్రిక్కిరిసెన్ జనబృంద మయ్యెడన్.

కం॥ సెలయేటిదనుక నరిగిరి
పిలుపిల యని యెల్లవారుఁ బ్రీతి తలిర్పన్
సెలయేటి కొలచని కో
సల జనభాగ్యంబు మ్రొక్కి సర్వుల కెలమిన్. 538

తే॥ అమర సభిమంత్రితమ్మైన యరదమెక్కి
దీవనలతోడఁ జల్లి రా దేవమూర్తి
పైన పుష్పాక్షతల నెల్ల వారుఁ గూర్మి
గదలె నరదంబు కాంచన కాంతు లసర. 539

ఉత్సాహ॥ బాలభానుఁ డట్లు రాచ పట్టి తేరు నెక్కఁగా
జాలు విరియ హేషసల్పి సూటిసాగె నశ్వముల్
పాలపక్షి తీర్చి వెంటఁ బర్వెఁ గమ్మతెమ్మెరల్
చేలలూచి మిత్రు నలరఁ జేసి రెల్ల నెచ్చెలుల్. 540

తే॥ తేరి కెక్కంబు కన్నుల తెన్ను మీఱ
సాగనంపగవచ్చిన జనులు నంత
నల్లనల్లన విమన స్కులగుచు నొక్క
రొకరె వెడలిరి తమతమ యునుకులకును. 541

చం॥ పరగ రథంబు చక్రహాత పాంసువు కాఁకగనీని దీక్షతో
నరుగుచునుండఁ జూపు మఱు గైనను వెన్కకు రాజదారకుం
డరయుచుఁ "జూచితే జనవ దాంచిత దృశ్యవితాన"మంచుఁ దాఁ
గరమునఁ జూప మంత్రి తన కన్నుల నా దెసఁ ద్రిప్పె నత్తఱిన్.

వ॥ అనిన వైశంపాయనుంగని జనమేజయుండు తమపరి తత్కుమారు
చరిత్రం బేచందంబున నొప్పెఁ జెప్పుం డని ప్రార్థించె. 543

ఉ॥ భక్తిరసైకలభ్య! ఫల వర్జిత శాస్త్ర సముక్తధర్మసం
సక్త వినిర్మలాత్మ పురుష ప్రవరోజ్జ్వలజీవనప్రభా
వ్యక్తదయామనోజ్ఞ! వృష భక్షితి భృన్మణి! వేంకటప్రభూ!
యుక్తరసాప్త వాఙ్మయ స ముచ్చిత వస్తుశరీర! మాధవా! 544

పంచచామరము॥

ప్రభాతలోకబాంధవ ప్రభా మనోహరాంశుక
ప్రభామనోజ్ఞవేష! భూరి భాగ్య భోగ్య భూష! సు
ప్రభామహిష్ఠ రత్న భాస్కరప్రదీప్తమౌళిభా
ప్రభూతశీర్ష! వేంకటేశ! భద్రకృత్ప్రదర్శనా. 545

ఉత్సాహ॥ శ్రీనివాస! వెంకటేశ! శ్రీనగేంద్రనాయకా!
మానిహృత్సరోజభృంగ! మంగళప్రదాయకా!
పూని నీదు పద్యగంబు పూజసేయువారికిన్
దానమిత్తు వాత్మ నార! దాసపోష! శ్రీకరా!. 546

వ॥ ఇది శ్రీ శ్రీనివాసకృపాసమాసాదిత కవితావిభూషితుండును, కృష్ణామండలస్థ కృష్ణానదీపవిత్రప్రాక్తీరవర్తి "శ్రీరంగపురాగ్రహార" వాస్తవ్యుండును, బళ్ళారిమండలస్థ హొసపేటపురీ పురపాలకోన్నత పాఠశాలాప్రధానాంధ్రోపాధ్యాయపదవీవిలసితుండును, శ్రీమత్పద సంస్తుత- 'ఆసూరి' సముపజ్ఞిత - "తిరుమల" పదాంచిత, "కొండూరు" సముపాహ్వయ, "పంచాంగా"న్వర్థ నామధేయ, హారీతగోత్ర పవిత్ర కృష్ణమాచార్య తనూభవుండును ఆంధ్రవిశ్వవిద్యాలయ సమధిగత "ఉభయభాషాప్రవీణ" పట్ట ప్రకాశితుండును నగు వేంకటాచార్యునిచే రచింపఁబడిన కృతులలోఁ దృతీయంబగు "ఆదర్శప్రభుత్వా"పరనామక "సమాజ సామ్రాజ్యం"బను మహాప్రబంధంబునఁ బ్రథమఖండము.



శ్రీ

# సమాజ సామ్రాజ్యము
## లేక
# ఆదర్శ ప్రభుత్వము

---

## ద్వితీయ ఖండము

శ్రీమయవక్ష! బంధురరసీభవదుద్యదహైతుకానుకం
పామయహృత్కుశేశయ! విభాసుర దృఙ్మయమంజులాననా
హేమమయాంబరోజ్జ్వల త్రయీమయ నిశ్శ్వసితా! జగన్మహో
ద్దామ తనూవిలాస! బలధాముకులేన్మయ రమ్యమందిరా!

వ॥ అవధరింపుము వైశంపాయనుండు వెండియు జనమేజయున కిట్లు వచించె. 2

చం॥ వలపుల సజ్జనాఁ బరఁగు వాసక సజ్జిక యట్లయోధ్యయున్
దెలతెలవారు నప్పటికిఁ దియ్యఁగఁ దోరణ కాయమానసం
కలితమనోజ్ఞ వేషమున గమ్ముమలాడుచుఁ జెల్వుఁ జూడఁగా
నిలువున నిల్వునన్ గనుల నిల్పె గవాక్షపుఁ గైతవమ్మునన్. 3

మత్తకోకిల॥ రచ్చపట్లు చతుష్పథంబులు రాచబాటల వజ్జలున్
గచ్చుతిన్నెలు గోడమేడల గారశాలలు శృంగముల్
పుచ్చవిత్తులపోల్కి సైకత పూరమట్లు జనుల్ రహిన్
నిచ్చలమ్ముగ నిండిరన్నిట నేలతేని గనుంగొనన్. 4

ఉ॥ బూజుతొలంగ, ధూళితుడ ముట్టఁగ కిల్మిష ఖలంబుగన్ నవో
త్తేజిత రాజమందిర తదీయసమంచిత వస్తులక్ష్మి యు
ద్భ్రాజ దుదారవేషమున భర్తృసమాగమ ధన్యమూర్తిగా
రాజిలు పూరుషోత్తముని రాకకుఁ దెన్నులు కాచెన త్తఱిన్. 5

చం॥ కుతుకము చింద నూడిగపుఁ గొమ్మలు పాడుచు నాట్యభంగిమన్
క్షితిధర హర్మ్యశాలలను చిత్రములన్, శుకశారి కాదులన్
బ్రతిమలఁ జక్కఁ దీర్చుచు గవాక్ష సరస్సుల కప్పుడప్పు డా
యత వదనారవిందముల యందము కూర్చుచు నుండి రెంతయున్.

తే॥ ప్రాఁతగోడలు పూతతో వరలునట్లు
మేలి వలివంపు జిగితోడ మేనులలర
వృద్ధదాసీచయం బను ద్విగ్నమగుచుఁ
గన్నెపడుచుల కుపదేశ కలనఁ దనరె. 7

సీ॥ పుష్పకైతవమునఁ బొడవెల్లఁ గనులుగాఁ
దమితోడ వృక్షముల్ దారికాయ
రమణీయకిలకిలా రావంబు పేరున
గీతముల్ పక్షులు ప్రీతిఁబాడ
సరయువు కెరటంపు మురువుచేతుల తోడఁ
బద్మంపు టారతుల్ పట్టియుండ
హర్మ్యంబు లిరుగడ హైమశృంగమ్ములఁ
బుష్పహారమ్ములఁ బూని నిల్వ

తే॥ రాజవీథుల నిరుచక్కి రాజభటులు
మక్షికము నేని రానీని మాడ్కి మెలఁగఁ
బురము పురమెల్ల నుత్కంఠఁ బొంగియుండె
నాత్మ చిరకాంక్షితఫలంబు నందుకొనఁగ 8

వ॥ అంత నృపకుమారాగమనసూచకంబుగా శతఘ్నీనినదంబులు
వినవచ్చుటయు. 9

మంత్రులాప్త సామంత పౌరప్రముఖులతో నెదురువచ్చి
స్వాగత సన్మానంబు నడపి రాకొమరుని రాజగృహంబున ప్రవేశపెట్టుట

చం॥ అదెయదె వచ్చెవచ్చెఁ గను § డంచు సదుక్తులు వీనులన్ బడన్
మొదలక కూడియున్న ప్రజ § మించిన యాత్రముతోడ ముందటన్
బొదలు జనాళిమూఁపులను § మోపికరంబుల నఱ్ఱుచాచుచున్
బదములనెత్తి యొండొరుల § పైఁబడి చూడఁ దొడంగి రాదెసన్.

ఉ॥ కోసలభాగధేయమటు § క్రొన్నెలకైవడి గోచరించినన్
వేసము మీసముల్ తలలు § వేగమ దిద్దుచు మంత్రులాప్తులున్
భాసుగు లైదువల్ ఫలస § ముజ్జ్వల చందన పుష్పవీటికో
ద్భాసిత భాజనాలలిత § పాణులు రా నెదురేగి రయ్యెడన్. 11

చం॥ జయజయనాదముల్ చెలఁగ § స్వస్తివచః స్పృహణీయ వాద్యసం
చయ బహుళధ్వనుల్ మిగుల § సందడిసల్పఁగ, నప్పుడర్యమా
న్వయమణి తేరుడిగ్గి నవ § వర్త్మముతో సరయూసరిజ్జల
ప్రియతతటస్థలిన్ బొలుచు § భర్మమహోజ్జ్వల మంటపమ్మునన్.

తే॥ కలభసమరేఖఁ జనుదెంచి § లలితపీఠి
రూపుఁగొన్నట్టి చెలువంబు § కోపుమించ
నధివసించెను జనవరు § నాత్మజుండు
బాలభావంబు నూనిన § భానుఁ డనగ. 13

ఉ॥ పుత్తడిపీటపై రతన § ముల్ సమకూర్చిన చందమొప్ప న
త్యుత్తమహేమపీఠమున § నొప్పఁగ నుండినరాజసూనుచం
చత్తనుకాంత్యనుగ్రమయి § చక్షువులన్ బురికొల్పుచుండ నా
యత్తతలేని యట్లు వసు § ధామరముఖ్యులు డాసియంతటన్. 14

వ॥ సముదాచారంబు నిర్వర్తించిరంత నాప్తమంత్రి ప్రకృతిమండలి.

స్వాగతవృత్తము॥ మామపుణ్యఫల § మంజరియబ్బెన్
మీఁదుచూచుచును § మేల్గననుండన్
మీఁదురాకయెల § మిన్ సమకూర్చెన్
శ్రీదమూర్తి! మము § జేకొనుమింకన్. 15

తే॥ స్వాగతం బిట్లు మధుర వ। చః ప్రశస్తిఁ
బలుక సామంతముఖ్యులుఁ। బలికిరోలిఁ
బుల్కలడరంగ మెచ్చుల। భూపసుతుఁడు
నెల్లవారలఁ దనియించె। హృద్యవిధుల. 17

వ॥ ఇట్లు స్వాగత సన్మానంబులు సలక్షణంబుగా నెరవేరినంత. 18

తరళ॥ వినఁ బురోహితుఁ డొయ్యఁ బల్కెను। వేళయయ్యె నటంచుఁ జ
య్యన రథంబున నెక్కి రాట్సుతుఁ। డందఱున్ లలి వెన్కరాన్
జనుచుఁ బట్టణమందుఁ గన్నెలు। చల్లు పూవులఁ దోగుచున్
దనరు మోసలఁ దేరునిల్వ ము। దంబునం దిగె ముద్దుగాన్. 19

తే॥ వృద్ధదాసి యొకర్తుక। దృష్టిదోష
మడఁగ గోమరున కెఱనీఱు। బడిసివైచి
యడుగుదోయిని శోధించి। మడుగులొత్తె
గప్పురపుటారతెత్తిరి। కన్నెలెలమి. 20

ఉ॥ మంగళవాద్యనాదము స। మన్విత భూసురమంత్రనాదమున్
సంగతమై చెలంగ వరు। సన్ సచివాప్తమహీశ వాహినీ
శాంగన లేగుదేర నిజ। హర్మ్యముఁ జొచ్చి నృపాత్మజుండు దా
నంగమనీయ విస్మరము। నన్ వసియించెను నిండె వేశ్మమున్. 21

తే॥ మోమునకు నిండు తిలకంబు। ముగుదలకును
ప్రాణనాథుండు గృ। హమ్మునకును
నిండు గృహపతి పురికిని। నిండు భూపు
డర్చనకు నిండు విగ్రహ। మవనినాథ! 22

వ॥ ఇట్లక్కుమారమణి గృహమ్మునకు నిండుగాఁ గూర్చున్నపిమ్మట
సుమంత్రుండు. 23

తే॥ ఇల్లు నిలుతేఁడు విద్యయు। హృద్యగుణము
మధుర మధురమ్ములౌట నా। మధురిమకును
ముగ్ధలై యన్యమెఱుగని। పోల్కి నున్న
సముచితోక్తుల నెల్లర। సరవిఁబుచ్చె. 24

వ॥ అట్లు పోవుచు నాప్తసామంతరాజముఖ్యు లొండొరులు. 25

మ॥ కనియున్నారముగాదె యీకొమరు సాకారాంతుఁ, బ్రశాంతాత్ముఁడ
య్యును గన్నుల్ గనజాలకున్న యవి ప్రేమోమూర్తి యేనిన్ మదిన్
ఘనభీతిన్ బొడమించు నమ్రముగు నా కైశోర మూర్తిం గనన్
దను వా దైవతమూర్తిపై మనము లగ్నంబౌఁగదా! చిత్రమా,

కం॥ ఏతాదృశమహితుఁడు మన
జాతంబున నెందు నేని జన్మింపడు ము
న్నాతత కీర్తి కకుత్స్థుఁడు
చేతోహరుఁ డుండె ననుచుఁ జెప్పిరి వృద్ధుల్. 27

మ॥ కన నా భూపతి కీవయోధికకనత్కాయంబు విజ్ఞాన మీ
ఘనసత్వద్యుతు లున్నయట్లెలుగ మా కంజాక్షుఁ డీబాలకున్
మనుచుం గాక యటంచు పెక్కువగలన్ భాషించుచున్ సాగి రా
త్మనటత్ప్రీతిని వెల్లడించుచును నేత్రప్రీత తద్దృశ్యులై. 28

కం॥ పౌరులు పరమాప్తుం డన
వీరుం డని సైన్యపతులు పేర్కొన దేశో
ద్ధారకుఁ డని ప్రజలాడి రు
దారదయాలలితుఁ డనుచు నాడిరి భృత్యుల్. 29

తే॥ కులపురోహితుఁ డప్పుడు కొమరునకును
మంగళస్నాన మాడింప మానినులకు
నాజ్ఞ యిడి తాను సలుపు స్వస్త్యయనవిధికి
నరిగె ననుమతిఁ గొని మంత్రి యచటు వీడె. 30

వ॥ ఆతరుణంబున — 31

తే॥ వచ్చితే తండ్రి! సుకుమార! వగపుతీర
కన్నులుండియు గ్రుడ్డినై కానసైతి
ననుచు యవనికమాటున నణగియున్న
మేనయత్త సుపుష్టాంబ కానవచ్చె. 32

తే॥ చేటికానీతపీఠిఁపైఁ । జేరి యప్పు
డాత్మ పదధూళిఁ గైకొను । నల్లుఁ దీసి
పజ్జఁ గూర్చుండఁజేసి తాఁ । బాణిపల్ల
వములఁ బుణుకుచు మేను బా । ష్పముల ముంచె. 33

వ॥ మఱియు నాకన్నతల్లి మేనల్లునికరకమలంబులు కన్నుల
కద్దుకొనుచు నిట్టుల నలమటించె 34

సీ॥ చిట్టితండ్రిని గాంచఁ । జిత్త ముత్తలపడ
నిప్పటికొదవె నా । యత్తపడఁగఁ
బచ్చనితోరణాల । పసుపుగుమ్మంబులు
పుట్టినింటికిఁ జూచు । పుణ్యమొదవె
సంతికై కడు । సదమదంబయిరన్న
వదినెయు నడవుల । వనటతోడ
ముద్దుపట్టికి నొక్క । ముచ్చటనేనియు
చేతులార నొనర్చి । చెలఁగరైరి 34

తే॥ అనుచు నశ్రులఁ గురిసెడి । నల్లు శిరము
నంకమునఁ జేర్చి మృదుచేల । నశ్రువారి
నొత్తుచుండఁగఁ దత్పతి । దూరనిల్చి
యెచ్చరికగొల్ప నల్లన । నిట్టులనియె. 35

తే॥ ఔర ! తీరికఁ గూర్చుండి । యల్లురకును
గాసి కల్గింపనౌనె వి । కాసముడఁగ
గార్యమరయరు వెజ్జులు । కారె మీర
లనఁగ నశ్రులు తుడుచుచు । నతివ లేచె. 36

వ॥ అయ్యెడ నాచిట్టియిలుఱేడు... 37

తే॥ క్రొత్తమోములు చోటులుఁ । గ్రొత్తలౌట
తావు తనదైన తానును । తానయైనఁ
దెలిసినదియును తెలియని । తెఱఁగు కాఁగ
నర్భకుని చేతి విగ్రహ । మట్టు లొప్పె. 38

కం॥ మునిపుత్రి సహచరుం డ
మ్మనుజాధిపనందనుండు § మధ్యాహ్నమునన్
దనయునికిఁ గంటకించుచు
మనమున నీపగిది దలఁచె § మలయుచు నొంటిన్. 39

చం॥ కన వినఁ బల్క నంగములు § కల్గియు రిక్తుఁడనై చరింపఁగాఁ
బొనరె యథేష్టవృత్తి ముని § పుత్త్రులుగా కొని రిత్తమానిసిన్.
బనిచి రయోధ్యకు న్నను వి § భాసిలు నీగ్రహకందరమ్మునన్
జనువుగ సింగపుంగొదమ § చాడ్పున వర్తిలుచుంటి నిత్తఱిన్. 40

వ॥ అట నయ్యాశ్రమంబున 41

మాంధాతృ పట్టాభిషేకమునకు భృగుమౌని సురేంద్రు నాహ్వానించుట

చం॥ అల భృగుమౌని నిర్జర గ § ణాధిపుఁ గానఁగ నేగె నమ్మునిన్
దలఁపు ఫలించినట్లు ప్రమ § దంబున నర్ఘ్యమొనర్చి భక్తితో
బలరిపుఁ డిట్లు పల్కె ముని § భాస్కర! పావనమయ్యె మద్గృహం
బలరె మనంబు మిమ్ముఁ గన § నానతియిండు విశిష్టవృత్తమున్. 42

వ॥ నావుడు నాభృగుమౌని యాతని కిట్లనియె సురేంద్రా! 43

మ॥ యువనాశ్వప్రియనందనుండు భవదీ § యోదారహస్తాంగుళీ
ద్రవపీయూషరసప్రపోషిత కుమా § రశ్రేష్ఠుఁ డుద్యద్గుణుం
డవు మాంధాతృని సంయమిప్రతతి ప § ట్టాలంకృతుం జేయ ని
ల్లి వరిష్ఠంబగు వేళ నిర్ణయము స § ల్పెన్ లోకసంతృప్తికై. 44

మ॥ అవు నారాజకుమారచంద్రమునిఁ గ § న్నారం గనన్ గౌతుకం
బవు నా నింద్రుఁడు వెండి మౌనియనెఁ ది § వ్యంబూరు కేల్దోయితో
యువనాశ్వుండు గతించినట్టి కొదలే § కుండన్ గుమారాభిషే
కవిధిన్ బూర్ణము చేయుమీయుభయలో § కశ్రేయ మీడేరెడిన్.

వ॥ అనుటయు నాత్రిలోకేశుండు — 46

తే॥ "లలితలక్షణ పురుషల § లాము నితని
గారవించిన లక్షణా § కలితమగుచు

వెలయు మాహాప్రభవమ్మును ǂ విడక వత్తు
నమ్మహార్తానఁ బ్రీతి మ ǂ హర్షివర్య! 47

తే॥ ఇంతదనుకను దయయుంచి ǂ యీ యుదంత
మెఱుకపరుచుట ధన్యుఁడ ǂ నే” ననంగ
ముదముకల్గెను సురనాథ! ǂ పోయివత్తు
ననుచు మునిలేచె నణకువ ǂ ననిచె నతఁడు. 48

వ॥ ఇట భారతవర్షీయసముచ్చితభాగ్యరాశిగా, రమణీయవైవాహికవేషపరిష్కృతయగు నవవధూమతల్లికి జతగా, ప్రత్యగ్రపట్టాభిషేకాలంకారసుశోభితయై, సకలజనమనోహారనవనవవినోదశతసమున్మీలదానందనిధియై సాకేతపురలక్ష్మివిరాజిల్లుచుండె నత్తఱి:— 49

తే॥ లలితశృంగార చతుర లీ ǂ లాప్రముగ్ధ
నవవధూ బంధు పరిజన ǂ నవ్య వేష
భాషణవినోదతుందిల ǂ భావమధుర
పవనకిలికించితము రాణి ǂ వాసమెల్ల. 50

తే॥ విరులపందిళ్ళ గమగమల్ ǂ వీధులందుఁ
గలయఁ జల్లిన మలయజ ǂ జలము తావి
కమ్మకస్తురి యగల ధూ ǂ పమ్ము వలపు
నభినవోల్లాస జనకమై ǂ యులమె దెసల. 51

తే॥ చలువపల్లియ మేల్కట్ల ǂ సరిగ మెఱుఁగు
లలర రతనాల జాలరు ǂ ల్వ్రేలయనడుమ
వ్రేలు ఫలపుష్ప మంజరుల్ ǂ వేడ్కఁ గొలుపు
పసిఁడికంబాల చవికెల ǂ పస లెసంగె. 52

ఉ॥ చావడి చప్పరంబులను ǂ సత్రము లందున మంటపమ్ములన్
ద్రోవులు ప్రోవులై యినుక ǂ పోసిన రాలనియట్లు నిండుగా
తావుల నెల్లఁ గ్రమ్మె జన ǂ తాఘనవాహిని తత్పురంబునన్
ద్రోవల సందులందుఁ దొడ ǂ త్రొక్కిడి మిక్కుటమయ్యె నయ్యెడన్

తే॥ వాసవుడు వచ్చునని యెడి § వార్త యుర్వి
మెఱుపువేగాన పాక్కంగ § మేటిదొరలు
వెల్లివిరిసిన చందాన § విడిసిరోలిఁ
గోసలపురంబు పరగడఁ § గొమరు మిగుల. 54

వ॥ అంత రాజకుమార పట్టాభిషేకమహోత్సవ సందర్శనస ముత్సుకమై సకలజనంబు జగచ్చక్షువున కై వేచియుండ నాలోకబాంధవుండును నాత్రిమ్మనఁదోతెంచి యాజనసమాజమ్ముతోఁ దననిడుపాటి బంగారుచేతులు కలిపి యమ్మహోత్సవంబునఁ బాల్గొనుచుండె నయ్యెడ-

ఉ॥ రాజకమెల్ల నర్కకర § రంజిత పుష్యరథాధిరూఢమై
యోజితరాజమార్గ వివి § ధోజ్జ్వల తోరణపట్టికావళీ
రాజదుదారవర్ణముల § రక్తిఁ బఱించుచు నాననాత్మకాం
భోజమనోజ్ఞ హర్మ్యముల § పూర్ణత మెచ్చుచుసాగి ముందటన్. 56

శా॥ ఆదోకంబయి కుందనంపుజవిపై § నాబద్ధ నానామణీ
ప్రాదుర్భూతరుచిన్ మనోజ్ఞమయి సౌ § వర్ణోజ్జ్వలత్కుంభ సం
భేదంబై నవరత్నహారవలయో § న్మీలన్మహాద్వారమున్
నేదిష్ఠస్ఫటికస్థలిన్ మెఱయు దా § నిన్ జేరె నుత్కంఠతో. 57

వ॥ దానిచక్కందనంబునకుఁ దలలూపుచు నమ్మూర్ధాభిషిక్తవిసరంబు రథావతరణంబొనర్చి మొలకనవ్వుల నునువెల్గులు కెమ్మోవులఁ దులకింప నొండొరులు సరసంబులాడికొనుచుఁ దత్ప్రధానద్వారం బతిక్రమించి.

తే॥ తతనువర్తుల నవరత్న § దామకౌఘ
లలితకాంచనతోరణా § కలితమైన
చంద్రకాంతశిలాబద్ధ § చారుసరణి
స్వాగతము పల్కు సచివుల § సరసఁ జనుచు. 59

సీ॥ సుస్నిగ్ధవిద్రుమ § సోపానపంక్తులు
పదముల పాటల § ప్రభలదిద్ద
మరకతమయకుట్టి § మంబులు మేనుల
నభినవవర్ణంబు § నావటింప

మగరాలకంబముల్ ౯ మంజులాస్యమ్ములఁ
బ్రత్యగ్రసాత్త్విక ౯ వ్రీభలు నింప
గ్రామ్మించు వసమించు ౯ గ్రొత్తసింగారముల్
మానసంబులకుఁ ౯ దన్మయతఁ గూర్చ
తే॥ నడరు నభిషేకభవనంబు ౯ నందుఁ జొచ్చి
యుర్వ్యుత్తమ విష్టరంబుల ౯ నధివసించె
వైద్యుతజ్యోతులెత్తిన ౯ వరుసమెఱసె
భవనమవ్వాడు, వైకుంఠ ౯ భవనమట్లు. 60

చం॥ దివిభువి నేకధాటిగను ౯ తేజముపర్వఁగ సంచరించుచున్
రవిగతి లోకబాంధవత ౯ రాగిలుచున్ గృహమేధివర్గమున్
బ్రవిమలవృత్త భాగ్యముల ౯ భవ్యులఁ జేసెడి తాపసాళి త
ద్భవనమునందు నగ్రభువిఁ ౯ బావనవిష్టరపాళిఁ గూర్చొనెన్. 61

మ॥ వరసామంతులు పౌరముఖ్యులు జన ౯ వ్రాతాధినేతల్ మనః
స్ఫురదామోదతరంగముల్ విరియ నా ౯ ముక్తోజ్జ్వలత్ప్రీతులై
గరువంబార వసించి రాభవనభా ౯ గం బందునన్ బేర్చి నా
తురమైనట్టి జనాళి క్రిక్కిరిసి నం ౯ దున్ గ్రంతలన్ బొంతలన్.

వ॥ అంతఁ బట్టాభిషేక సుముహూర్తంబు సమాసన్నంబగుటయు పృథివీ సురోత్తమ పాపఠ్యమాన మహామంత్ర నినదంబులు మంగళ తూర్యరవంబులు జయజీవ శబ్దంబులును మిన్నుముట్టుచుండ మిహిరకులమండనుండగు యువనాశ్వనందనుండు మహావైభవంబుతో పట్టాభిషేకభవనంబు ప్రవేశించె నప్పుడు కులపురోహితుండు తొలుత విఘ్ననివారిత యగు విష్వక్సేనుని బూజించి పుణ్యాహవాచనోదక శాంత్యాది విధానంబులు యథాక్రమంబుగ నిర్వర్తించె నాతరుణంబున. 63

మ॥ నెలతాచోక్కఁపుఁ దిన్నెపై బసిఁడి వ ౯ న్నెల్మించు పీఠంబునన్
దులకింపన్నెలకొల్పి రాకొమరుఁ బా ౯ థోరాశి నీరంబులన్
దలిరుల్ పూలు మహౌషధుల్ గలయ నె ౯ త్తావుట్టుబాలించు శీ
తలతోయంబుల నావగాజలములన్ ౯ ధర్మప్రియుల్ తాపసుల్.

చం॥ స్వరయుతులేర్పడన్ శ్రవణ సంపుటికింపుగ నుల్లముల్ సుధా
శరభువనంబుచేర్చునుడి కారమునన్ దగ నేకకంఠతన్
దొరకొని మంత్రసంతతిఁ జతుశ్శ్రుతిసంగతితోఁ బఠించుచున్
జిరతర ధర్మగుప్తి కభిషిక్తుని జేసిరి నిర్మలాత్మునిన్. 65

మహేంద్రుడు చనుదెంచి మాంధాత శిరమ్మునఁ గిరీట మిడి యాదరించుట

మ॥ భృగువాచంయమి చూడ మింటిదెసకున్ బృందారకస్వామియున్
మగరూపుంగయికొన్న రాచసిరినా మంజుప్రభన్ దద్భువిన్
దిగి యొంతేఁ గుతుకంబునన్ సమితి భక్తిన్ జూప, లేనవ్వుచూ
పుగముల్ సత్కృతిఁజేసి సభ్యులకు సమ్మోదంబు సంధించుచున్.

వ॥ భృగువసిష్ఠాది పూజ్యపాదులకుఁ గేల్మోడ్పుతో నానందమొద
వించుచు దరియుంజని. 67

సీ॥ పెదవులు మెదపినఁ బొదలు సురభి పయః
పరిపాకరమణీయ పరిమళములు
నాలుక కదలించి నలువున మాటాడ
లలితామృతాసార విలసనములు
కరములు కదలింపఁ గంకణస్థానీయ
కల్పవృక్షలతాంత గంధలహరి
తను వొకింత చలింపఁ దపనీయ రుచి మించు
తలపుమానికపు సౌందర్యవిస్ఫూర్తి
తే॥ పరిఢవిల్లఁగ నాకసంపదల రుచులు
మారగొన సభ్యులెల్లరు సొంపుమీరఁ
గేలుఁగవకట్టి నిలువంగ మేలటంచు
తనకు మ్రొక్కెడి యువనాశ్వ తనయు నెత్తి. 68

చం॥ కరదళదంబుజాతములఁ గైగొని కమ్మనియావి క్రమ్మ సుం
దరమృదులోష్ఠ సంపుటిని నల్వున ముద్దిడి సింహపీఠిపై
"స్థిరముగ నేలు"మంచును వసింపఁగఁజేసి కనత్కిరీటమున్
శిరమున నొప్పఁజుక్కనిడి చేతను ఖడ్గము వ్రేల ముద్రికన్. 69

చం॥ చెలువుగఁ గూర్చి వత్స ఘనశేముషి మించగ ధర్మయుక్తి రం
జిల వ్రజ శత్రుభంజనము చేసి జయింపుము భూమినంతటన్
నలినదళాయతాక్షు కరుణన్ బహుకాలమటంచు నర్మిలిన్
గలకల లాడు తన్ముఖము గాంచెఁ దదంసము తట్టుచున్ లలిన్ 70

తే॥ లేనగవుతీయ మొప్పార లీల మునుల
నరపతుల వంకఁ దిలకించె సురవిభుండు
పూలుకురిసెను దీవనల్ మున్నుగాఁగ
నిందుపై నప్డు నవ్యాన రెందుపైన. 71

తే॥ తండ్రికొమరుల చందానఁ దనరి రిరువు
రమ్మహోత్సవమును పూర్ణ మయ్యె నంత
మునుల యభినందనమ్ములు జనవరేణ్యు
వందనమ్ములుఁ గొని చనె వాసవుండు. 72

చం॥ నవవిభుచెల్వు నెమ్మనము నన్ దనుకంబును పెంపు నింపఁగాఁ
గవ ఝాంకృతి కన్యయయి కాంతునిగూడిన రాజ్యలక్ష్మి నా
నవపరిణీత బంధుమతి, నమ్రతఁ జెంత వసించె నంత నీ
కువలయకాంతుఁ డొప్పెసగెఁ గోటిగుణంబుల రోహిణీశుఁడై. 73

మ॥ వరకేయూర కిరీట కుండలయుగ ప్రత్యగ్రముక్తావళీ
తరళోద్యన్మణిహారరూపమున జెం తన్ దీధితుల్ చేరఁ జా
మరయుగ్మాకృతిఁ దత్సుధాద్రవముఁ గ్రమ్మంగా సితచ్ఛత్రమై
శిరముం జంద్రిక, రాజు రాజయిపరి కాశించెన్ సభాధ్యస్థలిన్.

కం॥ ఆరాజు నుదయ రుచులకు
మారాకులు తొడిగెఁ బ్రజల మానసవల్లుల్
తోరపుచెలమిన్ మాని చ
కోరమ్ములు చెలఁగెఁ గువతి కోకము లడలెన్. 75

వ॥ అమ్మహోత్సవంబున— 76

తే॥ సర్వతంత్ర స్వతంత్రులౌ జనవరేణ్యు
లపుడు కొంగ్రొత్త చిటికోస లాధిపతికి

లలిత రత్నాంబరాదుల । నెలమిఁ బెట్టి
రుడుగరలు పెక్కుచందాల । నొప్పుగాఁగ. 77

తే॥ వెలయు సామంతు లాప్తులు । వేడ్కతోడఁ
గరుల హయలను దాసులఁ । గనకరాశి
బహువిధోపాయనంబులు । ప్రభునకొసఁగి
రవుల నాగర జానప । దాఢ్యులెల్ల. 78

తే॥ వెనుక ముందులు చూడక । విమలమతులు
విడిముడినిగుర్చి రభిషేక । వేశ్మ మపుడు
నిఖిల భారతలక్ష్మికి । నిలయమగుచు
గనఁగఁ గన్గవ చాలని । కరణి మెఱసె. 79

మాంధాతృనెడ మానివర మహారాజ మాండలిక పౌర జానపద
ప్రముఖు లాశీః స్నేహ భక్తి ప్రపత్తులు ప్రకటించుట.

వ॥ అంత వివిధమండలీసమాజ ప్రతినిధు లాశీః ప్రశంసా విజ్ఞాపనమ్ము
లనేకమ్ము లయ్యభినవనరేంద్రునకు నర్పించి రందు మహర్షిమండలి
యి ట్లాశాసించె. యువనాశ్వగర్భశుక్తి ముక్తాఫల! 80

ఉ॥ శ్రీకరధర్మసేతువులు । శ్రీవరరూపులు రాజు లుర్విలో
నేకముఖమ్ముగన్ జనుల । నేలెడి ధర్మవ పార్థివోత్తమ
ప్రాకటబాహుయుగ్మ పరి । పాలితమై నిరుపద్రవంబుగా
లోకులు ధర్మమూలమున । లోలతమాని చరింతు రెల్లెడన్. 81

తే॥ నృపతు లా ధర్మసూత్రాల । నిజకరాలఁ
బట్టి ప్రజలనుగాచుట । పరమధర్మ
మాచరించుట యద్దాన । నవనిధవుడు
తనువు ధన్యంబుగా రెంటఁ । దనరుదీప్తి. 82

తే॥ తలఁపు తలఁపున ధర్మ ప్ర । ధాన బోధ
పలుకు పలుకున ధర్మ ప్ర । భావ లీల
చేతచేతను ధర్మ ప్ర । సిద్ధి కలన
చెలఁగ వర్ధిల్లు ప్రజలతో । సిరులుపొదల. 83

తే॥ దయయు సత్యంబు శౌచంబు § దమము శమము
ధైర్యము తితిక్ష చాగము § ధర్మ మివ్వి
రత్నములు పది సాకేత § రాజ! పుట్టి
నింటికిని నిండు మెఱుగులు నేఁపుఁగూర్చు. 84

వ॥ స్వతంత్ర ధరణీపతు లిట్లు ప్రశంసించిరి. 85

ఉ॥ క్షత్రికులావతంస! కడు § సంతసమయ్యెడి మాకుఁజూడ మీ
పాత్రిత కేలుమోడ్పునకుఁ § బాత్రమమైనను పిన్నలౌట స
న్మిత్రతఁ గౌఁగలించెదము § మేదిని నీయజనాభవర్ష చా
రిత్రిక నూత్నసంపుట మ § రిందమ చేరెడి మీచరిత్రతోఁ. 86

ఉ॥ స్తైన్యము లేక యాఁకటను § సంకటమొంద సుధారసంబు సౌ
జన్యముతోఁ గరాంగుళి నో § సంగె భవజ్జనసంపువేళ రా
జన్యకులంబు ధన్యముగఁ § జానుగఁబెట్టి కిరీటమివ్వ డ
న్యోన్యతఁ జూపె నేమహితుఁ § డో మెడినాతఁడు మిమ్ము
నిమ్మగాఁ. 87

వ॥ మాండలికసమితి యిట్లు విన్నవించె. 88

చం॥ పరువము తప్పకుండ గుణ § పాఠము నేర్చి భవద్భుజద్వయీ
గురుతరశక్తి ప్రాపున న § కుంఠిత తేజము మించ, నిష్ఠతోఁ
గరములు కట్టి నిల్చెదము § కార్యపదంబులు తెల్పఁగోరి; మీ
యరయిక మాకు వర్మమయి § యన్వహ మోముతఁ గూర్చు
ధీరతఁ. 89

చం॥ మునివరు లంకపాళికల § ముద్దుల ముంచుచుఁ బెంచి పెద్దగా
మనిచి సమస్తవిద్యలు స § మర్మముగా విలువిద్దె యస్త్రముల్
చనువునఁ దెల్ప నింతలుగ § సాగిన మీ మహిమానుభావముల్
తనువునుగాక యిమ్మహి ను § దారత కల్పకమట్లు మేలిమిఁ. 90

వ॥ పౌరవర్గంబు కౌతుకోదంచితంబై నిజభక్తి నిట్లు వెల్లడించె. 91

తే॥ మఱగినారము యువరాజ § కొఱకు నేము
దీర్ఘకాలంబు, మాకుందు § తీర, మధుర

భవ ముదార చరిత్రంబు ◌ శ్రవణపుటము
చేరినప్పుడ మిమ్ము మ్మను ◌ జేరి మనసు
తే॥ పుడమి దుర్లభుడై నట్టి ◌ యొడయుఁ బడసి
గర్వమున నుబ్బుచుంటి మీ ◌ గర్వశాఖి
విశ్వమానవ హృదయాల ◌ వేళ్ళుఁదన్ని
మానుగట్టి మహోన్నతి ◌ మలయుఁగాక. 93

వ॥ జానపద ప్రముఖులు తమ సంతసం బిట్లు వెలువరించిరి. 94

సీ॥ అమృతంపు నెత్తావు ◌ లకరు మీ గుణరుచి
కూడియాడిన మిత్ర ◌ కోటి కెఱుక.
సకలార్థ గోచర ◌ ప్రకట వైదుష్యంబు
మురిసెడు గురుసంఘ ◌ మునకు నెఱుక
అతివరోూరూపమా ◌ వితత విక్రమలీల
చవిగొన్న తస్కర ◌ సమితి కెఱుక
దెసల నేలఁగఁ జాలు ◌ దివ్యప్రభావంబు
తపము వెచ్చించిన ◌ తపసి కెఱుక
తే॥ కూఁతుకొసఁగిన సకలార్థ ◌ కోటి విభున
కెఱుక లిన్నియు శశిబింద ◌ నృపతిమణికి
నీ యెఱుకలెల్ల మాకంట ◌ నెసఁగు పంట
భవ్యకోసలభూసతీ ◌ భాగధేయ. 95

ఉ॥ సాటికి లేని మీపలుకు ◌ సన్మతిఁ దీర్చెడి వేదవాక్కు, మా
కోటికి మీదుచూపుసిరి ◌ కూటము నింపెడి మేలువంట, మా
పాటికి మీదు పెంపు గరు ◌ వంబును గూర్చెడి భాగ్యలక్ష్మి, మా
నాటికి మీసుమూర్తి మది ◌ నమ్మిన దైవము గెల్పుఁడీ ధరన్ 96

వ॥ అట్లు వ్యాచకంబులు ముగియుటయు పురోహిత ప్రేరిత మహీసుర ప్రకరంబు సుశ్రావ్యంబుగా మహాశీర్వచన సంవిధానంబు నిర్వర్తించె. 97

తే॥ సాధుజయజీవశబ్దముల్ ◌ చదలుముట్ట
నంత మాంధాత పత్నితో ◌ నాత్మగురుల

మునివరుల పాదపద్మముల్ § ముట్టి సభకుఁ
బ్రణతు లర్పించి వేదిపై § భక్తినిలచి. 98

మాంధాత మునివర మహారాజ మాండలిక పౌర జానపద
ప్రముఖుల సముచితోక్తుల సత్కరించుట.

వ॥ మహర్షిసభ నవలోకించి యిట్లువిన్నవించె. 99
ఉ॥ పావనమూర్తులార! కను § పాప జగంబిడి విశ్వమానవో
జ్జీవనబద్ధదీక్ష నిజ § జీవ తపోవ్యయముం బొనర్చు మీ
త్రోవ భవత్సముక్త గుణ § రూప మణిప్రభలన్ జరింతు నా
జీవితమే ప్రమాణమయి § చెల్ల నకైతవ ధర్మవృత్తికిన్. 100
వ॥ అంతఁ బ్రభుసమితి సమీక్షించి యిట్లభినందించె. 101
చం॥ పులకితమయ్యెడిన్ దనువు § పూజ్య మహాశయులార! మీమహో
క్తుల భవదీయ జీవిత మ § ధుప్రసవ స్తబకంబు చిమ్మిన
వ్వలపుల కౌఁగలింపుల సు § వాసితమైన మదీయవృత్తమున్
దలచెద నవ్యసుస్థితిని § దాకొనునంచు జగచ్చరిత్రమున్. 102
వ॥ పిమ్మట మాండలిక పౌరప్రముఖుల నిట్లని యాదరించె. 103
మ॥ మహనీయోర్జిత మూర్తులార! శిశువున్ § మాన్యోరు పీఠంబునన్
రహిఁగూర్చుండఁగఁ జేసినారిటుల మీ § రల్; పెద్దపోకళ్లగా
సుహితత్వంబున నియ్యకొంటి మతికై § ఘోరంపుఁ జావల్యమున్
సహియింపన్ మిము వేడి సేవసలుపన్ § సంసిద్ధతన్ నిల్చెదన్ 104
మ॥ సరళోదార చరిత్రులార! భవదు § చ్ఛ్రాయాభిమానంబు, నన్
బురికొల్పన్ బదమూనినిల్వఁ, బ్రియతా § పూర్ణాత్ములై నన్,
మహ
త్తర వాగ్భావల ముంచినారలు మహా § త్వం చింతయేనున్నచో
నరయన్నా యెడఁ దన్మహత్త్వ భవదీ § యార్థంబ నిక్కంబుగాన్ 105
వ॥ పిదప జానపద ప్రముఖుల నిట్లని సంతోషపరిచె. 106
చం॥ అనుపమ భక్తియుక్తినను § నందఱికిన్ గడునెత్తుదవ్వుఁగా
నునిచి గురుండు దైవమని § యొద్దిక నర్చలుసల్పుకన్న మీ

కనయము వెంట వర్తిలుచు ✱ నక్కఱ కందెడు తోడఁబుట్టుగాఁ
గాని పనిగొంట మేలనుచు ✱ గోరెద నట్టిశుభావహస్థితిన్. 107

తే॥ పరమపావన మంగళ ✱ ప్రదములైన
యే ప్రయోజనములుగోరి ✱ యిందిరేశు
డాది దొరతన మవనిలోఁ ✱ బాదుకొలిపె
నేఁడు నవియెల్లఁ బరిపూర్తి ✱ నెగడుఁగాక. 108

ఉ॥ మాటలునిల్పి మీసలుప్పు ✱ మన్ననకేఁగయిమోడ్చి యింక నా
చోటికిఁ జేరువాడఁ గృతి ✱ సొంపె మనంబులనించు నింకటన్
దేటపడంగఁ బల్కెడిని ✱ ధీసచివాగ్రణి ధర్మయుక్తి నీ
నాటికి గుర్తుగాఁ బ్రజకు ✱ నవ్యప్రభుత్వ విధాప్రబానముల్. 109

తే॥ వాగ్విదగ్రణి కోసల ✱ వసుమతీశుఁ
డమ్మహాసభ హృదయ ప ✱ దమ్మనంగ
వెలయు నున్నతవేదిపై ✱ నిలచి యిట్లు
వినిచి తనగద్దెపై నుప ✱ విష్టుఁడయ్యె. 110

వ॥ అంత సుమంత్రుండు చనుదెంచి తదవసరోచితప్రభుత్వోదార
వాగ్దానంబులు వినిపించి ప్రజాసముదయశివంకరంబులగు సమితి సం
స్థలకు భూరిదానంబులు చదివించె. పిదప మహాసభార్చనంబు
యథావిధి ప్రవర్తిల్ల భూసురపవిత్ర స్వస్తివాచననిస్వనంబులు
జయజయశబ్దంబులు మంగళవాద్యఘోషంబులును మిన్నుముట్ట
నమ్మహోత్సవంబు మహావైభవంబుతోఁ బరిపూర్ణంబయ్యె ననిన
విని జనమేజయుండు మునీంద్రా! అమ్మహీపాలుని పరిపాలనం బే
పగిది వర్తిల్లె వినిపింపవే యనుటయు వైశంపాయనుండు వెండియు
నిట్లు వచింపఁదొడంగె. 111

మాంధాత రాజ్యాంగ రాజ్యపాలనప్రకారంబు లరయుట.

చం॥ అనుదిన మాధరావిభుఁ డ ✱ హార్ముఖకృత్యము లాచరించి చ
క్కని దొరవేసమూని యొడి ✱ కంబుగఁ గొల్వుఁ జెలంగఁజేసి తా
లిన నిజకృత్యముల్ నెఱపు ✱ లేఖకవర్గముఁ గార్యజాతముల్
గనుచుఁ దదీయవృత్తములు ✱ కష్టసుఖంబులు నాలకించుచున్. 112

తే॥ దౌరతనంబున కవయువ సరణి బరఁగు
వివిధశాఖల నిర్వర్త్య వృత్తమెల్ల
నాకళించెను సరవాస్య మచిరమునన
యిచ్చపొదలిన గ్రహియించు టెంత పాటి? 113

చం॥ ఘనుఁడు సుమంత్రి మంత్రిమణి గారవమారఁగ నెంటనంటి యా
జనవరసూతికిం బురము సైన్యము దుర్గము బొక్కసంబు పా
లనగతు లానుపాను సక లంబు వచింపఁగ నాకళింతకుం
గొనియెఁ గుమారసింహుఁడును గ్రొత్తలు నెమ్మది కింపుఁ
గొల్పఁగాన్. 114

చం॥ అనుపమ శేముషీమహిమ నన్ని తెఱంగుల పాలనస్థితుల్
గనుగొని తత్ప్రవర్తక ని కాయపుఁజేతల గుట్టుమట్టులన్
వెనుకొని కార్యరంగముల వెన్కటితీరుల నొల నెట్టి నూ
తనవిధు లిమ్ముగానిలిపె ధర్మ పవిత్రసమాజసృష్టికై. 115

చం॥ చకచక నాత్మకృత్యములు చక్కఁగ వేళకుసల్పి చూపు నా
యకలుషధర్మమూర్తిఁ గని యర్కహిమాంశ్వనిలాగ్నివారిద
ప్రకరము లట్లమోఘ్యఁ బరి పాటిగ కాలము తప్పకుండ నా
త్మకృతు లొనర్పసాగిరి స మస్త జనుల్ పినపెద్దలందఱున్. 116

ఉ॥ రాతుకొలంది గుజ్జమగు రాజు తెఱంగునుగాంచి సేవకుల్
లాతిప్రజల్ మెలంగెదరు లక్షణయుక్తిఁ బ్రభుత్వవర్గమున్
ధాతవిధాన రాజు సువి ధానత వర్తిలకున్న లోకముల్
నీతితొలంగి వర్తిలవె నెమ్మదికల్గునె సజ్జనాళికిన్. 117

శా॥ ఆ నిర్ణిద్రచరిత్రుఁ డెల్లకడ నా త్మాయత్త భూమండలిన్
గానంబోయి దురంత దుర్గతి నిదా ఘప్రోత్థవాతూలముల్
నానాటన్ బ్రజనార్చుచుండ నట చిం తన్ జేసి కర్తవ్యమున్
జ్ఞానప్రౌఢసుమంత్రితో ననియె సాజంబైన ప్రేమస్మృతిన్. 118

ఉ॥ తాత! దరిద్రదేవతకుఁ దావలమై మనసీమ చేడ్పడెన్
జేతము చేతమై నిలదు చెప్పెద నామతి దేశ్యులన్ ప్రజా

నేతల మేళవించి మన ✽ నేలకుఁ బట్టిన దుర్గతిక్షతిన్
వై తొలగించు త్రోవ నిట ✽ వాకొన మేలగునంచుఁ దోచెడిన్ 119

చం॥ అనుడుఁ "గుమార! కోసల స ✽ మాశ్రితదుర్గతిఁ బాపు నీదు యో
జనకును స్వాగతంబిడి ప్ర ✽ శస్త సమాజవిభుత్వబీజమా
మనుజజగంపు టేకతకు ✽ మార్గము తెల్పెడు చూపువ్రేలు దు
ర్దినశశిరావసన్నజన ✽ వ్రాతవసంతము నిశ్చయమ్ముగన్" 120

తే॥ అనుచు సమ్మంత్రి వచియింప ✽ నాత్మగతము
విజయశకునమ్ము తోఁచుట ✽ వేడ్కఁ గదుర
నెనిమిదవ నాటి కీ సభ ✽ తనరవలయు
ననియె జనపతి తలయూచి ✽ యరిగె మంత్రి. 121

చం॥ తలఁచి విమర్శసల్పుటకు ✽ తానము లేక ఫలావహంబులౌ
యల చిటితేని శాసనము ✽ నౌదలఁదాల్చి మంత్రులెల్లరున్
మెలఁగుచు వేడ్కనుండి రటు ✽ మేకొని రాష్ట్రమహాచమూపతుల్
బలియురు పౌరులుం బ్రజలు ✽ బాహులు కట్టి మెలంగి రర్మిలిన్.

మాంధాతృమహీపతి తొలిగ నిజరాష్ట్రీయప్రముఖమహాసభ జరిపి యందు
తాత్కాలిక దేశపరిస్థితి వివేచనాపూర్వకంబుగా సమాజాభ్యుదయ
సాధకపథకంబులను పేర్కొనుట.

వ॥ అంత నిర్ణీతవాసరంబునకు సమ్మహాసభయు సర్వాంగసుందరంబై
వెలసె నందు. 123

సీ॥ నేల నేలలనుండి ✽ మూల మూలలనుండి
పిలుపులెంచక మంచి ✽ తలఁపులూర
ప్రముఖులు పండితుల్ ✽ ప్రతినిధి సామంత
పరిబృఢ బృందమ్ము ✽ సరగవచ్చి
నియమితాసనములు ✽ నిండ నాసీనులై
రొడయు రాకకు వేడ్క ✽ లూటలూర
కాశిష్ణుభూషణ ✽ పేశలనేపథ్య
మాత్మదేహద్యుతి ✽ నందగింప

తే॥ మధురగుణశాలి కోసల క్ష్మావిభుండు
సభ్యులెల్లరుఁ దమపాల జాతరూప
శైలము ప్రసన్నమైనట్లు సంతసింప
వచ్చి తత్సభ నిల్చి తాఁ బలికెనిట్లు. 124

ఉ॥ కూరిమి నా సమున్నతిన కోరి చరించు నుదారులార! నా
నేరిమి యన్నిటం దమకు నెమ్మి కల్గఁ జేయఁజాలెనే
మీ రలసాత్ములయ్యెదరు మ్రగ్గుచు నిప్పటికున్న తత్స్థితుల్
సారవిహీనమై జనత చాలఁ జికాకుగనున్న దెంతయున్. 125

ఉ॥ నేఁటిపరిస్థితుల్ గనిన నీతికనంబడ దెందు నేని నా
రాటము కల్గు నుల్లమున రాజులు రాష్ట్రములో నివారలున్
మాటకు నెవ్వరెవ్విధి ప్రమాణముతో నడువంగఁ బోలునో
తేటగ మమ్ము మిమ్ములను తీరిచిదిద్దెడువారు లేరుగా. 126

తే॥ స్వసుఖ నిరతి నిరంకుశుల్ క్ష్మాధిపతులు
నేతలాత్మ ప్రయోజనాసక్తులు, కాన
రిర్వురు సమాజభద్రత నిచ్చవెట్టి
వీరినడుమ సమాజంబు మాఱిఁబోయె. 127

చం॥ జనహృదయాంతరాళమున జాగరితంబగు స్వార్థనిష్ఠయున్,
జెనకి సమాజపుం బెనుపు శీర్ణము చేయుచునుండె పాలకుం
డనయము స్వార్థనిష్ఠ లవమైనను గిట్టకయుండి దాని తా
ననువునఁ ద్రుంపగావలయు నయ్యది పోవునె యంత లింతలన్ 128

తే॥ కైతవము తల్లి, యనృతంపుఁ గారణమ్ము
విశ్రమస్థాన మన్యాయ వృత్తమునకు,
లోలతకు సఖి, బంధువు లోభమునకు
స్వార్థనిష్ఠ యుదారున కది విరోధి. 129

తే॥ రాజచంద్రులు సౌధాభ్ర రాజిపిహితు
లగుట మోతుబరికొలంపు టగ్గిసెకలు
పైకొన సమాజవృక్షంబు పదను జార
మొరటువారెను కాలిన మోడుభంగి. 130

వ॥ మఱియు నీయజనాభవర్షంబున. 131

చం॥ అనవధిక స్వతంత్రవసు ✱ ధాధిప పాలన మంగళాంగుళ
మ్మున కొకడై చెలంగుటకుఁ ✱ బ్రొద్దున కొక్కఁడు వేల్పు, తంత్రికిన్
తనుజునకున్ విభిన్నమత ✱ దాస్యము బాసలు పెక్కులౌటకున్,
జనులకు నేకతామధుర ✱ చారుప్రవర్తన దూరమయ్యెడిన్. 132

తే॥ ప్రభువు లాత్మాభిమాన సం ✱ పన్నులగుచు
నొండొరులమించి శాసనో ✱ చ్ఛందులగుచు
వర్తిలుచు రాఁగ, వతుములౌ ✱ పట్టుదలలు
మేరమీరుట సంఘమ్ము ✱ మేలుతఱిగె. 133

తే॥ పొరుగు నేల పదార్థాళిఁ ✱ బొరుపుఁ జేసి
యాత్మసీమ నిషేధింప ✱ నాత్మదేశ
ధాన్యజాలంబు నన్యులుఁ ✱ దరిమి వేయ
సన్నగిల్లెను వాణిజ్య ✱ సంస్థ లవని. 134

కం॥ వ్యవసాయ మ్మసదయ్యెను
భువి సాయమ్మరువు రాఁగ ✱ బోత్సాహము లే
కవసాయమందె కళ ల
ద్వ్యవసాయము లేక విద్య ✱ లాఖ్యల మిగిలెన్. 135

శా॥ పారిశ్రామిక జీవనం బవని స్వ ✱ ప్నప్రాయమై పోయెనే
యూరుంగాంచినఁ జేతనా రహితమై ✱ యొప్పేది గన్పట్టెడిన్
నోరున్నాలుక లేని యాప్రజలు సం ✱ తోషిల్ల దారిద్ర్యపుం
బేరున్ మాయఁగఁ జేయఁబూను పృథివీ ✱ భృన్మాళి కన్పింపదే.

కం॥ ఈ యొసుదుడుకుల లోపల
మాయట్టిరు ముందు రాగ ✱ మనుకువతోడన్
సాయముదొరుకుట దుర్లభ
మాయతపడ నెవ్వఁడేని ✱ నమ్మయ యొదురా. 137

కం॥ దైనందిన కృత్యంబుల
మానవ నాయకులు తృప్త ✱ మానసు లగుచున్

బూనరు జనతాక్లేశము
కానఁగ భువి నెద్దుపుండు కాకికి ముద్దే! 138

ఉ॥ రాజులు నిర్విచారణగ రాజ్యము లేలఁ బ్రజాళియున్ మదిన్
యోజనలేక, గ్రుడ్డిఁ గొని యూతగ, వేరొకగుడ్డి పోవునా
యోజను పండినం దినుచు నోర్మిని పండకయున్న నెండుచున్
తేజముతూల వర్తిలెడిఁ దెన్ను లెఱుంగదు పెంపునొందగాన్.

ఉ॥ లోకులు మున్న జీవనపు లోపముతో దిగజారియుండఁ గా,
మూకలు మూకలై వెడలి ముష్కర తస్కరు లవ్వ డవ్వడున్
రోకు తలంగ క్రొల్లగొను గూఢిరయొకం డిది, గోరుచుట్టుపై
రోకటిపోటు లోకులకు రోతజనించు తలంప నీస్థితుల్. 140

చం॥ ఇది యడగింపఁ బూనుకొన నింతల నంతలఁ దీరఁబోదు పూఁ
బొదలనుడాగు నాగుగమి పోలిక ముచ్చులమూక రొక్కచో
నదనునఁ దోచి చెంతఁగల యన్యమహీశుని రాజ్యసీమలో
నొదిగెడి పిండ్రకున్ నృప బహుత్వము సాయముగాఁగఁ
జొప్పడెన్. 141

తే॥ అఖిలసంపత్సమృద్ధి వర్షాంతరముల
మించి పేర్గాంచె నీవర్ష మేదినీత
లంబు నేఁడు దరిద్రతాలంబమగుచు
నెడ్డయైయుండెఁ బెరవారలేవగింప. 142

చం॥ వినుఁడు వినుండటంచు చప్పుడు విజ్ఞులు సభ్యుల నెచ్చరింపఁగా
మనుజవిభుండు వెండి యిటు మానుగఁ బల్కెఁ గుటుంబులార! ఈ
దినము గనన్ గనంబడెడి దృప్తజనౌఘదురంతదుష్కృతుల్
మనధరణీతలంబునను మస్తము నేలఁ జొరంగఁ బోయెడిన్. 143

ఉ॥ సూరివరేణ్యులున్ ప్రబల శూరులు దానదయైకవీరు లా
చారవరిష్ఠు లధ్వరవిచారగరిష్ఠులు ధర్మనిష్ఠులున్
సారతపోధనుల్ విమల సత్యసమున్నతు లాత్మవేత్తల
వ్వారిగ నాత్మకీర్తి రుచి భాసిలఁజేసిరి తొల్లి యీభువిన్ 144

సీ॥ ఉత్తమ యుగములో నుత్తమభూమిలో
నుత్తమ జాతిలో నుద్భవించి
పైతృకంబగు మన భవ్యవిజ్ఞానంబు
వర్షాంతరములకు వలసపోవ
రిక్తచిత్తత వగల్ రిక్కలరీతిగ
దీప్తిమాయుగఁ బేర్మి తీసిపోవ
పెరవారు మనదెస వేల్పెట్టిచూపఁగ
స్వప్రయోజన నిష్ఠఁ జాటికొనుచు
తే॥ అన్యత మింద్రియలోలత యులసభావ
మీర్ష్య కపటమ్ము మున్నగు హేయమైన
గుణములకు మంచి నెలవుగాఁ గుదిరియుంటి
మనెద వెనుకకు తిలకింపు డోనో కావా! 145

తే॥ కలియుగాచారవాసనల తొలగిపోక
నేటికిని వెంబడించెడి నిలువనీక
గత కృతయుగంపు ధర్మముల్ కనగ మేను
జలదరించెడి నేడట్లు జరుగవలదె!! . 146

సీ॥ ఏనాటికీ నేల యేకావలంబమై
యొకపల్కు మీదన యొదిగియుండు
నేనాటికీ ప్రజ కెసఁగు నొక్క మతంబు
వేలుపు నొక్కఁడై ప్రేలుమదిని
నేనాటికీసంఘ మేకభాషార్తి
రసమయ జీవితో ల్లసితమగును
నేనాటికీజాతి యీసడింపులుమాని
నిజధర్మవర్తనో న్నిద్రమగును
తే॥ వలయు కొంగ్రొత్త మేల్ సిరి వలపులకును
నాటమైన యుగాది యా నాడె మనకు
ప్రమద మొదవించు మన నాటిపండు వదియు
సకలమానవ మధుర వ సంతమదియు. 147

కం॥ మనగేహము మన గ్రామము
మనదేశము మనది నేల ౹ మన మేల్పడితో
మనవలె నఖిలవసుంధర
మనమందఱ మేలవలయు ౹ మనుకాలముతో. 148

తే॥ ఈదృశోదారబుద్ధియై ౹ యే యొకండు
స్వస్వనియతోరు ధర్మముల్ ౹ జారవిడక
మెలఁగవలయు సమాజంపు ౹ మేలుకొఱకు
నిదియ నేర్వంగ దగువిద్య ౹ మొదట మనకు. 149

తే॥ బాలురాదిగ వృద్ధుల ౹ వఱకు మనకు
నేను, నాయది, యనియెడు ౹ నీచభావ
ముడుగ, మనము మనయది య ౹ నెడు మనమ్ము
పొదలుటయ దారిచూపెడు ౹ ముందువెలుగు. 150

తే॥ అభ్యుదయ భాను డప్పుడ ౹ యస్మదీయ
భూతలమ్మున నుదయించి ౹ పొలుపునింపు
నప్పుడదారిద్ర్య తిమిరంబు ౹ న స్తమించు
నయ్యెడన మించు నస్మన్ము ౹ ఖాబ్జశోభ. 151

కం॥ చల్లనిపొద్దునఁ దోఁచెడి
చల్లనిభావములు, వెలయు ౹ జయశుభదములై
చల్లనిపొద్దగు నియ్యది
చల్లఁగ మనవాంఛితమ్ము ౹ సాగుతమింకఁ. 152

తే॥ ఇమ్మహావాంఛ నెరవేర్ప ౹ నెత్తికొనిన
నలువలంకుల సాయంబు ౹ కలుగవలయు
ప్రభువునకునైన; బంగరు ౹ పళ్ళెమేని
గోడచేరుపు లేకున్నఁ ౹ గుదిరి నిలదు. 153

తే॥ వాయిలేనట్టి జీవాల ౹ వరుసమనము
తెలివిపోనాడి యిడుమలఁ ౹ దినుట మేలె?
జ్ఞానవంతుల విధమిదే ౹ సభ్యులార!
ప్రథితపురుషార్థలాభంబు ౹ పడయవలదె?. 154

తే॥ గోత్రదాటువిధమ్మువఁ గూడి చనక
తగక్రియావంతులై జనుల్ ధర్మనిరతి
నొందురులు కూర్చుకొనుచుండ నొదవు మేలు
ప్రభువునకుఁగాక పరికింపఁ బ్రజకకాదె 155

తే॥ ఏన మున్నాడి యిత్తెరి నెసఁగు విధులు
వెలువరించెదఁ గొన్నిటి వేడ్క వాని
నియ్యకొనిరే ననుష్ఠాన వ్యాద్యములుగ
నిటఁ గృతార్థతఁ గని యడుగిడుచుముందు. 156

వ॥ అనుటయు నాసమయంబున. 157

తే॥ ఇయ్యకొందుము తప్పక యినకులేశ!
యిచ్చనొనరించు వారము వెంతవేని
ననుచుఁ బల్కిరి సభ్యులు హర్షమెసఁగ
మరలఁ బల్కెను మాంధాత మనసు తెలయ. 158

చం॥ ధనము ప్రధానమై, ధరణి ధార్మికవర్తన జారిపోవగాఁ
బొనరిచి బంధుభావమును పూజ్యత మైత్రి గురుత్వ ముద్ధతిన్
బనిచి యధోభువమ్మునకుఁ బర్విడుచున్నది యెల్లవారిపై
జనము విచారహీనమయి సాగుచునున్నది గోత్రదాటుగా. 159

మ॥ మనదేశంబున పల్లెపాళములు గ్రామంబుల్ రుజావాసముల్
కనకెచ్చోటను పారిశుధ్యమును దార్గత్యమ్ము ప్రత్యక్షమా
కనరాదున్నతి చౌర్యజీవనులు పెక్కండ్రియునర్థసిద్ధిన్
గొనముట్టించుట యుగ్రధర్మమగు మాకున్ మీకు శీఘ్రంబుగాన్

ఉ॥ ధర్మము లోకరక్షకము దైవము ధర్మవు నాశ్రయించెదన్
ధర్మమ యెల్లవారలకు తండ్రిత సేవ్యము శీలరక్షకై
ధర్మముతోన భూతములు తప్పకనిల్చిన వెల్లభద్రముల్
ధర్మమొసంగు దానిని ప్రధానముగా నడిపింపగా వలెన్. 161

ఉ॥ ధర్మము మారిఁబోయె నువిధానత దానిసముద్ధరించినన్
శర్మముకల్గు దేశమున సంస్థలు ధర్మము బోధచేయఁగా

నిర్మితిచేయ మేలగును నీమము తప్పక మీర లెల్ల ధ-
ర్మమువీడి సభ్యులయి మార్గనిదర్శకులై చరింపుడీ. 162

తే॥ దేశమున పల్లెలంకులఁ దెలివి వెలయఁ
బట్టణంబులఁ బల్లెలఁ గట్టుతోడ
నిలుపు నాధర్మసంస్థల పలుకుబడిని
వివిధ విద్యా పరిశ్రమల్ విస్తరిల్లు. 163

తే॥ లలితవృత్తు లవెన్నియే నలవడంగ
శిక్షణాలయములు పెక్కు చెలఁగుచుండు
వానిఁ బూరించు బరువు మీ పైన నిలుచు
దేశదేశాల కాదర్శ దీప్తి నిలుఁడు. 164

తే॥ ఈదృశోదార ధర్మ ప్రవృత్తికలన
నసతికాలాన మనసీమ నలముకొనిన
దుఃస్థితులు తుంచుటయె కాక తోరమైన
సిరినిగందుము పొందమ్మ విరి విధాన 165

తే॥ మఱియు నభ్యుదయావహ మహితమతులు
తెల్పిరే నెవ్వరేనియుఁ దీర్పుటకును
సిద్ధ మీహాస్తమనిశము శ్రేయ మాత
మనుచు నాసీనుఁ డయ్యె నా మనుజవిభుడు. 166

తే॥ పారిజాతప్రసూనముల్ పైనఁ జల్లి
నట్టు లమృతంబు ప్రోక్షించి నట్లు ప్రేమ
రసము పైనిండ పూసిన రాణ సమితి
పరవశతఁ దాల్చె పుల్కల ప్రౌఢి నిండ.

ఉ॥ అంత సభాంగణమ్మున మహాశయుఁ డొక్కఁడు లేచి భూవరా!
నింతయు లేదు తెల్పుటకు సొంపుగ తామువచించినట్టి యీ
వుంత ప్రశస్తమైన యుద పూర్వము మీమహితోద్యమంబునం
దెంతయు ధర్మరూపుడగు శ్రీశుడు మీకు జయమ్మొసంగెడిన్.

తే॥ పిదప నాతఁడు కూర్చుండెఁ బెద్దబావ
లంత సుస్థితులై "తథాస్త"నుచుఁ బలికి

మంతరపుఁ బ్రోలోసంగ నా § మనుజవిభుఁడు
వినతుఁడై గొని సమితికి § విడుపుఁ దెలిపె. 169
వ॥ తదనంతరంబ. 170

కోసలాధిపతి నిజదేశంబున పరిచారకులఁబంపి యూరూర
ధర్మసమితుల నెలకొల్పుట.

మ॥ జననాథాగ్రణిశాసనంబున మనీ § షాశాలు లూరూరికిన్
జని భావస్ఫురణంబుగా మధుర సౌ § జన్యంబు సువ్యక్తమై
తనరన్ ధార్మిక సభ్యతానియమముల్ § తద్వర్ధమాన క్రియా
కనదాత్మీయసమాజభద్రగతు లు § త్కంఠారుచుల్ హెచ్చఁగాన్
చం॥ వినిచిరి తజ్జనమ్ముఁ గడు § వేడుక లూరగ తియ్యనీటికిన్
గనుకని నెక్కు మీనుగమి § కైవడి నల్వన మూకమూకలై
మునుకొని సభ్యులై వినిన § బోధల నాచరణానఁ బెట్టుచున్
వెనిచిరి ధర్మసంస్థలను § పెక్కువిధంబుల నాడు నాటికిన్. 172
వ॥ తదీయ ధర్మసంస్థాపరిభావంబున నక్కోసలంబునం దెల్లెడ. 173
మ॥ నవచైతన్యము పొంగినట్లు వెలుగుల్ § నానాముఖస్ఫూర్తిమై
నివతాళించి జగంబునిండిన క్రియన్ § హేమదరివం బెల్లెడన్
బ్రవహింపన్ పావణించినట్లు జన ధ § ర్మవ్యాపృతోత్సాహస
చ్ఛవు లువ్వెత్తుగ రూపుఁదాల్చె నట ను § చ్ఛ్రాయస్థితిన్
సొంపుగాన్. 174

ఉతథ్యుండను మునివరువలన మాంధాత ధర్మప్రభావము తెలియుట

వ॥ ఈరీతి ఫలితపౌరుషుం డగు నాపృథివీపతి యొక్కనాడు బ్రహ్మవి
త్తముండైన యుతథ్యుండను యోగీంద్రు డరుగుదేర నెదురేగి
యథావిధిఁ దోడ్తెచ్చి సముచితసపర్యల సంతృప్తుఁగావించి సుఖా
సనోపవిష్టుండైన యమ్మునివరు నవలోకించి మునీంద్రా! ఎల్లవా
రలకు నందు ధరణీశ్వరులకు దోర్బలంబుకన్న ధర్మబలంబ తద్ద
యుం బెద్దయని నాతలంపు భవదభిప్రాయంబెట్టిదో యెఱుంగ వేడెద
ననుటయు నమ్మునీశ్వరుం డమ్మహీశున కిట్లనియె

తే॥ ధర్మమున లోకములు గెల్చుఁ ✽ దగ నరుండు
ధర్మమున మెచ్చు దైవంబు ✽ ధర్మమునన
భువన వర్తన పోషణ ✽ ములు పొసంగు
ధర్మనిష్ఠ భయాదులు ✽ తలగిపోవు. 176

చం॥ మనుజుని వర్తనమ్ము ఋజు ✽ మార్గమునన్ వెలయించు ధర్మవే
యనువున నాత్మనిష్ఠమును ✽ యట్టులొనర్పఁగఁగాదు రాజశా
సనమున ధర్మవేజగతి ✽ సంస్థవనీయగుణంబు చూడఁ బా
వనమగు ప్రేమ— చాగమును ✽ బంధురశీలము ధర్మవే సుమా.

కం॥ శ్రద్ధా, మైత్రీ. శాంతులు,
సిద్ధదయా, తుష్టి, పుష్టి, ✽ సృష్ట క్రియలున్
బుద్ధి తితిక్షా, మేధలు
శుద్ధ 'హ్రీ' మూర్తి ధర్మ ✽ సుందరపత్నుల్. 178

వ॥ ఏత దేకాదశ కళత్ర సమన్వితుండై ధర్మండెవ్వనికడ వలచినిలుచు
నాతండ నిక్కంపు బలిమికలండు ఆతనికి తిర్యగ్వర్గంబును సాయం
పడు ఆతనిక యీలోకాలలంబెల్ల నేకభోజ్యంబై వెలయు ననిన
నాన్నృపవరుండు సముత్సుకుండై మునీంద్రా! ధర్మంబు మఱియుఁ
దేటపడం దెల్పవే యనుటయు నాయనఘుండు మగుడ నిట్లనియె

చం॥ తరణికులేశ! విన్మ తగ ✽ ధర్మవు రక్షణసేయ నేర్పడెన్
ధరణిధవుం డభీష్టములఁ ✽ దత్పరతన్ భుజియింపఁగాదు నూ
నరవరుఁ డాత్మకృత్యము మ ✽ నంబిడి తీర్చిన దేవభావమున్
బొరయును కానిచో నరక ✽ ముంగను నీచపుజంతువౌఁ జుమీ.

తే॥ అఖిలభూతాళి ధర్మము ✽ నందు నిల్చు
నదియు నిల్చును ధరణీశు ✽ నందు దాని
నప్రమత్తతఁ జరియించి ✽ యాచరింపఁ
జేయునాతండె నిక్కంపు ✽ క్షితిధవుండు. 181

తే॥ స్వస్వధర్మపరుండగు ✽ జనున కీప్సి
తార్థమెల్లను సిద్ధించు ✽ నట్టులగుట

తాదృశ శుభాస్పదంబగు ధర్మ మఖిల
జనులకాశ్రయణీయ ము త్సాహకలన. 182

తే॥ ధర్మముత్పన్నమగుట యు ధర్మవృద్ధి
యగుట యేనాఁడు పౌనరు న హార్నిశంబు
భయముకలుగును ప్రజలకు పాపరూప
మగు నధర్మము మించిన నదుడుకాదె. 183

మ॥ నరలోకేశు డధర్మము న్నిలుపకు న్నఁ దక్కనే ధాత్రి స
త్పురుష శ్రేణికిఁ బ్రాణ వేశ్మ పశుభూ ములో వత్నులున్
విత్తముల్
జరుగన్నేరవు దేవ పిత్రతిథి పూ జ్యప్రాజ్య పూజావిధుల్
చరణీయవ్రతముల్ పవిత్రసవన స్వాధ్యాయముల్ మానెడిన్.184

తే॥ ఐహికాముష్మిక ఫలంబు లాత్మఁ గోరి
మున్ను నెలకొల్పి రేలికఁ బుణ్యమూర్తు
లగు మహర్షులు తదపేక్ష యావటిల్ల
ధర్మలోపంబు కాకుండ ధరణినేలు, 185

వ॥ అనివెండియు నమ్మహాత్ముం డిట్లనియె. 186

మ॥ వినుధర్మంబున శుద్ధవస్థలము పృ థ్వీ దేవత ల్గాన త
ద్ఘనులన్ తృప్తుల మున్నచేయవలయున్ జర్పింపఁ గాదా విరో
చనపుత్త్రుండు పదచ్యుతుక్షితిసురా సంతుష్టిచేఁ బొందె ధ
ర్మనరున్ శ్రీకినిగర్లై దర్పమది యు న్మాలించు సర్వస్వమున్,

తే॥ మునులు వేల్పులు నెవ్వరే మనసునందు
చోటొసంగిన నాశ్రయా శుండువోలె
నంటఁగాల్చును దర్పమా త్మాశ్రయమ్ము
దాని ధరణీశు డంతికిఁ దార్పరాదు. 188

సీ॥ దర్పితుఁ డైనట్టి ధరణీతలేందుండు
పరదారగమనాది పాపకృతులఁ
బొనరించు నద్దానఁ బొసఁగు ననావృష్టి
భంటవలంతి ని ష్ఫలతఁ జెందు

ప్రజలకు దైన్యంబు | వాటిల్లు రోగము
లలమును బలతేజ | ములు తొలంగు
సైన్యంబునకు ఘోర | శాత్రవపీడచే
దైన్యంబు కలుగును | ధరణిధవుడు
తే॥ దర్పమును లెస్స విడనాడి | ధర్మయుక్తుఁ
డైన సంతతి బాంధవు | లలర వెలయుఁ
బ్రజల యనురాగ మడరును | పాడిపంట
లతిశయించును సైన్యంబు | నతిశయించు. 189

సీ॥ రజకుడు మలిన వ | స్త్రంబుల శోధించి
పరిశుద్ధములు చేయు | భంగి ప్రభువు
వర్ణచతుష్టయ | ప్రజలను క్రమముగ
తమతమ నియత ప | ద్ధతుల నడువ
శోధించుచును పరి | శుద్ధాత్ములను జేయ
వలయును సువిధాన | కలితుఁ డగుచు
సకలధర్మములకు | సంరక్షకుం డౌట
యుగరూపుఁడయి నృపుం | డొప్పుచుండు

తే॥ నప్రమత్తుండవై నీవు | నన్యదోష
మాత్మదోషంబు నరయుచు | నన్యుల కది
యెఱుకపడనీక ధర్మమే | మఱక జనుల
జాగరూకుడవై యేలు | జనవరేణ్య 190

తే॥ ఇటుల వచియించి యమ్మౌని | యేగె నృపతి
తానొనర్చెడి కార్యముల్ | తనమనంబు
యోగివాఙ్నికషణమున | నొరసిచూచి
యుక్తమైయున్న సంతృప్తి | నొందకుండె. 191

వ॥ అవల నమ్మహీశుండు 192

తే॥ ధర్మసమితులు కోసల | ధరణిలోన
మూలమూలలఁ బ్రతిపద | ముఖరములుగ

నెలకొలిపి యందుఁ గూర్చుచు వలయువాని
నిరతిశయ సౌఖ్యసంపదల్ నెఱపెఁ బ్రజకు. 193

తే॥ పొరుగు నేలల ప్రజలకు పొవకుండ
తా ననుభవించు సౌఖ్యముల్ తలచి యతఁడు
తనమనంబును సంకుచితంబ యనుచు
రోతపడి ముందుకర్జంబు రోయుచుండె. 194

వ॥ అనినవిని జనమేజయుండు సముత్సుకుండై మునీంద్రా! మాంధాత్ర మహీపతి కేకరాత్రింబువన సరత్నాకరపత్తనమగు నీవసుధా తలంబెల్ల వశమయ్యె నందు రదెట్టులొనగూడె? తద్విషయంబు విశయరహితంబుగా తెల్పవే యని కోరుటయు. 195

శా॥ శ్రీమన్మంజుల వక్ష! మన్నయన రోచిః పూర్ణ దివ్యాకృతీ!
భూమధ్యాన నివిష్టమద్హృదయ సంపూర్ణామలానందశం
దా! మద్వాఙ్మయ పుష్కలామృతరస న్యాసా! మదుద్యత్కృతి
స్థేమప్రాణ! మదీయభవ్యనియతీ; శేషాద్రి పద్మావతీ!!

వ॥ అవధరింపుము. వెండియు వైశంపాయనుండు జనమేజయున కిట్లు వచింపఁ దొడంగె. 197

తే॥ రసికజనమాలి మాంధాత్ర రాజముఖ్యుఁ
డాది నక్కోసల మహీలతాంగి నట్లు
సింగరింపంగ దక్కన క్షితిలతాంగి
మేలు ప్రొద్దులకయి, లోన మిసుకఁ జొచ్చె. 198

ప్రక్క దేశముల ప్రజాప్రముఖులు కోసలజనపదంబుల భాగ్యోన్నతిని
తత్కాలరాజేశుని కూలంకష ధార్మికతా ప్రశస్తిని మెచ్చుచు
నాత్మీయోన్నతికి హస్తావలంబనమొసంగ నాఱేనికి విన్నవించుట

తే॥ పెరల పరగడలందునఁ బెద్దలెల్లఁ
గూడినపుడెల్ల కోసల కువలయేశు
ధర్మచరితంబు తత్సీమ ధన్యగతులు
చెప్పికొనియెడి పరిపాటి యొప్పె నిట్లు. 199

చం॥ వినుడు మహీతలంబునకు వేల్పులసీమవిధాన కోసలం
బనుపమభోగభాగ్య మహిమాస్పదమై తనరారుచున్న ద
య్యనిమిష లోకపాలక పురాధిక సుందరమై యయోధ్యయున్
దనరెడిఁ దత్పుజల్ నిరతి దర్శన యోగ్యులు వేల్పు
లట్టులన్. 200

ఉ॥ వేలుపులందు మేటియగు విష్ణువు కై వడి సత్యసంపదన్
పాలనలోలతాలలిత పావన ధర్మగుణ ప్రదీప్తితో
నేలికలందు సాటువకు నేర్పడె నా యువనాశ్వసూను డ
ప్పోలిక కాలకాలమునఁ బొల్పయియుండెడు దర్పణాకృతిన్. 201

తే॥ ధర్మ మా పుణ్యశీలు నుదారజపము
ధర్మ మా భక్తియోగి నిధ్యానమూర్తి
ధర్మ మా కర్మియర్చావతారమూర్తి
ధర్మ మా సద్గృహస్థుని ధనము బ్రదుకు. 202

వ॥ మఱియు నా కోసల దేశంబున. 203

శా॥ ఊరూరన్ పఠనాలయమ్ములును శాస్త్రోద్బోధనా సంస్థలున్
పారిశ్రామిక సత్కళాసదనముల్ వ్యాపార సంకేత వి
ద్యారమ్యాలయముల్ నవీనగుణ సత్త్వాశోధనావాసముల్
దారిద్ర్యాబ్ధి తలన్ హరింప శుభసంధానమ్ములై వర్ధిలెన్ 204

తే॥ అటకుటుంబములోనుండు నన్నదమ్ము
లక్కసెల్లెండ్రు సేవకులాదిగాగ
నెల్లవారలు చదువుల జల్లులరయ
నిపుణమతులును వినయంపు నెలవులౌర!. 205

మ॥ విషయోద్వృత్తియడంగె ధార్మికత వ్యాప్తిం జెందుటన్
లోవెలిన్

తృషవర్ధిల్లె సమాజభద్రతకు, నాత్మీయత్వ మేపారుటన్
ముషితంబయ్యె నిజార్థనిష్ఠ మది సంపూర్ణత్వ మింపొందుటన్
సుషిరావాసము గాంచె భేదతమముల్ శోభిల్ల నైక్య
ప్రభల్. 206

తే॥ దస్యునికరాల యాట పీ స్థలములెల్ల
బట్టబయలయి యూరులఁ బరిఢవిల్లె
దస్యునికరంబు పౌరప దంబునొంది
నాగరకులైరి చదువుల నైపుణమున. 207

చం॥ విపులమహోచ్చ సేతుగతి విస్తృతగర్భ మహాతరంగిణీ
సుపరిచితాంబుపూరములు, చూడ్కికి నెల్లలుకానరాని యా
విపులతటాకవాహినులు, వృత్తమనోజ్ఞ మహాంధువాపికా
తపితరుజోదవేణికలు, సల్పెను సార్గముగాఁగ తద్భువిన్. 208

తే॥ గృహగృహమ్మున పరిశ్రమా కీర్ణమగుచు
భోగ్యభోగోపకరణప్ర పూర్ణమగుటఁ
దాను తనపైని నిల్చి ని ధానమట్లు
వెరలదోసిలి నింప నా పృథ్వి నిలచె. 209

తే॥ పౌరుషమ్మును దైవమ్ముఁ గారణములు
పౌరుషముఁగూడి దైవమ్ము ఫలమొసంగు
వానకురిసిన మాత్రాన పంటనొక్కొ?
దున్నకయ నేల! జతనంబు తొలుతవలయు, 210

తే॥ పంటవలతిని పచ్చని పైఁడిపూలు
లలిని పూయించు పురుషల లాము లిలను
నూరి, శూరుడు, సేవించు సొబగుకలఁడు
మావురేసుంతు పిరిచేఁ బొదలు జగము. 211

వ॥ అందు నీకోసల ధరాధ్యక్షుండు—. 212

శా॥ వైదుష్యంబును శౌర్యసంపదయు సే వా కౌశలం బేర్పడన్
స్వాదిష్టాచరణ ప్రచారవిదిత క్ష్మాపాలనప్రక్రియా
హ్లాదస్ఫారసమాజసేవలు సము ల్లాసస్థితిన్ సల్పి యా
మోదంబెల్లెడఁ జర్వఁగా ధరణిచేఁ బూయించి పండించె హై
మాదర్శప్రసవాళి, రత్నఫలముల్ హాయ్‌హాయి నా
వేల్పులున్. 213

తే॥ ఆ నృపాలుఁడు ప్రభువుగా – నలరునట్టి
తత్ప్రజల చాలధన్యు లీ – ధరణిలోన
మనకు మన దేశమునకు త – న్మహితగతియు
నబ్బునే! తాదృశోన్నతి – నందగలమె! 214

మ॥ వలుతోయంబుల నిట్లు కూటముల సం – భాషించి తద్వైభవం
బులకాశించి నిజావనీశులు తమున్ – మాంధాతృన్మ్రై దేశమున్
వెలయన్ జేయకయుంట నూత్నగతులన్; – వేసారి పెక్కండ్లుగా
తలపుల్ తీరకయుండఁ దత్ప్రజలు మాం – ధాతృ ప్రియప్రేప్సులై

చం॥ "రవికుల వార్ధిచంద్ర! సుచి – రంబుగ మోడ్పడియున్న మమ్ము
క్రొం
జివురులు మోసులెత్త నవ – జీవన తేజము లుల్లసిల్లఁగాఁ
జవి యొలికించి మా నగులు – శాంతముగా భవదీయసుప్రజా
ప్రవితతితుల్యసుస్థితికిఁ – బాల్పడఁ జేయవె ధార్మికాగ్రణీ!" 216

వ॥ అని యార్తితో పలువురుప్రముఖులు బహుసీమలనుండి పలు సారులు విన్నవించుటయు— 217

### మాంధాత భారతవర్షంబు నల్గడల ధర్మప్రచారకుల బంపి ధర్మసమితులు నెలకొల్పుట

మ॥ తఱితో బీజము నావపించు కృషికో – దారుండు మాంధాతయున్
నెఱియుంజిత్తము తత్ప్రజానికర సు – స్నేహంబునం జయ్యనన్
పఱగన్ బట్వర శేముషీఘనుల వా – క్ప్రౌఢక్రియా దక్షులన్
నెఱిరావించి వచించె వారలకు హృ – న్నీరేజముల్ విప్పఁగాన్.

చం॥ అరయుగ నాదినుండి తగ – నందఱు మీర లుదారులార! యే
యరమరలేక యేకముగ – నాదుకొనన్ మన దేశమందునన్
బరులకుఁ జేయిచాపు పని – పట్టక దేనికినే సుఖాన నె
ల్లరము చెలంగుచుంటిమి స – లక్షణ మంతయు మోదమయ్యెడిన్

ఉ॥ మోదము కాని యియ్యది య – పూర్వము నేటికి నెన్నఁ జేకతా
పాదకసోదరత్వ ఘన – బాంధవ మొప్పఁగఁ బ్రక్కవారికిన్

ఖేదము లూడ్చి తుల్యసుఖ ఖేలనముం సమకూర్చ నేర్తుమా
మోదము నాడు పూర్ణమగు బుద్ధిఁజూడ నిదెంత పాటియా. 220

తే॥ విశ్వమానవ సౌభ్రాత్ర విధము తెలియ
నెల్లరకు నెల్లరౌ నట్టు లెల్ల వారిఁ
దీర్చి మనచేత లెప్ప ప్రతీతము లగు
నపుడె ధన్యతఁ బరిపూర్ణ మగు ముదంబు.

ఉ॥ మానవజన్మ ముత్తమము మానుగ దాన వివేకశీలశా
లీనవపూర్వచోగుణ బలిష్ఠులమై నిజయోగరక్షణా
ధానమునంద మగ్నులయి ధన్యులమం చెదఁ దృప్తి పొందుచుం
గానని తోడిమానవుల కష్టములం గనకుంట పాడియే. 222

చం॥ ప్రతిదిన మన్యదేశముల బాంధవు లాత్మబృహద్దరిద్రతా
స్థితులను దెల్పుచుం జనుట తెల్లము మీకును; మున్న యేము స
న్మతిని తదీయదైన్యదశ మానగ మేలొనగూడ పూనికం
జతనము సల్పుచుండుట విచారకరం బిఁక వేగిరంబునం. 223

తే. కార్య శేష మశేషమ్ము గా నొనర్పఁ
బరికరమ్మును బంధివ వలయు మనము
నిందరము నింక నొకసారి యెలమితోడ
ననుడు నట్టుల యగుఁగాక యనిరి వారు. 224

వ॥ అనిన వెండియు నప్పురుషోత్తము డిట్లనియె. 225

తే. పెద్దలైనట్టి వసుమతీ ప్రియుల నిపుడు
దిద్దఁబోవుట మిక్కిలి తెలివిలేమి
గ్రుడ్డుచను దెంచి పిల్లను కోడిగమ్మ
లాడినట్లగు నెద కది యగ్గి పెట్టు. 226

తే॥ బలము ముందొడ్డి నడచిన బాట నెల్ల
ముండ్ల యెదురగు వాని నూర్మలపఱుప
వాయిలేనట్టి ప్రజలన బలికొనంగ
వలసివచ్చును విషమంపు ఫలముకాదె. 227

చం. జయము లభించినన్ మనకు శస్త్రము కాదు దురమ్మునన్ బ్రజా
ప్రియమగు దేశమున్ జెఱుచు సంపదలెల్లను జారిపోయెడిన్
నయముతొలంగు శ్రేయము నొసర్వగఁ గోరెడిమాకుఁ దత్ప్రజా
చయపు వినాశకత్వమగు సంకటమా నదసహ్యమారయన్. 228

చం॥ మొదల బహుప్రకారముల మూఢత జాగరితంబు దత్ప్రజా
హృదయములందు దాని సమయింపఁగఁజాలు మహోపదేశముల్
పొదలకయుంట నంగపరిపూర్ణత కల్గియు నంగహీను ల
ట్లొదిగి మెలంగుచుండిరి నిజోన్నతిఁ గానక వారు దుర్దశన్. 229

తే॥ ప్రజల యజ్ఞాన తిమిరంబు వాయ మనము
సుప్రబోధంబు సల్పుట చొక్కమైన
కర్జ మిప్పుడు నడుములు కట్టి మీరు
ధర్మకేతనములు పూని తరలవలయు. 230

తే॥ ఆది మన మూనినట్టి యుదార ధర్మ
పద్ధతులతోడ సమితులఁ బరగనిల్పి
పల్లెపల్లెను వెలయంగఁ బాటుపడుఁడు
మీకు మారూపు తోడయి మెలఁగుచుండు. 231

తే. ధర్మరతులకు భీతియు దరికిరాదు
జయము చేతులనుండు నిస్సంశయంబు
కనుఁడటంచన వారలే కముగ ననిరి
దేవ! సంసిద్ధులము మీ నిదేశమునకు. 232

తే॥ అనుడు నవ్వారి యుబలాట మునకు మెచ్చి
సముచితాదర సత్కార సమయములను
సలిపి నృపతియు సభకు విశ్రాంతి తెలిపె
భాగ్యశాలి తలంపులే భాగ్యనిధులు. 233

తే॥ సమితి పాకొన్న మాంధాతృ జనవరేణ్యు
నమల వాఙ్మయమయ్యె నహర్ముఖంబు
ప్రజకు; నిజతంత్రవసుమతీ పాలకులను
నయ్యెను నిశాముఖమ్మది యాత్మలడఁగ. 234

మ॥ అటు మాంధాతృమహీధరప్రసృత ధ § ర్మాంచత్పయోవాహినీ
చటులోత్సారము, పాయపాయలుగ ప్ర § స్థానించి సర్వాంకపా
ర్భటి నానావిషయంబులం దవిలి న § వ్యస్ఫూర్తి సంధించె నం
తట నానాజన సస్యసంతతికి నం § టన్ మేటికిన్ గోటిగాన్. 235

కం॥ తాదృశ ధర్మక్షీరము
మోదంబునఁ ద్రావి ప్రజలు § పుష్కలతనులై
ఖేదము వాదములెల్లను
ఛేదంబులతోడఁ జనగఁ § గృతమతు లగుచున్. 236

ఉ॥ దారులు వేరువేరయియు § ధర్మపథంబున నైక్యమొందగా
వేరిమి నెట్టి దూరముగ § వేయివిధాల సమాజభద్రతన్
గూరుప నొండొరుల్ పెరిమఁ § గూడఁగఁ జొచ్చిరి కట్టుబాటుమై
దారులుపెట్టి కెల్లరును § దుగ్ధజలంబులభంగి సన్నుటన్. 237

శా॥ చాతుర్వర్ణ్యపు మూలతత్త్వములు సం § స్థాపించి గర్తమ్మునన్
జాతిన్ బేడున నిల్పి ధర్మము సను § ష్ఠానమ్మునన్ బాయుగా
నీతుల్ గుప్పు సమాజముల్ నవగుణో § న్మేషంబునన్ మార్పడెన్
కాతంత్రిమ్ములు మూఢపద్ధతు లనా § కారంబులై పోవఁగాన్.

ఉ॥ తల్లికి నొక్కదైవతము తండ్రికి § వేఱొకదైవతోత్తముం
డిల్లున కొక్కవేల్పు తని § యింపఁగఁ బుత్త్రిన కొక్కవేల్పుగాఁ
జెల్లెడి ప్రాఁతచట్టములు § శీర్ణములై చనె సర్వజాతులం
దెల్లర కొక్కఁడే శుభము § లిచ్చెడివేల్పు మతమ్మనొక్కఁడే

ఉ॥ వేదములప్పజెప్ప నర § విందభవుం డొకఁ డెల్లశాస్త్రముల్
వాదముచేసి గెల్వఁగల § వాఁ డొకఁ డన్నిపురాణ సంహితల్
మోదముతో వచింపఁగల § పూర్ణుఁ డొకం డిఁక సర్వవైద్య సం
పాదిత కీర్తియొక్కఁ డిలు § పట్టి కనుంగొన నంద అందతే. 340

శా॥ గ్రామగ్రామమునం గుటుంబములు సం § ఖ్యావన్మహా సంస్థలై
గీముల్ మంజులశిల్పసంస్కృతికళా § కేంద్రీ కృతార్థమ్ములై

భూముల్ తోటల దొడ్డ సస్యముల సం ॥ భూతిన్ స్ఫురన్మూర్తులై
సీమల్ యంత్రి పరిశ్రమాలయములై ॥ చెన్నొందెఁ జిత్రమ్ముగా. 241

వ॥ ఇప్పగిది భారతంబున బ్రజలు నవనవాభ్యుదయపరంపరాపరితుష్ట మానసులై ధర్మపతాకచ్ఛాయ విశ్రాంతి చెందుచుండ తృప్తుండుగాక విశ్వమానవాభ్యుదయ సంపాదనాసమున్మిషితచిత్తుం డగు యువనాశ్వపుత్త్రుండు మఱియు. 242

భారతేతర వర్షంబులందు యువనాశ్వనందనుండు
ధర్మసమితులు నిలుపుట

తే॥ భారతేతర వర్షాల ॥ ప్రజలలోనఁ
బంక్తిభేదంబు లేకుండ ॥ భావగతుల
నమలధర్మంబు సౌభ్రాత్రి ॥ మడరఁజేయ
ధర్మసమితుల నెల్లెడఁ దనరనిల్పె. 243

ఆ॥వె॥ పుడమిదొరలతోడఁ బోరులు కాకుండ
మంచితనముతోడ ॥ మంతనములు
సలిపి సకలజనులు ॥ సమ్మతిసలుపంగ
ధర్మబోధఁ జేసె ॥ తరణికులుఁడు. 244

తే॥ పిన్నలకుఁ దెల్పె సముదాయ ॥ విధి నతండు
పెద్దలకుఁ దెల్పె ప్రత్యేక ॥ విధిని ధర్మ
విధుల ఫలసిద్ధియగుదాక ॥ విడకదీక్ష
యత్నశాలి కసాధ్యమై ॥ యడర దెదియు. 245

చం॥ అతుల ఫలానుభూతియగు ॥ నంతకు లేశము వీడకుండఁ దాఁ
బటువిధి సర్వవస్తువులు ॥ బంగరుగా పచరించె నవ్య సం
ఘటనలు సల్పి మానవను ॥ ఖంబున కేర్పడ శిల్పమూర్తియై
భటపరివారమై కళలు ॥ పాణిమెలంగఁగఁ బౌరుషంబునన్. 246

మ॥ తన పాండిత్యము నించ మర్త్యతతికే ॥ దారాళి విజ్ఞాన స
ద్ఘనబీజంబులు చల్లి కొల్లలుగ బం ॥ గారంపు ధాన్యోత్కరం

బును పండించి దరిద్రదేవతకుఁ ద । వ్వఁగఁ బెట్టి దూరంబుగా
జన శాసించి రమాసతీమణికి వే । శ్మంబై ధరాచక్రముఁ
దనరంజేసెను మేటిపంటదొర । కూ ం । ధాత్రిందు సామాన్యుఁడే.

మ॥ తమ కీయున్నతిఁ గూర్చ్చ నాన్యవవ । తంబుం బ్రశంసించుచుఁ
సమితిప్రక్రమమందు సభ్యులు "మహా । సంస్కర్త" "సద్దేశికుం"
"డమలాచార్యవరుండు" "దేవసముడు" । ద్యన్మూర్తిఁ గై కొన్న ధ
ర్మమటంచుఁ గృహగోష్ఠిఁ బేర్కొనెడి వా । రల్ గ్రామ
సీమావళిన్. 248

తే॥ మఱియుఁ దత్ప్రజ వేడ్క నా । మాన్యచరిత
పుణ్యనామాక్షరంబులు । ముద్దుగాఁగ
గేహ తోరణ పట్టికా । కేతనముల
మణిసువర్ణమయంబుగా । మలచువారు. 249

తే॥ జనపదములందు పురముల । సంస్థలందు
నెల్లకడ నెందు కేనియు । నెన్నఁడేని
తన్నృపాలకు నాదర్శ । ధర్మకలన
బేర్కొననియట్టి మనుజుని । పేరువినము. 250

వ॥ ఆతరుణంబున. 251

తే॥ తమదురాష్ట్రమ్ము లీరీతి । ధర్మరతిని
శ్రమము లేకుండఁ దమకుఁ బ్ర । శాంతగతిని
నడచుచుండఁగఁ గొందఱు । పుడమిఱేండ్లు
కూర్కచెందుచు గద్దెల । గూరుచుండ్రి. 252

వ॥ మఱియుఁ గొన్ని యెడలఁ గొందఱు. 253

మ॥ దివటీముందర దీపముల్పగిది ని । స్తేజస్కులై భూపతుల్
ధ్రువమార్గ్యంచిత ధార్మికత్వఘనవి । ద్యుద్దీప్తి దీపించు న
య్యవనాశ్యాత్మజు మోల రిక్తులయి న । వ్యోత్సాహసత్వక్రియా
జవముల్లేక రొదింగియుండి రెద సీ । ర్ష్యావహ్ని చే గ్రుగ్గుచుఁ.

వ॥ అట్టియెడ— 255

మాంధాత నిజకటకంబున ప్రథమ విశ్వధార్మిక మహాజనసభ జరుపుట

సీ॥ విశ్వధారుణిలోని వివిధజాతిజనాళి
కలియుచుండుట మేలు కలుగునొకట
నన్యోన్యవర్తన లాచారతంత్రముల్
వేషభాషలు విద్య వృత్తికళలు
కృషియు బేహారంపు విషయముల్ మున్నగా
సకలవృత్తంబులు ప్రకటముగను
తెలియంగ ననువగు పొలియును భేదముల్
స్నేహంబు వర్ధిల్లు జీవితమ్ము

తే॥ నవ్యవృత్తంబులం బొల్చు నలువుమిగులు
ననుచుం జింతించి యువనాశ్వ తనయుం డెలమి
నాత్మకటకాన తొలుత తా నఖిలదేశ
ధర్మసభ్యమహాసభ తనరంగూర్చె. 256

తే॥ భువనమంగళ కృత్తవః పూజ్యమూర్తి
యైన భృగుమాని యధ్యక్షు డయ్యె నందు
తన్మహాసభ లలి సువి ధానమునను
జరిగె మాంధాతృ పర్యవే క్షణము వెలయు. 257

తే॥ తన్మహాసభ రెండవ తడవ కాన్య
కుబ్జపురమునం గూడెను కుతుకమడర
నలప్రతిష్ఠాన పురవరా ధ్యక్షుండైన
యమ్మహాభాము డధ్యక్షుం డయ్యె నపుడు. 258

చం॥ దినదినవర్ధమానశుభ తేజమునన్ విలసిల్లు నమ్మహా
జనసభ యౌవనాశ్వనృప సత్తమ సంకలితాధిపత్యమం
దున జరిగెన్ సముజ్జ్వల మనోహర దృశ్య గభీర చర్చ లిం
పొనరం గుశస్థలీపురిని ముద్దుగ మూడవసారి పేర్మితో. 259

వ॥ అంత నాలవసారి. 260

తే॥ వివిధజాతీయ మానవ విశ్వభాగ
ధేయదివ్యన్మహాసభ తీర్థచరిత

మహితశశిబిందువాల్లభ్య విహితగతిని
జరిగె మాహిష్మతీపురి సురలు పొగడ. 261

నాల్గవమహాసభ సకల మానవలోకమునకు
నేకైక పాలకుని వరింప నిర్ణయించుట.

సీ॥ విశ్వమానవకోటి విను తైకమత్యంబు
రూపుఁ గైకొన్నట్టి రూపుకాఁగ
భాసిల్లు నాసభఁ బల్వురు సాంఘిక
వ్యవహార ధర్మముల్ వరుసఁ దెలిపి
ధరణి నల్గడలందుఁ బరగు పాలన ధర్మ
గతు లానుపానులుఁ గలయవలుక
సంయమీంద్రు డొకండు సంతసమ్మున లేచి
సువిచారముగ నంత సారిదిఁ బల్కె

తే॥ హస్తిపాదంపుఁ బరిమితి నఖిలజంతు
పాదపరిమితు లొదిగెడు భంగి సర్వ
ధర్మము లొదుంగు క్షత్రియ ధర్మమునను
క్షత్రియుఁడు పూన్కి ధర్మము జారకుండ. 262

తే॥ ధరణి శాసింపవలె ధర్మ నిరతి ధరకు
శాసకులు పెక్కురైన వి కాన ముదుగు
నెలత పదుగురు పుత్త్రుల నెగడు గాని
నెగడ నేరదు భర్త ల నేకులైన. 263

కం॥ బహునాయకతోపప్లవ
మహారహ మగ్గలముకాఁగ నవనీసతికిన్
బహిరంత ర్వ్యావృత్తమ్ములు
వహిచెడ దౌర్గత్యహతులు వావిరిఁ దాకెన్. 264

ఉ॥ దీపముక్రింద సాంద్రముగ తేరిన చీకటి తెట్టెవోలె నా
టోపముతో నధర్మము ప టుత్వము మించగ నేడునున్నదీ
దీపిత పుణ్యభూమి నవ ధీరణసల్పుచు రాజవర్గపుం
బ్రాపున నేకతాస్థితికి భద్రితకున్ బగయై ప్రశాంతికిన్ 265

తే॥ అయ్యధర్మతమంబు ని - రాశ్రయముగ
జాటుమాటులు తొలగించి - సత్యధర్మ
భానుకిరణాళి నెల్లెడఁ - బర్వఁజేయు
మహితచరితైకపాలన - మనకు వలయు. 266

వ॥ మఱియును. 267

మ॥ సమరోదాత్త సమాజవిశ్వము ప్రజా - సంఘుతమా భృద్బహు
త్వమునన్ శీర్ణము గాక సుస్థిరత ని - ల్వన్ సుస్థిరాధ్యక్షు స
త్తముఁ డాత్మస్థితినుండ మేలు కనుఁడిం - తన్ సభ్య లోకాత్ములై
తమవిజ్ఞానము మానవాలయము నం - దా దీపమై శోభిలన్. 268

తే॥ అట్టి యేకైకపాలన - మగ్ర్య లక్ష్య
మదియు సిద్ధింప శాంతియు - హాయి కలుగు
సర్వమానవతతి నిర్వి - చారముగను
నిశ్చలానందపూర్ణమై - నెగడు నపుడె. 269

వ॥ కావున. 270

మ॥ కలవైవిధ్యము లెల్ల రూపఱిన సం - స్కారంబు తెల్లంబుగా
వలపుంగొల్పెడు నైకమత్య మది రూ - పవ్యాపృతిం బొంది వ
ట్టులుసీనీసంసద శేష మొక్కనుడి నై - ష్ఠుర్యంబు లెక్కింపక
వలుకుం జేకొనుగాక యియ్యదన వి - శ్వశ్రేయముం గోర్కెమై. 271

తే॥ అనుచు వాక్రుచ్చి కూర్చుండె - సమ్మహర్షి
వరుడు వరుసగ ప్రతినిధుల్ - ప్రభువు లెలమిఁ
బలుకు రామాటనే యొత్తి - పల్కి రంత
సమ్మహాసభ యద్దాని - నాదరించె. 272

కం॥ మునివరుఁ డెత్తిన నిర్ణయ
మనుమోదితమాట దాని - నగ్రిమ సభలో
ననువుగ నాచరణముఁ దే
ననుమతమును వెలువరించె - నాసదము రహిన్. 273

తే॥ వెండియును సమ్మహాసభ - విశ్వమాన్య
మగు ప్రతిష్ఠానపురి యువ - నాశ్వతనయు

నాధిపత్యానఁగూడ సి ౹ ద్ధాంత మయ్యె
సభయు విశ్రాంతిఁ గొనె ౹ జయస్వనము లడర. 274

వ॥ పిమ్మట నమ్మరుసటిరోజు మొదలుగా సర్వసర్వంసహాచక్రంబు
నలుకెలంకుల. 275

తే॥ వలయు నేకాధిపత్య మీ ౹ యిలకు నెల్ల
వలదు బహునాయకత్వమ్ము ౹ వల దటంచు
ముక్తకంఠాన తత్సభో ౹ న్ముక్తమైన
భూరిఘోషంబు లూరూర ౹ భోరుకొల్పె. 276

వ॥ మఱియ నద్దాని కనువల్లవిగా 277

తే॥ మాన్యచరితుండు మాంధాతృ ౹ మహివరుండు
మూఁడులోకాల నొక్కటి ౹ మోయఁజాలు
ఘనభుజుడు సర్వవిజ్ఞాని ౹ కార్యవేది
రాజులకు వన్నె పెట్టు మా ౹ ర్గాండు డిలను. 278

చం॥ అమృతమయాత్ముఁ డల్ల యువ ౹ నాశ్వతనూజుడు రూపుఁ గొన్న శీ
లము జనతానురంజనక ౹ లాచతురుం డికఁ బేరుఁగన్న వి
క్రమమున లోకరక్షణాభ ౹ రమ్మున వంకజలోచనుండు ని
క్కమ కడుధన్య మయ్యెడిని ౹ కాశ్యపియెల్లఁ దదేకపాలన౯. 279

వ॥ అనుచు గ్రామనగరంబుల ధర్మసమితు లశోకసలకాంతుని కీర్తిం
పఁజొచ్చె మఱియు తాదృశయుదాత్తమధురగుణకీర్తనం బయ్యెడ.

తే॥ ప్రజకు దుగ్ధముత్రావిన ౹ పటిమఁ గూర్చె
భూవిభుల కావత్రావిన ౹ యావిఁగొలిపె
క్షుధితులకు పాలుకలిగించు ౹ సుష్టుపుష్టి
జ్వరితునకు పాలు సలుపును ౹ సంకటమ్ము 281

తే॥ ధర్మసంస్థాపనాసమ ౹ ర్థత ముఖాన
గొండ్లిసల్పఁగ చిత్తసం ౹ క్షోభ మడర
ధర్మరతులైన ప్రజలపై ౹ దాడివెడలి
యవనిపతులప్డు పల్వుర ౹ హుంకరించి 282

తే॥ సమితులకు శాంతిచెప్పించి ౹ సభ్యనికర
మాత్మసీమల దాటించి ౹ యాస్తిపాస్తు
లాత్మవశములు గావించి ౹ కొడుకరిచి
ప్రజలుఁ బురిఁగొన్న కోసానఁ ౹ బ్రభులు తలఁక 283

ఉ॥ వెండియు సభ్యతాపటిమ ౹ వేయిమడుంగులు చూపి ధర్మపుం
దండును బెంచి శాంతిమయ ౹ తంత్రమునన్ నిజపారతంత్ర్యమున్
జెండి ప్రభుత్వము న్నయము ౹ చేతల లోఁగొని ధర్మదేవతా
మండనముం బొనర్చె నుస ౹ మాహితులై రట సీమసీమలన్. 284

తే॥ కంటె జనమేజయనృపాల ౹ కాలమహిమ!
కలదె మున్నన్నఁడేని యీ ౹ క్రాంతిజగతి?
వారె ప్రజలును ప్రభువులు ౹ వారె సీమ
లవియె యీదృశ పరిణతి ౹ యబ్బెనెట్లు?. 285

తే॥ తండ తండములై ప్రజల్ ౹ తమకుఁ దామె
ధర్మవన్నంబు లొక్కట ౹ దారియొకటఁ
గాక యెల్లెడ నేకతా ౹ క్రాంతికలుగ
మొనసి వర్తింప కల్గునే ౹ పొచ్చెమొందు ? 286

తే॥ రోగియును పాలుకోరెను ౹ రోగమడగ
వెజ్జుకోరెను పాలను ౹ సజ్జుఁ గొలువ
మేలుపాలను వాంఛించి ౹ మిఱుకు ప్రజకు
పాలవైద్యుడు మాంధాత ౹ పరఁగెఁ దక్క. 287

వ॥ ఇట్లు సకలధరావలయంబు నేకాధిపత్యమ్మునకు సుముఖంబుగాఁ జేయు తచ్ఛుభసమయంబున నియజనాభవర్షంబున ప్రాచ్యభూమిని గయుండును అంగరాజును, దక్షిణమ్మున నాంధ్రాధిపతి యసితుండును, పశ్చిమంబున సింధుమహీపతి బృహద్రథుండును, మధ్యోత్తరంబున మరుత్తమహీపతియు, పశ్చిమోత్తరంబున గాంధార ప్రభువగు నంగారుండు నీయార్వురు మాత్రమ్మ ప్రజలకు గొలకరాని గుగ్గిళ్ళయి మాంధాతృమహీశు పేరెత్తిన నగిరి కత్తిదూయుచు

కయ్యంబునకుఁ గాలదువ్వుచుండిరి. తక్కుంగల వర్షభూభాగంబుల ప్రజారాజచక్రంబులెల్ల మిగుల నుత్సాహభరితంబులై మరల మహాసభ ప్రవర్తిల్లు శుభసమయంబునకు నెదురుచూచుచు నుత్కంఠతో మెలంగుచుండె. 288

ఐదవ విశ్వధార్మిక మహాసభావర్ణనము

తే॥ తిరిగి చూచెదునంతలోఁ దిరిగ నబ్ద
మెదురుచూచు మహాసభ పొదలెనంత
గాంగ యామున సంయుక్త ఘట్టమందు
నాప్రతిష్ఠానపురిచెంత హర్ష మెసఁగ. 289

తే॥ వర్ష వర్షాంతరమ్ముల వార లోలి
ప్రజలు ప్రతినిధుల్ ప్రముఖులు ప్రభువు లపుడు
దూరభారమ్ము లెంచక కోరివచ్చి
రౌర! సిరి మూది చుక్కమీ దనెడు పగిది. 290

కం॥ పలుబాసలు పలువన్నెలు
పలువేసమ్ములును వింత వల్వగరూపుల్
గలిగిన జనచయ మయ్యెడ
మెలగెఁ జేచేయివట్టి మించిన వేడ్కన్. 291

కం॥ యోజనదూరము బండ్లకు
భాజనమై వెలసె రాచ బలగంబునకున్
మోజుగ పాకలు పందిరు
లాజమునకు వేల్పుటేటి కంతరభూమిన్. 292

చం॥ మన మెలయించుచున్ గనులు మల్పగనీని రథాలమూదిరుల్
కనదభిరామ వేషములఁ గ్రాయుచు దిక్కుల దివ్యరత్నకాం
చనరుచిజాలమున్, పరిధిత చారుకళంతసద్వృత్తమూర్తులన్
తనుగొన లెక్కకొండొకటిఁ గైకొననీనివిధానఁ నొప్పెడిన్. 293

చం॥ పలుగొమ్మలమొకముల మఱి
పలుగొమ్మలమొకముల నతి నిష్ఠుర సింహ

మ్ముల కీడగు తగరుల త్రె
క్కులమావులఁ దద్రిథాలు ƒ కమనీయంబుల్. 294

చం॥ కనదమరాపగారుచిర ƒ ఘట్టములన్ రవినందినీ విశా
లనవమనోజ్ఞతీర్థముల ƒ లబ్ధపదంబగు నౌచయంబు వి
న్ననువు చెలంగ మీనతిమి ƒ నక్రముఖాంబుజ జంతుయూథమై
కనులకువిందుగా రకర ƒ కంబులవన్నెల నిండె నంతటన్. 295

చం॥ విఱిసిన తెల్లతామరల ƒ విన్ననువొప్పగ పట్టువల్వలన్
నెఱయగ నిర్మితమ్ములయి ƒ నెమ్మది కిమ్ముగ నెల్ల యిమ్ములం
బఱవగు చప్పరమ్ములకు ƒ మధ్య రమాసతి కాటపట్టుగా
వఱలె సహస్రపత్రనవ ƒ వారిజమట్లు సభాగృహమ్మటన్. 296

తే॥ నేల నాలుగు చెఱఁగుల ƒ నేలి దివము
నోలిఁ బాలించి వఱఁగిన ƒ యుర్విపతుల
ప్రతిమ లందందు రమణీయ ƒ వర్ణితములు
పొందుపరిచిరి తత్సభఁ ƒ బూజ్యమతిని 297

ఉ॥ పచ్చనితోరణావళుల ƒ బంగరువన్నియ పండ్లగుత్తులన్
మెచ్చగు మేలికట్టులను ƒ మేదురరోచిరుదారరత్నరూ
పోచ్చయదీపగోళముల ƒ నొప్పగునద్దములన్ సదమ్మురా
లచ్చికి పెండ్లికూట మన ƒ లక్షితమయ్యెను చిత్రచిత్రమై. 298

చం॥ కరకరపొద్దుపుట్టుడును ƒ కస్తురిగందపు ధూపవాసనల్
పరువముకాగ నెమ్మదికి ƒ ప్రబ్బగ స్వాగత పృచ్ఛసేయ నా
గరకపువేషభాషలను ƒ గైకొని సంస్తవనీయమూర్తులై
సరగునవచ్చి నింపిరల ƒ సంసదగారము సభ్యులెల్లరున్ 299

మ॥ తరుణోదారకుమారు లాయెడ సభా ƒ స్తారప్రియంభావుకుల్
చరులై తాముగ నామహాసమితి వే ƒ శ్మమ్మందు శాఖాకృతిన్
గరకల్పంబుగ సందు నందు నియతా ƒ కారంబు లొప్పార నా
చ్చరికన్ వర్తిలుచుండి కృత్యముల శి ƒ క్షాకౌశలం బేర్పడన్.

వ॥ అయ్యవసరంబున— 301

సీ॥ జగతికి సద్వృత్తి § సాధించు సద్ధర్మ
తేజంబు ముఖమునఁ § దేజరిల్ల
చూపరఁ భయభక్తి § శోభితులనుజేయు
విద్యుతి నేత్రాల § విస్తరిల్ల
విశ్వకార్యంబులు § వెన్నికసాధించు
దక్షత యురమునఁ § దాండవింప
నవిరతంబుగ నేల § నంతయు భరియించు
బలిమి భుజాకోటి § నెలమిఁ గులుక

తే॥ సమర మానవ రక్షణో § దారమహిమ,
యుజ్జ్వలంబైన తనుమూర్తి § యొద్దుపొడుపుఁ
గలయ విలసిల్ల భూప్రజఁ § గాచుకొఱకు
వరగ విశ్వంభరుఁడు వచ్చు § భంగి తోఁప 302

సీ॥ ఇరువాగు లమరిన § గిరజాల నునుడాలు
మాళికి హరినీల § మయతఁ దార్ప
దివ్యతేజఃస్ఫూర్తి § దీపించు ముఖమున
కస్తూరితిలకశో § గంధ్య మడర
సమవృత్తకంధరా § రమణీయ మణిహార
పదకంబు లందందు § ప్రభలఁ జెలఁగ
నపరంజియంచుల § హరితవర్ణదుకూల
మాగుల్ఫమై కటి § నమరియుండ

తే॥ రెండుసందిళ్ళనడుమను § నిండి మెఱయు
పైఁడియంచుల లేఁగెంపు § పట్టువల్లె
భుజయుగముమీఁద కేయూర § భూషణముగ
వెనుకదెస మించు చెంగులై § వ్రేలుచుండ. 303

తే॥ ప్రబలరాజాధిరాజులు § బలసిరాఁగ
మధురమధుమూర్తి మాంధాత్ర § మనుజవిభుఁడు
వరగఁ జనుదెంచెఁ దత్సభా § భవనమునకు
కౌతుకోద్దంచితాత్ములై § కాంచ జనులు. 304

తే॥ "జయ" "చిరంజీవ" యను సము త్సాహరవము
మహీసురోదితమాంగళ్య మంత్రరవము
వరుసమంగళవాద్య ని స్వనముఁగూడి
ఘోరుకొల్పంగ తగవరుల్ దారిసూప. 305

మ॥ కరతాళంబులు మ్రోయఁగా గుడికిఁ శృం గంబెత్తినట్లొప్పఁ ద
న్నరనాథుం డఖిల ప్రజాభ్యుదయసం ధానక్రియాస్థానమై
పరిమన్మందిర వ్యాత్తపదంబు నయి స భ్యవ్రాత దృక్కేంద్రమై
పరమంబైన మహాసనంబుగొనె స భ్యస్వాంతముల్ రంజిలన్.

వ॥ అంతనిర్దిష్ట ప్రకారమ్మున— 307

సీ॥ మధురసౌరభఝురీ మంజులాచ్ఛలతాంత
గుచ్ఛచక్రచ్ఛటా గుంఫితంబు
సౌవర్ణగుణజాల సంభూషితం బంత
రాంతరప్రత్యుప్త హరిత నీల
శోణమణిప్రభా సుందరవృత్తంబు
పర్యాయిత మృదుప్ర వాళ రమ్య
మాజానువిరచన భ్రాజత్ప్రదామకం
బఱుతఁ గీలితమయ్యె నధిపునకును

తే॥ మంజుల సుమృష్ట నాళ స మన్వితంబు
లలిత శోణసరోజంబు లక్షణముగఁ
జిగురుపొట్లము చెలిమైన చేతనమరెఁ
దనరెఁ గమలేశు డన నంత ధరణి కతఁడు. 308

వ॥ అంత సభాకార్యక్రమంబున కుపక్రమంబుగా— 309

తే॥ దైవము నుతింప ననుమతి తానొసంగి
ధర్మసంరక్షకాచ్యుతో దారమూర్తి
నంతరంగంబున న్నిల్పి హస్తయుగళి
మోడ్చి యరమోడ్పుఁ గన్నుల ముందు నిలచె. 310

చం॥ శ్రుతిరమణీయసూక్తముల సుస్వరయుక్తిఁ బ్రఫుల్ల మూర్తులై
నుతిరొనరింపసాగిరి వి నూత్నత నెక్కొన సూక్తి సూక్తిన్

యతివరు లోలి నిల్చి విన । యంబదిచేతులమోడ్పురూపుగా
మతియెటువోయెనో యనఁగ । మ్రాన్పడినిల్చిరి సభ్యులెల్లరున్.

వ॥ పిమ్మట నెల్లరు నాసీను లగుటయు నెల్లెడఁ బ్రశాంతత పాదుకొనవంత.

స్వాగతసంఘాధ్యక్షు నుపన్యాసము

ఉ॥ స్వాగతసంఘనాథుఁ డను । సమ్మతిగా మహనీయులార! సు
స్వాగతమెల్లవారికి స । భాతలనేతకు ధర్మనేతకున్
త్యాగమయాత్ములై మహిత । ధర్మసమాహితదృష్టిచిత్తులై
సేగుల లక్ష్యపెట్టకిట । జేరుట కెంతయు మోద మయ్యెడిన్. 313

ఉ॥ కంటను వత్తివైచికొని । కాయుచునుండిన నాత్మభూపతుల్
వంటవిసంబువెట్టికొని । బాముల ముంచిన నిల్వరించినన్
కంటకముల్ సుదూరముగఁ । గాలనుదన్నుచు లక్ష్యసిద్ధికై
బంటుతనంబు తెల్లముగ । వచ్చినవారికి మా పురస్కృతుల్ 314

తే॥ రాజులేగాక రాజాధి । రాజులిందు
ధర్మసభ్యత్వ పత్రిం బు । దారమతిని
విలిచి మాతోడ నిలిచిరి । పీడిసుఖము
వారియెడ మాకృతజ్ఞత । వలులుఁగాక. 315

తే॥ ప్రజకు వెన్నుమ్మ పరికింపఁ । బ్రభులె గాన
తాదృశోదార ప్రభువులు । నాదుకొనుచుఁ
జేతకిని చేయి మాటకుఁ । జేర్చి మాట
మెలఁగుచుండుట మనకెంతో । మేలు! నేఁడు. 316

తే॥ మనసమావేశ మిది నేఁడు । మనకె కాక
యఖిలధరణికి మహిత శు । భావహమ్ము
సమయ మిదియెన్న బంగరు । సమము దాన
రత్నసమవాసరము లివ్వి । రావు మరల. 317

తే॥ విశ్వమానవచరితలో । వేడ్కఁ గొల్పు
రసమయాధ్యాయమిదిపైఁడి । వ్రాలనొప్పు
సకలమానవకల్యాణ । సాధనమున
మేళనంబిది ధన్యమై । మించుఁగాక. 318

తే॥ రంగు లేకాక కులముల ఽ రంగు లెన్నొ
జాగృతములైన మనలోన ఽ సరళమైన
దృక్పథ మదేకమై గెల్చు ఽ తెచ్చు మనకు
వాక్పథము నేడు జయమున ఽ వఱలుఁగాక. 319

ఉ॥ స్వాగతసంఘనాథుడు వి ఽ చారపరిప్లుతభాషణమ్ములన్
స్వాగతముల్ వచింప నిటు ఽ సంగ్రహయుక్తిగ సర్వవర్షభూ
భాగము లందు ధార్మికస ఽ భాచరితంబులు నాయముల్ వ్యయ
మ్మోగును బాగు సర్వవిష ఽ యోద్యమముల్ వివరించు
పాత్రముల్ 320

తే॥ సభ్యులకు నెల్ల నందించి ఽ సభకు జయము
కోరుచును రానిఖండాల ఽ ధారుణీశు
లచటితీర్పుల నొప్పుచు ఽ నంపినట్టి
కమ్మలఁ బఠించె నంతఁ ద ఽ త్కార్యదర్శి. 321

వ॥ తదనంతరంబ — 322

అధ్యక్షోపన్యాసము

చం॥ తొలుతవచించె నాగమితి ఽ ధూర్వహు డిట్లు గభీరవాణితో
నలువమ దీటువచ్చు ముని ఽ నాయకులార! యుగప్రవర్తనా
స్ఖలితపరాక్రమోద్ధుర వి ఽ శాంపతులార! సమాజభద్రసం
కలన సుతప్తకాంచన వి ఽ కస్వరజీవితులార! మేలుగాన్. 323

తే॥ దేవ మానవ భువనముల్ ఽ తేజ మడర
నేలి సద్ధర్మవిద్యుతి ఽ యొసక మెసగ
మానుషాకృతి దేవతా ఽ మాన్యులైన
యల కకుత్థ్సుని నహుషునిఁ ఽ దలఁతు మొదల. 324

తే॥ పృథుమహీశు పురంజయు ఽ భూమిపతిని
దుందుమారు యయాతిని ఽ దోసిలొగ్గి
వినుతిచేసెద గురువుల ఽ విధముకాఁగ
సత్యవర్తన నాదర్శ ఽ సదృశులగుట. 325

శా॥ ఆదర్శంబుల సత్యసారముల నె న్నైనన్ వచింపంగ నే
గాదీ చేతులఁ జేయ రెండిఁటికి నా కెం తెంతదూరంబ యీ
భేదంబింతయు లేనిచందమున ని ర్విఘ్నంబుగా సంయమో
ద్భేదంబొప్పఁగఁ బల్కుఁ జేతలను సా దృశ్యంబు దీపింపఁగాన్.

శా॥ ఉత్సాహోత్థితముఁగా ప్రజల్ ప్రభువు ల న్యోన్యానురక్తాత్ములై
చేతల్ పల్కులు నంతరంగమును భా సిల్లంగ నేకాకృతిన్
జాతిందీర్చి సమాజమూర్తిని బ్రశ స్త్యంబుగా వృత్తవి
ఖ్యాతిం జూపిన మీదు ధర్మగతి య గ్రిశ్లాఘ్య మెందేనియున్.

తే॥ విపుల భవదీయ విజ్ఞాన విత్తలక్ష్మి
భువనమోహన సంతాన భూరిలహరిఁ
గర్కశ జగమ్ము నాగర కమ్మొనర్చె
జతన మొనరింప నేది య సాధ్య మిలను? 328

తే॥ యుష్మదుద్యమములయెడ నొప్పుఁ గనియు
నిసద్మశంబుగ మామీది వేరమునను
నల మరుత్త మహీశాదు లాత్మప్రజల
సిలుగులను ముంచుచుండుటఁ జెదరు మనసు. 329

ఉ॥ మూపముఁ గత్తిసత్తిన సమన్వితమయ్యెడుఁ గొంతయేని సం
తాపముగున్ స్వయమ్ముగను ధర్మసమాచరణానుపాలనా
వ్యాపృతులయ్యుఁ దాము జన తాభ్యుదయావహధర్మసంస్థలన్
దూషితులై విరోధమునఁ ద్రోయుటఁ గాంచిన, మాదె తప్పగున్.

తే॥ దాసగు తెవియైన మాయెడఁ దోచనేని
తెలుప నేము కృతజ్ఞత తెలిపి వాని
తీర్చికొందుము! తమవీఁపు తెలియఁ దమకు
నలవియగునొక్కొ యెవ్వరికైనఁగాని! 331

తే॥ ద్వేషమూలంబులగు మాదు దోషములను
వారలే, యేల! యిందు నెవ్వారలైన
వెలువరించిన నవ్వాని వేగతీర్చు
మనుచితము దాసుఁడగుట యధర్మమునకు. 332

వ॥ అనుటయు నాసమయంబున. 333

తే॥ సౌహృద సుధారతన్నృపా సభ్యకర్త్రు
ములకునెల్ల ననూయయే కొలికిపూస
అగ్నికిని మైలయున్న మీా కగును దోస
మనుచు సభనుండి వినరాగ ననియె వెండి. 334

ఉ॥ జ్ఞానవయ స్తపోవిధిల సద్గుణ సంచయవృద్ధభూపులన్
గాని తెఱంగునం బలుకఁ గా దిట వారికి—మాకు—మీాద సం
ధానముచేయుఁ గాలగతి తప్పులు కన్గొన నాత్మశోధనా
ధానము ముఖ్య మెల్లెడల ధర్మగతుల్ బహుసూక్ష్మముల్ గదా॥

ఉ॥ భేదములం దభిన్నగతి పెద్దఱికంబును చిన్నరూపునన్
వాదములందు సత్యగతి, వైరమునందున మైత్రికంటయున్
క్షోదలవంబు మేరువుగఁ జూచుట, యిమ్మగ లోకమందునన్
మాదిరిగా మెలంగుటయు మంచితనంబున కగ్ర్య లక్ష్యముల్.

తే॥ మందునకుఁగాని మూలంబు, మంత్రమునకుఁ
గాని వర్ణంబు, యోగ్యుండు కాని పురుఁడు
నుండఁ డైనను గూర్పంగ నుచితరీతిఁ
జతురు డొక్కండు వలయును జగతిలోన. 337

ఉ॥ ఎక్కువతక్కువల్ పొసఁగు నెచ్చటనేని గుణైకమూలముల్
నెక్కొనియున్న యెక్కువల నిల్పి మనంబున మేటులన్యులన్
దక్కువలోన నిల్పక సుధారణఁ దుల్యులఁ జేయ ధర్మమాఁ
జక్కరమాడ్కి నువ్వును సుసంస్కృతి భోజ్యముగా నొనర్పరే.

ఉ॥ వస్తువు సంస్కృతంబయిన వర్ణవిశిష్టత యెట్టులుండినన్
నిస్తుల సత్ప్రవర్తనయ నేటుకు తెచ్చెడి నెల్లవారలన్
కస్తురి కప్పురంపు టొడి కంబగు వర్ణవిభూతి లేకయున్
శస్తకరప్రవర్తనఁ బ్రశస్తికివచ్చుట తెల్లమేకదా? 339

ఉ॥ రంగు లవెన్నియైన మది రంగొకడైనను రాజకీయ స
ద్రంగములందు విశ్వజన రాజికి శాశ్వతశాంతి భద్రతా

భంగురసౌధము న్నిలుప § వచ్చెడిధర్మమహోపలాళితో
సంగతసోదరత్వరస § సామ్యవిధానసుధం గూర్చి యొప్పగా. 340

తే॥ తాదృశోద్దేశసిద్ధికై § తప్పకుండ
కలియుచుండంగ మన కింతం § గలిసె మనసు
పెఱుకం గలియును నెల్లియే § వేరమేల!
భూరుహములెల్ల నొక్కటం § బూయునొక్కొ!! 341

తే॥ వివిధదేశసమాగత § విపులమతులు
తమదు సువిచారములు తెల్ప § సుముఖు లింక
వాని నమృతపదంబుల § వరలువాని
వినంగం గోరెద నని యుపవిష్టుండయ్యె. 342

వ॥ అంత నప్పలుకు నూతంగాగొని 343

మ॥ పరిపాటిం బరమర్షి పార్థివవరుల్ § వార్తావిదుల్ ప్రాజ్ఞులున్
వరసామ్యప్రతిపత్తి శ్రేష్ఠతమ ని § ష్పత్తిం బ్రపంచైకమా
ర్గరతిం గూర్చి యుపన్యసించిరి మహా § గంభీర వాగ్గుంభనన్
మొరసెన్ దుందుభి యంత మింట రవి స § భ్యుల్ పోల్పంగాం
బైపయిన్ 344

తే॥ నిలచి యయ్యెడం దత్సభా § నేత లేచి
యితర సమితులు మధ్యాహ్న § హృద్యవేళ
జరిగెడిని సార్వభౌమ సం § వరణమెల్లి
నడచు సభకును వీడ్కొల్పు § నడచు నిపుడు. 345

తే॥ వెండి వచియింతు నొక్కటి § వినుడు నిరతి
దేవమానవపూజ్యుడై § తేజరిల్లు
భృగుమునీశ్వరుం డధ్యక్షు § పీఠిం గొనెడి
ననుమతింపుడు రేపటి § కనియె నంత. 346

తే॥ మగుడ మరునాడు తత్సభా § మందిరమ్ము
నరిగ వేళకు నిరవకా § శమ్మునర్చె
సభ్యగణమెల్ల, సంయమి § చక్రవర్తి
పుండరీకాసనస్థుండై § పొనరెం బతిగ. 347

కం॥ అనుగతిఁ గార్యములన్నియు
జనులయు సమాప్తి నెన్న - సమయం బగుటన్
మునివరుఁ డౌశిదు మరుత్తా
వనినాథుం డిష్టుఁ డనుచు - వాక్రుచ్చె నెసఁగన్. 348

మహాసభ మాంధాత్రుమహీపాలుని విశ్వమానవ సమాజనేతగా నెన్నుట

తే॥ ప్రథిత మాహిష్మతీశుఁడు - ప్రౌఢిఁ బల్కె
మాకు నిష్టులు మాంధాత్ర - మనుజనాథు
లనుడు తద్రాజకము సర్వ - మట్ల యనియె
మునిగణంబును ప్రతినిధుల - మోద మనిరి. 349

తే॥ విధివిరామమ్ము లేనట్లు - వింతకాఁగ
గొలువుగొలువెల్ల సాకేత - కువలయేశుఁ
జేరఁ గనెఁ దదీయ వర్చస్సు - వృత్తపంక్తి
నబ్జఘృణి సుధ కైవడి - నలమె నంటు. 350

వ॥ పిదపఁ గొంతవడికి ప్రశాంతత పాదుకొన నప్పుడు భృగుమహాని యుత్థి
తుండై యెల్లరువిన నిట్లు వినిపించె. 351

మహాసభలో భృగుమహాని మాంధాత్రు
మహీకాంతుని సార్వభౌమపదంబున నభిషేకించుట.

మ॥ చిరకాలార్జితశాంతిసంచితజగత్ - క్షేమంకరోద్యత్తపః
పరిపూర్ణాత్మకులార! ధర్మమహిమా - భ్రాజత్ప్రజాపాలనా
చరితార్థాత్మకులార! మానవసమా - జక్షేమ కృజ్జీవితా
దరులారా! తగ నిమ్మహాసమితి మాం - ధాత్రుక్షమాజాని వ
ర్యరితుం డీయఖిలప్రజాభువన స - మ్రాణ్మాన్యరీతిగా నిత్తఱిన్. 352

శా॥ ఆ వాచంయమినేత వెండియనియెన్ - హర్షప్రఫుల్లాస్యుఁడై
దైవం బీమహితోద్యమంబునకు జై - త్రింబైన ప్రోత్సాహమున్
గావింపన్ గెలుపొందినారము చిరా - కాంక్షార్థమీడేరె నీ
యావద్భూతల మీసుయోగమున - నవ్యస్ఫూర్తి శోభిల్లెడిన్.

తే॥ ఈసమస్యయు శల్యమై - యేచుచుండె
బహుసమంబులుగా బహు - ప్రముఖవితతి

నేఁటి కది పీడ వైకుంఠ మనరు కల్మి
మానవజగంబు సౌఖ్యసంపదలఁ బొదలు. 354

తే॥ విశ్వమంగళకరమైన వేదకృతిని
మనకు వెలయించినట్టి యా మాధవునకు
ప్రథమ మర్పింపుదము నమోవాకములను
ధర్మసేతువులార! యుదారులార. 355

మ॥ మును విశ్వంభరుఁడొప్ప సల్పె భువనమ్ముల్ బోషింప భూమీపతుల్
దన తేజంబున; విశ్వమాతని విరాట్త్వంబు తన్మూర్తులౌ
మనమీభూపతి సార్వభౌమపదవిన్ మాన్యస్థితి న్నిల్పుటల్
మన తేజంబులు రూపుఁగొన్న విటు లాత్మఖ్యాతియై యాతఁడున్.

తే॥ వెలసె సముదాయ తేజఃప్రవృత్తికలన
మఱియు నాతని తనువుగా మానితులము
తనువు నాత్మవిధేయమై తనరు టుచిత
మగుట మనవల్కు కృతిమూర్తి నడరుఁగాక. 357

వ॥ ఇట్లని యమ్మహాసభాధ్యక్షుండు మాంధాతృ మహీరాణ్మణి దెస కవ
లోకించి. 358

తే॥ తృణమునం దగ్ని రవులుచు తీవ్రముగను
మండు గవ్వున ధప్పని క్రుందిపోవు
వెంటవెంటన గాడంబు వేయుచున్న
నగ్ని యూరక దానిపై నమలుచూపు. 359

తే॥ ఉముకపోవున నొకపరి యూదినిల్పఁ
గప్పుతోవరి, రాజుచుఁ గాలుచుండు
పొగలుచిమ్ముచు మథియింపఁ బొసగ జమ్మి
వెలువరించును దనలోని మొలక వెలుగు. 360

తే॥ సెగలు పొగగ్రమ్మ నెత్తురి చెమటకాఁకఁ
గాఁచి మాలిన్యమెడల సా గంగఁగొట్టి

రాచి రంపానఁ బెట్టుచు § నాచి తోమ
మెఱపెడిని ముక్క మిలమిల § మిసిమితోడ. 361

తే॥ నతికి ముక్కలు చేసిన § మెఱుఁగు కనము
తాలఁ గొన్నిటఁ బటికపు § తాలఁగొంత
దీప్తివిలసిల్లుఁ; బరకీయ § దీప్తియలమఁ
దళుకుబెళుకులఁ గాంతముల్ § దనరుచుండు. 362

తే॥ సహజ తేజస్స్ఫురన్మణి § సానఁ దీరి
యాళిలనునింపు స్వపర ప్ర § కాశమగుచు
మంజులమరీచిమాలికా § రంజనమున
శిక్షితంబైన విజ్ఞాన § శిఖవిధమున. 363

తే॥ ఇట్టితత్త్వాలుగల ఘను § లెంద ఱేని
కానవత్తురు సంఘంబు § కలయఁజూడ
నీ విశేషంబు లెఱిఁగియు § యెఱుఁగక నిను
నెన్నుకొనె వత్స! విభునిగ § ఈ జగమ్ము. 364

మ॥ అరుదార్కన్ స్వపరప్రకాశకత య § న్యాకర్ష కత్వమ్ము నీ
పరమై చొప్పడ భూతలంబు భవద § వ్యాజేద్ధ ధర్మప్రభా
కర సద్వ్యాప్తిని రమ్యదృశ్యమయి యె § క్కాలంబు జాగ్రద్గతిన్
బరగుంగాక శరత్ప్రభాత విలస § త్పద్మాకరస్ఫూర్తితోన్. 365

వ॥ అని సింహాసనము నిర్దేశించుచు 366

ఉ॥ మానవలోక మేకతమ § మార్గచరమ్ముగ నానవెట్టుచున్
మానిత సత్యధర్మరుచి § మాంసల సుస్థిర శాంతిసౌఖ్యవి
జ్ఞానమహిష్ఠ రూపముల § సంఘముదీర్చుచు నుర్వి నందనో
ద్యానముగా సృజించు మహి § తాసన మిద్ది రహిన్ గ్రహింపుమీ

చం॥ అనుటయు నవ్వరాననుఁడ § హఃపతికై వడి పొద్దుగుబ్బలిం
దనరు తదుజ్జ్వలాసనము § ధన్యము చేసెను పాణిసంపుట
స్వనము సభాంగణమ్మునఁ బ్ర § శాంతముగా మునిచంద్రుఁ డాభిషే
చనికవిధిన్ బవిత్రతకల § శస్థిత పుణ్యధునీ జలంబులన్. 368

శా॥ ఉర్వీనూతన జీవనౌషధికి పే యూషంపు నిష్యందముల్
పర్వం జేయువిధానఁ జిల్కఁ గిసల వ్రాతంబులన్ శక్రదోః
పర్వ శ్రేష్ఠకిరీటమంజులశిరః ప్రాంతమ్ములన్ జిత్రిక
మ్మూర్వామోదలతాంతదామకము నా ఖ్యద్యోత రమ్యా
ర్మ్యకన్.

తే॥ నిరతి సన్మానసంఘూధి నేత యోలిఁ
దనర నిడె విశ్వమానవ దైవమునకు
తక్కులాంఛనసంతతి మక్కువమెయి
సంశ్రయింపంగ నమ్మహీ శక్రుడంత. 370

తే॥ మోము జాబిల్లి కొండల్కు ముద్దుఁగులుకు
నిలచి సన్మాన సంఘూధ్యు లలితగతిని
కరముఁ గరమునఁ గీలించి గౌరవించి
సంయమిగణమ్ము ప్రణతిచే సత్కరించి. 371

తే॥ కోకనదకాంతి నటియింప గురువ రేణ్యు
పసిఁడియడుగుల రేణువు పాణియుగళిఁ
జేకొనియె భృగుమునియు నా జీవమణిని
పొదివి బంగారుగద్దెపైఁ బొందుపరిచె. 372

కం॥ విధివిహితాశీర్వాద స
మధి కౌరవ మడర మంగ ళాక్షతలఁ దపో
నిధు లా గుణనిధి తల నవి
తథగతులన్ జల్లి రపుడు దైవాకృతులన్. 373

తే॥ ఘుమఘుమార్భటి నచ్చరల్ గురిసి రంత
గాన సుధ వెల్వఁగన్నెలు కల్పకుసుమ
ములను జల్లిరి జగతి నామోద మడర
మొరసె సురదుందుభులు తూర్య ములు రహించె, 374

తే॥ పొద్దుపొద్దున వేవెల్గు ముద్దు వేళ్ళ
ఘృణులఁ గెరలెడి పొందమ్మి మురువుసిరులఁ

గులుకు రాయుంచతుటుముల ॥ కలకలమున
రమణ విలసిల్లు కమలాక ॥ రమ్ము కరణి 375

తే॥ వేళకలయంగ విశ్వము ॥ వేడ్క సూప
మురియుచుండెడి మొనగాండ్రు ॥ మోముసిరులఁ
జేజయులువెట్టు సభ్యుల ॥ మోజు రొదలఁ
బరిఢవిల్లెను తత్సభా ॥ భవనతలము.

సీ॥ అఖిల లోకావళి ॥ కమృతంపు చవిఁ జూపు
ధవలయాధీశ్వరు ॥ ధవళరుచుల
విశ్వమ్మునకు శుభ ॥ విభవంబు లొనగూర్చు
మునిమండలము మహా ॥ పూరమునను
జీవుల మేల్గీళ్ళ ॥ చైవులు సూచించు
బుధ గురు కవుల ప్ర ॥ భూతగతులఁ
బుణ్యాత్ములకుఁ బ్రతి ॥ మూర్తులై విలసిల్లు
నక్షత్రమూర్తుల ॥ నవ్వు తెఱల

తే॥ కలకలనెసంగు తన్నభో ॥ గణము కరణి
నధిక మహిమాస్పదము తత్స ॥ భాంగణమ్ము
దేవసభవోలె ధర్మ ప్ర ॥ తీత మరయ
నందన వనమ్ము కరణి నా ॥ నందకరము. 377

కం॥ శీతల సురభిళ మారుత
పోతమ్ములు పొల యనగల ॥ పొలపము లలమఁగ
జేతము రంజిలఁ జేసెడి
నేతత్ క్షణమందు శాంత ॥ మెల్లెడ వెలయఁగ. 378

వ॥ ఆదేశించి యాపరిష దధ్యక్షుండగు భృగుమునీంద్రుండు నిజాసనం
బున నుపవిష్టుండయ్యె నంత. 379

మధ్యమలోకపాలకుండగు మాంధాతృనకు విశ్వభూతల మహీ
పతు లుడుగరలుపెట్టి విధేయులగుట.

తే॥ విశ్వసమాగ్ర్యమహోకల్ప ॥ వృక్షకమ్ము
ధర్మపీఠాలవాలాన ॥ తనరనిల్పి

యుడుగరలపేరి సత్త్వ నోలిఁ గూర్చి
ప్రీతిరూపామృతమ్ము పూరించునట్లు. 380

తే॥ దొడ్డగద్దియ నొప్పారు దారలవారను
కానుకల కౌఁగిలింపుల గారవించి
రల మహాభౌము డాకుశ స్థలివిభుండు
మాతుల శ్వశురులగుటఁ బ్రీతిఁ దొలుత. 381

తే॥ వర్షవర్షాంతరాగత వసుమతీశు
లాత్మవిభవంబునకు వన్నె నావటించు
ద్రవ్యములఁ గానుకవెట్టి యా దైవమూర్తి
సన్నిధిని సాగిమ్రొక్కిరి సంతసమున 382

చం॥ సకల ధరాతలస్థిత రసాపతు లెల్ల తెలుంగువార లిః
ట్లొకఁడొకఁడే స్వకీయ విభవోన్నతి కర్హవిధిఁ దదర్హణ
బ్రకటముగానొనర్చి వశ వర్తితఁ జూపిరి సార్వభౌమతా
సుకృతపదమ్ము పూర్ణమయి శోభిలె నప్పుడు విశ్వభద్రమై. 383

చం॥ నిరుపమాత్రిక సముద్రతటి సీతతకానన శైలతుందిల
మ్మరుమణి విస్తృతాకరమ హోజ్జ్వలలోహఖనీపిచండిల
మ్మ, రుచిర చిత్రధాతునిధి పుష్కల మూర్జిత సస్యగంధిల
మ్మె, రుచి ధరాతలమ్మఖిల ముఖ్య నగరీవరపట్టణాళితోఁ. 384

తే॥ ఇటుల వశమయ్యె మాంధాత కేకరాత్రి
మంద జనమేజయుడు మున్ను మహీతలమ్ము
వడసె నహాములమూట నీ వసుధయెల్ల
నేడురాత్రుల నాభాగ నృపతిఁ జేరె. 385

తే॥ భూతదయపైకి, పెన్గత్తి కోత లోన
నెఱుగనట్టి సుశీలు రా నృపతివరులు
తద్గుణప్రీతమైచేర ధరణి తాన
యమ్మహాత్మ్మల జనమేజ యత్నితిండ్రి. 386

వ॥ తదనంతరమున—

## మాంధాత కృతజ్ఞతను దెల్పుచుఁ దుదిపల్కులతో మహాసభకు వీడ్కోలు తెల్పుట

ఉ॥ శీలవదగ్రగణ్యుఁడు వి శిష్టచరిత్రుఁడు యౌవనాశ్వుఁడా
యోలగమెల్ల శాంతిమయి నొప్పగనుండగ భూమిభారముల్
దాలిచియుంటనోయన ని దానముగా నటలేచి యిట్లనున్
మాలిమిఁ జేసి మాపయిన మా వెలిజీవములార! యిత్తఱిన్. 388

ఉ॥ జ్ఞానవయస్తపోధిక ర సావతులుండగ మాన్యు లుచ్ఛ్రియ
స్థానమొసంగి మాకిటులు సత్కృతియెల్లగ సల్పినారు నె
మ్మేనునఁ బుల్కలూరెడిని మీ నెఱచాగపుఁ బండువెన్నెలన్;
మానితమైన యీదినము మాకుఁ జిరస్మరణీయ మెంతయున్.

ఉ॥ పూనెద మీవితీర్ణిమయ భూమిభరంబు భవన్నియుక్తిగా
నూనిన యీమహాపదము నొప్పుగనిల్పెడి భూరిశక్తి సం
దానితమయ్యెడిన్ భవదు దారనయ ప్రగుణ ప్రవృత్తిచే
మానుగ మాయెడన్ గనుడు మంగళ మీయనుజన్మసేవలన్.

మ॥ వివిధాచార మత ప్రభుత్వగతు లా వేష్టించి మమ్మెల్లరన్
దవులంజేసె ప్రభిన్న తాస్థితుల నిస్తారంబు లేనట్లుగా
నవి యెల్లం గడు దూరమై చనియె నే కాధ్వన్యులై యుండుటన్
దవులన్ ధార్మిక సూత్రజాలములు నే స్త్రం బిట్లు వర్ధిల్లుతన్.

ఉ॥ మానవ విశ్వమెల్ల నొక మాటకు లోఁబడి ధర్మదేవతా
ధేనువు గేహగేహమునఁ దియ్యగ గోర్కులు తీర్చుచుండగా
మానవుఁ డెవ్వఁ డేని నొరు మన్ననతోఁ జెయిచాచు గోజుకుం
బోని తెఱంగు కల్గ నిక ప్రొద్దులు మేలురకానఁ జెల్లుతన్. 393

తే॥ ఈదృశోదార కల్యాణ మెనయఁ జేసి
నట్టి కల్యాణమూర్తి కా హారికి వినతి
శతము లర్పించి యిమ్మహా సమితి మగుడ
కలియఁ గోరెదఁ గోసల కటకమందు. 392

తే॥ ఇటుల వచియించి కూర్చుండె నెలమి మ్రొక్కి
సమితి కప్పుడు మాంధాత చక్రవర్తి

భృగుమునీంద్రుడు సమితికి § విషయముఁ దెలుప
కార్యదర్శియు నలరించెఁ § గడవలుకుల. 394

వ॥ తదవసరమ్మున 395

పృథ్వీవృత్తము॥ మునీశ్వర వరస్ఫుటస్వరమనోజ్ఞ § ముల్ మంత్రముల్
కనత్స్వన కుశీలవప్రథిత గీతి § కామంజరుల్
మనోజ్ఞ హరిచందన ప్రసవగంధ § మాధుర్యముల్
తనూరుహము లుల్లసిల్లఁ గురిసెన్ గ § దశ్యాళికిన్. 396

తే॥ కనకరత్న విభూషణ § కలితమైన
భద్రగజమెక్కి యా చక్రి § వర్తియంత
ప్రథిత రాజాధిరాజులు § బలసిరాగ
దిక్పతి విశిష్ట దేవేంద్ర § తేజ మడర. 397

తే॥ వెడలి ప్రజలెల్ల మెఱయింప § వేడ్కతోడ.
విడిదలకుఁజేరి యెల్లర § వీడుకొలిపె
సముచితమ్ముగ సత్కృతి § సల్ప వార
లాత్మ సదనంబులకు నేగి § రతిముదమున. 398

వ॥ ప్రతిష్ఠానపురాధీశుండు మహాభౌముం డమ్మరునా డమ్మధ్యమ లోక పాలునకు గౌరవంబుగా నిఖిలవర్షద్వీప భూపాలవరేణ్యులతోడ మహావైభవోపేతంబుగా విందొనర్చి యర్చించి యనిపె నన విని జనమేజయుండు మునీంద్రా! మాంధాతృమహీశున కయ్యెడ విముఖంబైన రాజన్యమట్కుంబెట్లు వశంవదమయ్యె? దరువాత నతని పాలనం బెట్టిచందంబునంబరఁగె? తేటపడం దెల్పవే యని వైశంపాయను వేడ.

ఉ॥ (శ్రీ)మధురస్మితప్రథిత! § శేషగిరీంద్ర భుజాంతరాళ ది
వ్యామల శక్రనీల పద § కాయితమూర్తి! మదీయలోచన
స్థేమ రమానుఖేలన సు § శీలకిశోర! మదీయసాహితీ
కోమల కోకిలేష్ట కిస § గుంఫిత చైత్రరసాల పేశలా. 400

శా॥ నా ముంగొంగు పసిండి! నాతలఁపు టా § నందమ్ము! నాలోన సు
ద్ధామంబైన వెలుంగ! నానుడుల ని § త్యంబైన జీవమ్మ! నా

హైమప్రోజ్జ్వల రత్నవర్మమ! మదీ యాధ్వప్రదీపమ్మ! నా
స్వామీ! వేంకటశైలశేఖరమణీ! నా భాగ్య చింతామణీ 401

మాలినీవృత్తము॥ నిజపదకమల శ్రీ స్నిగ్ధ శేషాద్రికూటా
త్రిజగ దవనదీక్షా దీప్త దివ్యప్రభావా
అజ రజతగిరీశేం ద్రార్చితాంఘ్ర్యబ్జయుగ్మా
విజిత విబుధ విద్వి డ్బృంద చక్రప్రకాశా. 402

వ॥ ఇది శ్రీశ్రీనివాస కృపాసమాసాదిత కవితా విభూషితుండును, కృష్ణామండలస్థ కృష్ణానదీపవిత్రప్రాక్తీరవర్తి "శ్రీరంగపురాగ్రహార" వాస్తవ్యుండును, బళ్ళారిమండలస్థ "హొసపేట" పురీ పురపాలకోన్నత పాఠశాలాప్రధానాంధ్రోపాధ్యాయ పదవీవిలసితుండును, శ్రీమత్పదసంస్తుత "ఆసూరి" సముపజ్ఞక "తిరుమల" పదాంచిత "కొండూరు" సముపాహ్వయ "పంచాంగా"న్వర్థ నామధేయ "హారీత" గోత్రపవిత్ర కృష్ణమాచార్య తనూభవుండును, ఆంధ్రవిశ్వవిద్యాలయాధిగత "ఉభయభాషాప్రవీణ" పట్టప్రకాశితుండును నగు వెంకటాచార్యుని చే రచింపఁబడిన కృతులలోఁ దృతీయంబగు "ఆదర్శప్రభుత్వ"పరనామక "సమాజసామ్రాజ్యం"బున ద్వితీయఖండము. 403





# సమాజసామ్రాజ్యము
# లేక
# ఆదర్శప్రభుత్వము

---

## తృతీయఖండము

శ్రీరమణీయవేష! శ్రుతి చిహ్నిత నిశ్శ్వసితాత్మభాష! ని
ష్కారణ సత్కృపా మధుర! సర్వజగత్పరిరక్షణాధురా!
కారణ కారణా! దురితహరణ కారణ! లోక మలఘ్న నిమ్నగా
కారణ పాదపద్మ! భుజగప్రభుపర్వత సద్మ! మాధవా! 1

వ. దేవా! శ్రీవేంకటాచలపతీ! అవధరింపుము. వైశంపాయనుండు జనమేజయునకు వెండియు నిట్లు వచింపఁ దొడంగె. అట్లమ్మానవపాలుండు ప్రతిష్ఠానపురంబు వెడలి.

ఉ॥ పెద్దలుచేరి నాపయిని పెట్టిరి యీజగతీభరంబు నా
పెద్దలపూన్కి తీర్పుటయ పెద్దరికంబు మదీయ జీవితం
బొద్దిక నాదు విజ్ఞతయు నుక్కును నేరిమి సర్వసంపదల్
ముద్దుగ లోకపాలనకు పుట్టువునొడ్డెద ధన్యమయ్యెడిన్. 3

వ॥ అని తలంచుచు నిజకటకంబునకుం జనుదెంచి నవీనవిశ్వవసుంధరా సమష్టిప్రభుత్వపు టాదర్శంబులు ప్రకటింపఁ దెలియవచ్చిన పత్రికా విలేఖకుల ప్రశ్నలకు ప్రత్యుత్తరంబుగా నిట్లు వచించె 4

మాంధాత లోకనిరూఢికై పత్రికావిలేఖకులముందు ప్రాథమి
కాదర్శంబులు వచించుట.

చం॥ అనలపరీక్షకున్ నిలుచు § నచ్చపువర్తన మచ్చుముక్కగా
మనియెడువానిజీవితము § మాకుఁ బ్రసన్నత నావటించెడున్
మనసును నెల్లవారలకు § మానస లక్ష్యమొకండె సంఘమున్
మనుచుటయెల్లభంగుల స § మంచిత సోదరతానుపాలనన్. 5

సీ॥ నెమ్మిమై నారాధ § నీయమెయ్యది యన్న
నది లోకమేయని § యందుమేము
నిరతిమై నాచర § ణీయమెయ్యది యన్న
నది ధర్మవే యంచు § నందుమేము
నియతిమై నభ్యస § నీయమెయ్యది యన్న
నది యోరిమి యటంచు § నందుమేము
నీతిమై నభిలష § ణీయమెయ్యది యన్న
నది పరశ్రేయమం § చందుమేము

తే॥ మనుజుఁ డార్జింపఁ దగునెద్ది § యనినఁ బరకృ
తజ్ఞతయ యని యందుము § దారమతిని
ప్రకటనీయ మదేదినాఁ § బరులసుగుణ
లవ మటంచు వచించెద § మవని నేము. 6

తే॥ వితర ణౌదార్యములు రెండు § విబుధగుణము
లాగుణమ్ముల మానవు § డమరదీప్తి
మానితుండగు తాదృక్స § మాజములన
యమరజగతికి నుద్దియై § యవనిపొల్చు. 7

తే॥ తాదృశమహిష్ఠ గుణరత్న § ధానియైన
విశ్వమర్త్యసమాజంపు § వెలుగుఁ గాంచి
చెలిమిఁ గోరి యమర్త్యులుఁ § జేరవత్తు
రాసమున్నతి పరమ ల § క్ష్యంబు మాకు. 8

సీ॥ బుద్ధినాత్మకుటుంబ § మున బంధుపరివార
మున నిజజాతిపై § నునుచు నట్టి
ప్రత్యేకతకుఁ జక్ర § బంధమ్ము తగఁజుట్టి
యన్యజాతులపైన § నమలుసలుపు
హేయభావమునకు § నింగల మ్మొసగొల్పి
తనకె విశ్వముకాక § తానె విశ్వ
మున కని స్వప్రయో § జనరతి దివికంపి
సర్వసమత్వ సు § జ్ఞానవిమల
తే॥ మతినిగాంచుచు ధర్మ్యస § మాజమూర్తి
ముకురమున నాత్మబింబము § పోల్కి నెప్పుడుఁ
గేవలాత్మ సమర్పణా § కృతివిశుద్ధి
వర్తిలుచునుంట పరమ త § వంబు కనుఁడు 9
తే॥ తత్పవిత్ర తపోధనో § ద్దామసత్వ
యోగమహిమానుభావ స § ముచ్చ్రయమున
మానవ నిరూఢలోపాలు § మాటుమణఁగ
త్రిదివ పృథివీవిభేదముల్ § ప్రిదిలిపోవు. 10

వ॥ ఇటుల సంగ్రహంబుగా వచియించి వారల సాదరంబుగ వీడ్కొలిపె. తదనంతర మొక్కనాడు నళినభవసముద్భవులగు మునిసార్వభౌములను, వితతసామ్రాజ్యఘటనాధురంధర ధరణీవరోత్తములను మహాధర్మసంస్థాపనాధానపూరుషులను పలునేలలనుండి రావించి యీ యుగభూమ:ఖండు తన్మహాపరిషదంతరముననిల్చి యిట్లు వచించె 11

మాంధాత విశ్వమానవ సమాజసామ్రాజ్య సమగ్రాభ్యుదయావహ
నూతన సంస్కార లక్ష్యములు విశదీకరించుట.

ఉ॥ అంచిత సత్యధర్మ మహి § తాంతర బాహ్యానువర్తనా సుధా
సించిత దర్పణాయిత సు § జీవితులార! కనంగ నేకతా
సంచిత శాంతి సౌఖ్యమయ § సాధ శుభస్థితి కాది వైరులై
కించ ఘటించుచున్నయవి § కేవలమై మత జాతి భిన్నతల్. 12

తే॥ సమసినవి కాని పలుచోట్ల సాగి తేగి
క్రొత్త క్రొత్త సమస్యలఁ గూర్చి పేర్చు
చున్నయవి కొన్ని తావుల నూటితప్పి
వానిఁ బోకార్పవలయు న వంచనముగ. 13

కం॥ తూరుపుఁ బడమర నెఱుఁగని
వారలపై నల్పబుద్ధి వర్ణితమూర్తిన్
బేరెమువారెడి మతములు
పూరించిన తమము ముందు పోకార్పవలెన్. 14

శా॥ సారాసారవివేకముల్, విపుల విజ్ఞానంబు వేమోములన్
చేరన్ జట్టిగఁ జాలియున్నయవి యుజ్జీవింపఁగాఁ బోలదే!
భూరిజ్ఞాన తపోధనుల్ గురులు సమ్మోహాంబువాపంగ ను
న్నారల్ వీరలు సర్వలోకమత విన్యస్తాత్ములౌ టొప్పదే! 15

చం॥ మతము సుసేవ్యమొక్కెడ సమాజ హితంబది ధర్మమూర్తియై
వతము తమోపహం బఖిల వాంఛితదాయక మైక్యసాధకం
బతికయి యాత్మశోధన తదర్చన దాన నరుండు పాకశో
ధిత కనకంబు పోల్కి గురు తేజమునన్ విలసిల్లు నెప్పుడున్. 16

మ॥ పలుకోణంబుల యద్దమందు ప్రతిబింబం బట్టు లజ్ఞానవుం
దలల్ వేరగుమూర్తులన్ వెలయు నాదైవంబు నొక్కండ కా!
వెలలన్ జేసిన నజ్ఞతాతమము సంవిత్త్వంబు వెల్గొందుటన్
దలఁగున్ భేదములెల్ల నేకతయు సుస్థంబౌ సమాజంబునన్. 17

శా॥ అన్నారాయణుఁ డాది వర్ణియయి యాఖ్యానించె ధర్మమ్ములన్
సన్న్యాసంబున నెల్లధర్మములు విశ్రాంతింగనుం గాన త
త్సన్న్యాసంబున మించు నా వటుగు నాత్మజ్యోతిఁ గొల్వం దగున్
దన్నామాకృతు లొప్పు గేస్తులకు నెన్నన్ జప్యమై పూజ్యమై. 18

తే॥ ధర్మపూరుష దివ్య చిత్రంబు సకల
ముద్రికలమీద నాణక మూర్తులందు
కేతనములందు సంస్థాని కేతనముల
నెలకొనునుగాక యెల్లరు నిరతి మ్రొక్క. 19

ఉ॥ జ్ఞానగుణమ్ములన్ జగతి సర్వము సుస్థితిసాగు గౌరవ
స్థానముఁబొందె యగుట జ్ఞానగుణోజ్జ్వల మానవాళిసం
దానిత జాతియొక్కఁడె సుధాస్పృహణీయము దాని నెల్లెడన్
మానుగ నెల్లవారలు సమన్వితదీక్షను పెంపఁగావలెన్. 20

ఉ॥ జ్ఞానపవిత్ర వృత్తపురుషప్రవరుండె సమాజసభ్యతా
స్థానముగాంచు వర్గకుల సంజ్ఞల సందులనుండి నక్కుచున్
గానఁగఁ గాదు పూరుషుఁ బ్రకాశిత వృత్తనికేతనంబుగన్
గానఁగనొప్పు సత్త్వజని గన్నదు కాంచనమూర్తి మెచ్చఁగన్. 21

తే॥ ఈదృశవిశోధనమ్మున నెంచనెంచ
పాకశోధితభర్మంబు పగిదిమెఱయు
పురుషులసమాజ సుశ్రేణి భూతలమ్ము
పుణ్యలోకమ్ము పోలికఁ బొల్చుఁగాక. 22

ఉ॥ మానవవిశ్వసంస్కృతి సమానగతిన్ విహరింప సర్వవి
జ్ఞాన నిధానమై సురవశంకరమై లలితోక్తివర్ణసం
స్థాన సుపేశలంబయిన సంస్కృతభారతి విశ్వభారతీ
స్థానముచేకొనున్ బ్రకటసంస్థలనెల్లెడ రాచపల్కుఁగాన్. 23

తే॥ అఖిలమానవ భువనకల్యాణమునకుఁ
గంకణముకట్టి నిలిచిన కర్మఠులము
మహితసంస్కృతి మహిమకు, మర్త్యమాతృ
డమరతేజస్వి యగుటయు నఖిలదిశల. 24

తే॥ మెఱపనేలయు సస్యసంపూర్ణమగుట
పూరిపుడుక మహౌషధీపూర్తిఁ గనుట
నిత్యలక్ష్యము లిమ్మాటి నియతసిద్ధి
పడసితిమయేని సర్వుల భాగ్య మదియ. 25

తే॥ ధర్మసామ్రాజ్యలక్ష్మిని శాంతమహిమఁ
గాటకము, భూతవిప్లవగ్లాని హాని
వెనుకముందుల నరయుని వింతమృత్యులు
ధరణినెడబాసి యెటకేనిఁ దరలుఁగాక. 26

తే॥ మఱపు, సోమరితనమును § మాంద్య మనృత
చౌర్యవైరములును హింస § ఛద్మవృత్తి
రోగములు చీకులంగ § వైరూప్యములును
మర్త్యలోక సుదూరమై § మసలుఁగాక. 27

తే॥ లక్ష్మణగుణాఢ్యులార! యీ § లక్ష్యములను
మీదు విజ్ఞాన చాలని § మెదిపి మెఱుగు
లెత్తుఁ డన నిందు నొక్కండు § నెడము సేయ
నొల్ల మన్నిటఁ జేరాస § రొందవె మాకు. 28

వ॥ అనుచు నాసభ్యు లామోదించుటయు వెండి నయ్యావనీపాలుండు. 29

ఉ॥ నూతనవిశ్వసృష్టికి ను § నొగటి రుగ్మత లెల్ల నూడ్చి చే
యూతగ నొండొరుల్ నిలచి § యుల్లము నుత్తలుఁ జేత లొండుగా
నేతరిఁ బూనినార మొ య § దెల్లయుఁ బూర్ణతఁగాంచుదాక మా
చేతము చేతలుఁ విరతి § చెందవు విశ్వము వేగ మేల్కొనుఁ.

వ॥ అని పలికి యా సమితికి సముచితవిధానంబున విధుపఁ దెలిపి
యెల్లవారల సగౌరవంబుగా వీడ్కొల్పె నంత. 31

భారతీయాదర్శ సంస్కృతి ప్రతిభతో మానవజగం
బభినవాకారంబున మెఱయుట.

ఉ॥ నూటికి నూఱుగా నలమి § నూతన సంస్కృతి కౌముదీగతిఁ
మాటలు సేతలుఁ గుణ స § మాజము నొక్కట తీవ్ర రూపులా
పాటున సర్వమానవులు § వర్తిల విజ్ఞత రాజకీయస్థం
గోటుల సాంఘికస్థితులఁ § గుర్మిమ్మరె నంత భిదా తమోఘ్నమై. 32

తే॥ అఖిలమానవ భువనమ్ము § నమరవాణి
భారతాదర్శ సంస్కృతి § బంధ లలిత
గేయములఁ బాడఁ జొచ్చె నా § ప్యాయనముగ
కాలవాహిని నడ్డంగఁ § గలఁ డెవండు.

తే॥ రంగవల్లుల భవనమ్ము § లంగణములుఁ
జిత్రికమ్ములనాస్య ఘ § శేశయమ్ము

లాభరణరాజి స్త్రీ పురు § షాంగకములు
మెఱయఁజొచ్చెను సొగసుల § మేఱ లగుచు. 34

తే॥ దైవవిగ్రహ చిత్రాభి § ధానములకు
నోఁచికొనవట్టి యిండ్లెల్ల § నూతనముగ
ధర్మనామక వైకుంఠ § ధవలమూర్తి
చిత్రసంజ్ఞల నొప్పె వై § శిష్ట్యమడర. 35

చం॥ కరములునాల్గు శుభ్రఘన § కాయముఁ గెంజెడ లచ్ఛవల్కలాం
బరము మృగాజినంబు చెలు § వంబగు జన్నిద మక్షమాలయున్
వరజలకుండి దండమును § భాసిల నింపగు వర్ణిమూర్తికిన్
బరమునకున్ సునిశ్చలత § పశ్చరణాత్మకపూజ సల్పుచున్. 36

తే॥ దయిత! వైకుంఠ! యోగీశ! § ధర్మపురుష!
అమల! అవ్యక్త! పరమాత్మ! § "హంస" నామ!
ఈశ్వర! సువర్ణ! యనుపేర్ల § నెంచి విశ్వ
మానవ జగమ్ము తలకొని § మతము మాని. 37

మ॥ సమదర్శిత్వపుఁ బైఁడి పళ్ళెరములో § సౌభ్రాత్రి సంజ్ఞామృతం
బమలౌదార్య సమాఖ్య వర్తినిడి స § మ్యగ్జ్ఞానమున్ దీపమున్
సమతంగూర్చి నివాళి యెత్తెడిని హ § ర్షస్ఫూర్తిమై ధర్మత
త్త్వములం బాడుచు నేకకంఠముగ ను § త్సాహప్రభల్ నిండగన్

తే॥ ప్రకృతిజననీ సుమృష్టాంక § పాళియందు
జనులు హాయిగ ధర్మ § సుస్తన్యములను
గ్రోలుచు వసింప నిట్టులు § కొన్నియెడలఁ
ప్రజలు కుములుచునుండిరి § ప్రభులపెళల. 39

మ॥ తమపక్షంబులు పైకిరాగఁ దమ బాం § ధవ్యమ్ము సంపన్నమై
తమసేవ్యత్వము దీర్ఘమైపరగ శ్ర § ద్ధా యుక్తి శాసించుచున్
దమపాపంబు లడంపఁ బుణ్యములు చెం § దన్ స్వార్థనిష్ఠన్ బ్రజా
సముదాయంబును పీల్చి పిండుచు నసృ § గ్జాలంబు నిస్సీమమై. 40

తే॥ అభినవోజ్జ్వల సంస్కృతు ✽ లందనీక
భానిసలమాడ్కి స్వప్రజా ✽ వ్రితతిఁ గనుచు
తలలు మొదలింప మొట్టుచు ✽ దయ తోఁ బంగి
కాలవాహిని కెదురీత ✽ గా శరించి. 41

శా॥ అంగారాది నృపాలు రార్వురు మహా ✽ యత్నంబుతో యావనా
శ్వం గామాద్యరిషట్క మాత్మఁబలె నాకపుణ్యాత్ము స్వాయత్తుఁజే
యం గత్తుల్ నడి దూయసాగిరి తదీ ✽ యాఖ్యల్ వినన్ మెచ్చునే
యంగారమ్మును గ్రుక్కుకాంతము తమో ✽ హారి ప్రపుణ్యవ్రతున్

చం. అవని జనానుపాలన స ✽ మాసవిలోచను డర్కవంశ సం
భవుడు పవిత్రమూర్తి తమ ✽ పాణుల కిచ్చిన స్వప్రవర్తనా
నవనవకావ్య సంపుటి జ ✽ నంబు దినంబును సర్వపత్రముల్
కవలెడలించి చూచియును ✽ గానరు కాముఖారివర్గముల్. 43

తే॥ భారతేతరవర్ష భూ ✽ భాగములను
నిరుపురమ్ముల రాష్ట్రన ✽ నరులు లేని
యతడు పజ్జన నరులుంట ✽ కాత్మదోస
మనుచు మరుగున నిజవృత్త ✽ మరసి యరసి. 44

ఉ॥ వేడను రాజ్యవైభవము ✽ వేడను సౌఖ్యము నాకభోగముల్
వేడను దుఃఖతప్త జన ✽ పీడల మాన్పి సుఖంపఁ జూడఁగా
వేడెద నన్నదమ్ములుగఁ ✽ బ్రేముడివర్తిలుచుండ నెల్ల; రా
వేడుకకన్న వేరొకడు ✽ వేడుక డెందము కోరదెన్నడున్. 45

వ॥ ఇట్లు తలపోయుచు మఱియు మూలమూలల గిరిగహన భూభాగం
బుల సంచరించి యందందుఁగల జనవిసరంబులకు వృత్తి వర్తనమ్ములు
పరిశీలించి నవ్యజీవన సంస్కృతులు చొప్పడ నమ్మహాశయుండు.

శా॥ విద్యాకామగవీపయఃప్రస్మృతి మా ✽ ధ్వీకమ్ము ధర్మాఖ్యముల్
సద్యోగంబుగఁ గూర్చి త్రావనొసగన్ ✽ సౌభ్రాత్రపుం జక్కెరన్
విద్యుద్వ్యాప్తిగ నూత్నసత్వరుచు లా ✽ వేశింపఁ గ్రొంగ్రొత్తలన్
హృద్యుండయ్యె మనుష్యమాత్రుఁ డపుడెం ✽ తేఁ గానలన్
గట్టులన్. 47

తే॥ పంచభూతము లటు లాత్మ । పద్ధతులను
తప్పకుండఁగ జగమాత్రి । ధామ ధామ
సన్నలఁ జరించుచుండె నీ । శత్రుచయము
"కత్తి ముట్టంగ నేరని । తిత్తి కాదు". 48

తే॥ అనుచుఁ దన్నీసడించుచు । ననుకలమ్ముఁ
గయ్యమున కుఱుకుచున్నను । ముయ్యతీర్పు
మనసుపెట్టడు జననాశ । మునకు వెఱచి
యంతకంతకుఁ దత్ప్రజ । కడలు మించె. 49

వ॥ అయ్యెడఁ దనహృదయముకురంబున జాలిగొలుపుచూపులతోఁ
గోచరించు తత్ప్రజాసికదీనవదనంబులమీఁదఁ జదివికొనినయక్ష
రంబులు తెప్పించిన యావేదనతో నాకర్తవ్యపరికలుండు

ఉ॥ సంకుచితాత్ములై నిజవ । శమ్మగు తెల్వియుఁ బొల్లుగాఁగ నే
జంకును లేక స్వప్రజకు । సంకటముల్ ఘటియించి స్వార్థతా
కింకరులైన యీ నృపుల । గేరడముల్ విడిపించి యుత్తమ
గింకరులన్ బొనర్తు హరి । కిన్ శుభవర్తికిన్ ధర్మమూర్తికిన్. 51

వ॥ అని తలపోసి కాలగతికి మాఱొడ్డి నిలిచి ప్రకృతి పరిణామంబు వరి
కించక తాతలనాటి చక్కట్లు తిరుగుళ్ళతో మాసిపోయి ప్రాతఁగిలిన
తదీయ హృదయపుటంబులపై మదీయ సాక్షాత్కారంబున నుబి
కెడు నునుకు నెత్తుటం గొత్తరంగుపట్టించి ప్రజాభ్యుదయ దోహదం
బులగు నవ్య శిల్ప కళారహస్యంబుల ప్రాణము పోడనని నిశ్చయించి
కొని యొకశుభవాసరంబున ప్రస్థానభేరి మ్రోయించి. 52

మాంధాత్మ మహీపాలుఁడు జైత్రయాత్రకు వెడలుట

చం॥ మితబలయుక్తుఁడై వెడలి । మేలనవిశ్వము కాశికాపురీ
పతిరచితాతిథేయుఁడయి । ప్రప్రథమంపు శుభాభిశంసియై
కుతుకము పెంప నొలఁ జని । కూరిమి జానపదాళి త్రోవలో
వితత దుకూలముల్పఱచి । వెల్లిగ తావులఁ జిమ్మ గ్రొవ్విరుల్. 53

చం॥ ఘనముగఁ జల్లి యాఘనుని - కంఠము హారపరిష్కృతంబుగా
నొనరిచి రత్నరాశి కన - కోత్కర మిచ్చుచు నుక్తిమాధురిన్
వినిచిరి యావతంబు కల - నిస్వనమంజుల గీతమంజరుల్
గొనబుగ పాడి రింపుగను - గూడి సుమాలి నివాళు లెత్తుచున్. 54

మ॥ తను నిష్పాటను హాజ్జహాజ్జకు ప్రజల్ - తార్పన్ మహా భూమిశన్
మనుజాధీశుడు వ్రీడితాత్ముడయి స - మ్రిత్వంబు శోభిల్ల నా
జనులన్ శీల పవిత్రులార! మము ను - చ్ఛస్థానమానంబులన్
గనుచున్నట్టుల నొంచొరుల్ తమరు సా - కాంతున్ గ్రియావంతులై

మ॥ మెలగన్ మీయెడ నుచ్చతంగనుచు నా - త్మీయాచ్ఛ ధర్మక్రియల్
చెలగన్ లోక నిదర్శనంబులయి భా - సిల్లన్ సిరుల్ శ్రేయముల్
లలివర్ధిల్లుచునుండఁ గాంచుటయ యు - ల్లాసంబు మాకున్నతుల్
బలమున్ దేజము మేలు గౌరవము సం - పన్నప్రభుత్వమ్మునన్.

మ॥ కృతకాకారసమాజవర్మితధరి - త్రీనాథదుర్విప్లవ
క్షతు లుల్లంబును వేఁచుచుండ నిపుడీ - సన్మానముల్ వచ్చునే
క్షతిపైఁ జందనతైల మాత్మను సుఖ - స్వాస్థ్యమ్ములన్ గూర్చునే
కృతసన్మానము లివ్వి మీహితపుని - క్షేపంబులై వర్ధిలున్. 57

తే॥ అనుచు తద్గత్త విత్తౌఘ - మచటధర్మ
సంస్థల పరంబు గావించి - చనవుగమర
వీడుకొల్పంగ నాజనుల్ - వెడలజాల
మరులక్రూరాసులకు మిము - నప్పగించి. 58

తే॥ అనుగమింతుము మాసేవ - లందికొనుచు
నాత్మరూప! యమిత్రుల - నణఁచి గెలుము
నాఁగ లేసవ్వ తేట లా - ననము ముంప
తీవుటుబ్బున నృపతియుఁ - దెలిపె నిట్లు. 59

తే॥ కన్నతండ్రులు! మీవల్కు - గారవమున
పులకితంబయ్యె నెమ్మను - వలదు భీతి
యోర్తు నొక్కటి పగతుర - నుక్కుమెఱసి
ధర్మవాక్కండె సర్వస - ద్రక్షకంబు. 60

తే॥ ప్రజల రక్షింపఁ బుట్టిన బాహుబలము
దాచి యవ్వారలను ప్రవి దారణమున
బలిగొనంగఁగఁజాల నో ప్రియతులార!
ధర్మమునునమ్మి యుండ్లకుఁ దరలుఁడెలమి. 61

వ॥ అనిపల్కి తత్ప్రజాబృందమ్ము వీడ్కొల్పి పరిమితపరివారంబుతో గిరిసరిద్విపినంబుల నుత్తరించుచు పూర్వదిశాభిముఖుండై చనుచుఁ గ్రమంబున ఫల్గునీనదీతీరంబున నమరావతింబురుడించు గయా నగరంబుచేరువకుఁ జనుటయు నాప్రోలి యేలిక "గయుం"డను నర పాలుం డాసార్వభౌముని సరకుసేయక కయ్యంబునకుఁ గాల దువ్వుచు నిట్లు సందేశమంపె. 62

మాంధాతతో గయుండు కయ్యంబునకుఁ గడంగుట.

ఉ॥ కోసలభూప నీ వినయ గుంఫిత జంబుక ధర్మసూక్తముల్
కానునక్తైనఁ జెల్ల విటఁ గాలిటుపెట్టక దూర ముంచుమీ
వాసియు వన్నెయున్నిలుచు వచ్చిన రాజ్యము వీరభోజ్యమా
రోసము కల్గనేని తగ రోపము చావమునూని నిల్వుమీ. 63

ఉ॥ ఆ నుడు లాలకించి యువనాశ్వతనూజుఁడు శూరమానికిన్
మానిత ధర్మబోధనలు మార్దవముల్ ఘటియింపఁజాల వా
హ్వానిత మచ్చరమ్ములు కరాసనముల్ ఘటియించు నవ్వనిన్
మానుగ నంచునెంచి గరిమన్ ప్రతివాచకమంపె నిట్టులన్. 64

వ॥ గయేశ! 65

చం॥ రవికిరణంబులున్ జొరఁగరాని పదంబులు కల్గు భూమిలో
దవులని చోటులుండవు సుధాసిత కామధుగాత్మధర్మస
చ్ఛవులకు; జంబుకాత్మలకు జంబుక ధర్మమెయుంగ వచ్చెడిన్
భవ దభియుక్త ధర్మమిట వర్తిలుపాటు గ్రహింతు మెట్టిదో. 66

చం॥ అనఘ! జనాత్యయంబు మన యాలమునన్ జరుగంగనోర్వఁ జ
క్కనినిలుఁడెక్కటిం దొడరఁ గల్గిన; "రాజ్యమువీరభోజ్యమే"

యను నుడు లాలకించి గయుఁ § డౌర మదోద్ధతి! పిట్టకొంచమై
నను ఘనమయ్యెఁ గూఁత కడ § నంబునఁ బ్రాయఘఁ బొంగు
నార్పెదన్. 67

చం॥ సమయమువచ్చె నేటి కరి § సంధిల నయ్యెనటంచు నత్స్వక
ర్త్వము మెఱయంగ నంతఁ బ్రతి § నార్తుకు నుత్తరమంపె "వట్లక
య్యము సలువంగలా"రమని § యూవ్రులు మంత్రులు నాలు నాత్మ
జుల్
"తమకము వల్దు తన్నృపుని § దాకఁగ" నంచనఁ ద్రోసి యుద్ధతిన్

చం॥ కరకర పొద్దు పుట్టుడును § కయ్యముసల్పఁగఁ గాచియుండె నా
ధరణిపుతోడ నెక్కటి ర § థస్థితుఁడై విలు నమ్ము లూని తాఁ
బరిమళవారిసేక గత § పాంసు విచిత్ర పతాక తోరణా
వరణ వరిష్ఠ విష్టర వి § భాసుర సంగరరంగమందునన్. 69

ఉ॥ రాజులు రాజబాంధవులు § రాణువపెద్దలు ప్రెగ్గడల్ పురిన్
రాజిలు ముఖ్యులా సమర § రంగమునందున ప్రేక్షకత్వ వి
భ్రాజితులై నిజాసన విభా § గము లుల్లసిలంగఁ జేసి ర
య్యాజగవాఖ్య చాపము స § హాయము గా యువనాశ్వసూనుఁడున్

తే॥ ధర్మసత్యాలు తనుశిర § స్త్రాణపటిమ
నాత్మ వెలయింప బవరంపు § టవనిఁ జేర
ధర్మదైవత మూర్తి చి § త్రప్రదీప్త
కేతన స్యందనస్థుఁడై § చేతమలర. 71

వ॥ అంత నయ్యెడ. 72

తే॥ ధారుణీ! నేగుదెంచిన § ధామనిధియొ!
భువిని దిరుగంగవచ్చిన § దివిజపతియొ!
ధర్మము కనంగవచ్చిన § ధరణిధరుఁడొ!
యనుచు నసిరీక్షితస్థితి § నచటిజనులు. 73

తే॥ రాజమార్తాండుఁ బొడగాంచి § రభసమునను
చాపకట్టుగఁ బడి రా ర § సాప్రభుండు

గయుఁ డాకించుక చకితుఁడై కార్ముకమ్మ
నంటె భావంబు తెలియని యట్లు కాఁగ. 74

తే॥ అప్రతిభుఁడౌచు నంతలో నాత్మవరణ
మాచరించిన యరిఁ జూచి యౌవనాశ్వుఁ
డనియె నరపాల! యార్జవ మార్యగుణము
భీతి కెడమీదు దానికై వేఁడు జగము. 75

ఉ॥ ఉల్లము తమ్మిరేకమిహి కోదలవంబునఁ బోలెఁ దద్వచో
భల్లమునం బ్రవిద్ధముగఁ బల్కె గయుండును కోసలేశ! నీ
యుల్లపుఁ టాలవాలమున నూరెడు నార్జవ మెంతపాటిదో
తెల్లముగా నెఱింగెడిని తీక్ష్ణ మదీయశరాళి యిప్పుడే. 76

వ॥ అనవుడు నాసౌజన్యనిధియు 77

తే॥ ఇటుల మీయట్టివారు ప రీక్షకులుగ
నిలిచినప్పుడ లక్ష్యంబు నిల్చు మాకు
నిదె యొసంగితి ముల్లము మొదలుముట్ట
కనుగొనుం డిదె మా నమ స్కారశరము. 78

వ॥ అప్పు డాదురభిమాన విరసుండగు గయుండు. 79

తే॥ ధూర్తతనమును జూపుదే దుష్టశీల!
కాచికొమ్మని కసితీరఁ గాడనేసె
దారుణశిలీముఖాళి మాం ధాత వాని
నపుడ ఖండించి యరిముంచె నంపవాన. 80

వ॥ అంత నాగయుండు నగ్గలంబైన రోసంబునఁ బగతు నరదంబు శిథిల పరుపను, రథ్యంబులఁ గూల్పను, సారథిని సమయింపను, కార్ముకంబు ఖండింపను, శరలాఘవంబు చూపందొడంగె. సమరకళానిపుణుండగు నీ సాకేతవిభుండు శత్రుశరంబుల కవకాశంబు కలుగనీక వాని నంతరంబునన తుత్తునియలుచేయుచు నెదిరి సారథిని సమయించి రథ్యంబులఁగూల్చి రథంబు చూర్ణంబు చేసె. అంత గయుండు వెండి వేరొండురథంబు నధిరోహించి విరోధిపై నంప

జల్లు గురియించె. కోసలేశుండును బ్రత్యుత్తర మొసంగుచు నెఱకలనొంచి వైరిని సమరవిముఖుని జేయనెంచి శూరవిలాసంబు చూపఁదొడంగుటయు నయ్యెడ నా గయావిభుండు తన జతనంబు లెల్ల విఫలంబులగుచుండుటకు నెరి గుందినజాడ గన్పింపమిఁ నచ్చెరువందుచుఁ జాలసేపు పోరాడి గురితప్పని వైరిశిఖంబులు శరీరంబు జల్లెడచేయ నంగసంధులనుండి యస్రంబు లుఱులఁ గ్రమంబున సత్వహీనుండై స్మృతి తప్పి స్యందనమ్ముపై వ్రాలె నతనిసూతుం డరదంబు సమరరంగంబు తొలంగఁ దోలికొనిపోయె నత్తఱి నారాజ మంత్రులు రయంబునఁ జనుదెంచి వలయు శైత్యోపచారంబులు సల్పియు తడవునకుఁ గృతార్థులు గాఁజాలక నృపుని నగరునకుఁ గొనిపోవుటయు, మాంధాతృమహీశుండును క్షత్రియకర్మం బతి క్రూరంబని నొచ్చికొనుచుఁ దన పటకుటీరంబునకుం జనియె నంత నాలవనాడు. 81

ఉ॥ కయ్యపుఁ బాచితంబున నఘంబు లహమ్మతితో గతించుటన్
దయ్యపు మేలిచూపు ఫలితంబుగ బన్నముఁబాసి తద్గయుం
డయ్యువనాశ్వనందను పదానతుఁ డౌచును "సార్వభౌమ" మీ
తియ్యనిచూపు మాపయినఁ ద్రిప్పి మముం గరుణింపుడంచుఁ
దాన్. 82

ఉ॥ కానుకపెట్టె కాంచన నికాయము రత్నచయమ్ముతోడ న
మ్మానవనాథమౌళియును మక్కువతో గయు లేవనెత్తుచున్
దానును లేచి చెంత నుచితంబగు పీఠిఁ వసింపఁజేసి యి
ట్లా నరనాథుఁ బల్కె నయి కాంతర తేజ మదెచ్చరిల్లఁగాన్.

సాకేతవిభుండు శరణాగతుండైన గయుని గారవించి
హితోపదేశ మొనర్చుట.

చం॥ అనలుని మెప్పుఁగొన్న మిము నంటిన మేను పవిత్రమయ్యెడిన్
జనవర! మీదుపల్కులు విచారవిధిన్ వెలువొందు ధర్మవే
దనరునఁ జూచి ప్రోచెడి ననిందిత రీతిఁ దనున్ భరించు వా
నిని మఱి ధర్మవర్తిని నెమ్మినిఁ దోడ్పడు నెల్లప్రాణులున్. 84

చం॥ జనవర మీఁసమక్షమున జన్మము నెత్తిన మేము తెల్పఁగా
ఘనవిషయమ్ము లెవ్వి? శుభ కాంతి జనాళి కొకింతమాత్రమీ
మనమున నుంతుమేము మును మానవనాయకు లాత్మలాభసా
ధనన కృతార్థులౌచును వి ధాయకకృత్య విచారశూన్యులై. 85

కం॥ మనుగడ చెల్లించిరి య
మ్మనుగడ యర్వాఙ్నృపాల మండలి చదివెన్
కనఁ డొక నృపతియుఁ బ్రజలకు
ననువగు నభ్యుదయ మంగ ళాయతనమ్ముల్. 86

చం॥ పరమపవిత్ర దైవమయ భావము చేతుల నెట్టివైచి భూ
వరుడు సమస్త ధర్మముల పై విహరించెడు రాజధర్మమున్
ధరణిని గూల్చి తత్ప్రజల ద్రవ్యముమాత్రము గొంచు నున్నచో
వెరవరి బందికాడు ప్రజ వెట్టికిఁ బెంచెడు దీనుడౌఁగదా! 87

మ॥ ప్రజ లాచార్యకమూన భూపులకు దే వత్వంబు పోవంగ శి
ష్య జనత్వంబు వహించినన్ గడమ మ ర్త్యత్వంబునే నిల్పెడిన్
నిజధర్మచ్యుతి కాఁగ దర్పతమము న్నిద్రస్థితిన్ గూలము
ద్రుజమై హృత్కుఠారంబు నిండఁ బ్రజలన్ దూఁటాడు
వారెట్టిరో. 88

శా॥ నానావర్ణ మరీచి జాలమున నా నాళీకమిత్రుండువోల్
నానావర్ణ మనుష్యజాలమున భూ నాథుండు పూర్ణాత్మకుం
డైనన్ దేశము శోభతో వెలయు న య్యాకాశమట్లంటి య
న్యూనత్వంబుగ నెల్లవారి వెలి లో నూనన్ బ్రజల్మెచ్చరే. 89

ఆ॥వె॥ ప్రజల మెచ్చుకోలు ప్రభువుల జీవంబు
ప్రజల ప్రబ్బుకోలు ప్రభుల కీడు
ప్రజల జీవమూన భద్రితోన్నతులకు
భావ ధర్మనిరతి పూఁటకాఁపు. 90

కం॥ పరమాత్మచేతఁ బ్రకృతియుఁ
బురుషుఁడు వలెఁ బ్రజయు ఱేఁడు పొదువంబడి రెం

దోరులు తగఁ గూర్చుకొందురు
ధరణీవరముఖ్య! పరమ ధర్మముచేతన్. 91

తే॥ ధరణిపతులకు దైవ ప్రదత్తమైన
కల్పకము రాజ్య మఖిల సుఖమ్ములొసఁగు
నదియు ముదితప్రజానుర క్త్యమృతసేక
వర్ధితంబయి ధర్మాల వాలమందు. 92

తే॥ నిర్మలంబు నభేద్యమా వర్మమరయ
ధర్మమయ్యది యేవేళ ధరణిపతికి
వర్మమది మిమ్మువిడువక వరలుగాక
తనరు మేల్బంతివై మీరు ధర్మనిష్ఠ. 93

చం॥ అని విరమించె నావలుఁ లాత్మగతిన్ వెలయింప నాగయుం
డనుపమ ధర్మతేజము హృ దంతరసీమను నిండి పొంగెనా
ననితరలభ్యకాంతి ముఖ మందున చెల్వమునింప నిట్లనున్
"జనవరనాయకాగ్రణి! వి చారమకోజ్ఞ భవద్వచస్సుధన్. 94

చం॥ కనుగవ గొఱ్ఱెదాటునడఁ గప్పిన దుర్వ్యయమంగె నింక నె
మ్మనము కలంకదేరె నవ మార్గము గోచరమయ్యె చూడ్కికిన్
తనిపెద మిమ్ము లోకము య థావిధి వర్తన నింతనుండి నా
ననిపెను గారవించి గయు నంతటఁ గోసలనాథుఁ డిమ్ముగాన్.

కోసలనాథుఁ డందు గయుని కైవసమొనర్చికొని యంగరాజధానియగు
చంపానగరంబున కేగి యాతనితోఁ బోరుట

వ॥ తదుపరి మాంధాతృ మహీపాలుండు తద్విషయంబున నెల్లెడ ధా
ర్మిక సమాజముల నెలకొల్పి గయాధిపతిని వానికెల్ల మహాధ్యక్షు
డుగా నియమించి యందందు సమకూడినవిత్తంబు వచటి వివిధసం
స్థలకు నొసంగి సపరివారుండై యాపురంబు వీడి పూర్వదిశాభిము
ఖుండై చనిచని గంగానది నుత్తరించి చంపానగరంబు పరగడలఁ
జేరఁ తదధీశుం డంగరాజు కయ్యంబునకుఁ గాలుదువ్వుచు సైన్య
సమేతుండై మోహరించినిలచిన నవ్వాహినింగాంచి తనమనంబున
నిట్లు తలపోసె 96

తే॥ ఈసునకు దాసుఁడైన యీ । యిమునికొఱకు
నిండఱును సంగరాగ్నికి । నిధనములుగ
సిద్ధమై రిట్టు లౌర! నేఁ । జేతులార
నిరపరాధుల నెట్లు మ్రిం । దింతు వీరి. 97

తే॥ ఈర్ష్య మానవ మానస । హీనవృత్తి
బహ్వనర్థమ్ములకు మూల । భాండ మరయ
దాని మొదలంటఁ గోసిన । గాని నరుడు
వృద్ధికిని రాఁడు రానీదు । పెరలఁగూడ. 98

వ॥ అనుచుఁ గొండొక చింతించి శత్రుచమూపతుల రావించి నదుప దేశంబుల సంస్కృతచిత్తులఁ గావించి ప్రజాభ్యుదయంబు గోరి బవరంబు మాని మీ ప్రభువుకు ప్రబోధింపుఁడని యొడంబరచి వారి ననిచె వారు నారేయి తమ రేనితో మంతనంబు సలిపి తుదకు తమ వైముఖ్యంబు నెఱువరించియు విఫలమనోరథులై యాతని మూర్ఖతకు వగచుచు నిజనివాసంబుల కరిగిరి. మరునా డుదయమున నంగమహీశుండు సైన్యమ్ముతో సమరసన్నద్ధుండై నిలుచుటయు మానవజగత్కల్యాణ బద్ధదీక్షుండగు నా సర్వమహీమండలాధ్యక్షుండు తీవ్రగతి రణరంగమ్మున కరుగుదెంచి యెదుర నిలిచి యున్న విపక్ష సైనికశ్రేణిపై నూపిరి త్రిప్పికొనక యొక్కమ్మడి నిశిత శరాసారంబు గురియించె. అంతఁ దమకట్టెదుట సాక్షాత్కరించిన దైవంబుపగిది జ్యోతిర్మయుండైన యమ్మానవలోకేంద్రుని గన్నులు నోరు విప్పగా విలోకించు నాసైనికులు కొండజుంటీగలట్లు గుక్కత్రిప్పికొననీనిచందమునఁ దమపై ముసురు నంపజడి వెల్లువకు నిలువఁజాలక చెల్లాచెదరై పిక్కబలంబు చూపిరి. అత్తఱి నా యంగమహీశునకు సాయంబు చేయఁ జనుదెంచిన జననాథ బృందమ్ముక్కుమ్మడి మీఁదికురుక నీ శౌర్యసారుండు చక్కనిలిచి చతురోక్తుల శాతశిలీముఖంబుల వైరుల వికలమానసుల వికలాత్ములఁజేయ నాముప వెనుజూపి వైతొలంగిరి. అయ్యెడ రోషకషాయితాత్ముండై చంపాధిపతి శత్రువును శరవర్షంబున ముంచె నమ్మా

నవనాయకుండు వాని నెల్ల ఖండించి యా దండిపగతు కోదండంబు తునుమాడి యతండు వేఱొండు విల్లుఁగొన దానిని తునియ నేసి యతని యురదంబు తుత్తునియలుగాఁ గొట్టె. మఱియు మారుతుం డినుమడించిన రోసంబుతో గదాదండంబు గైకొని కవియఁ దానును గదాహస్తుండై నిలిచి నిలువరించి తదీయ గదాదండంబు చూర్ణంబు చేయ నయ్యంగుం డుగ్రుండై మల్లయుద్ధంబునకుఁ దిరిగి భుజాస్ఫాలనం బొనర్చె. మాంధాతృమహీకాంతుండును నడ్డిబిగించి మార్కొనియె నప్పుడయ్యిరువురుఁ దాకుచు విడివడుచు ముడివడుచుఁ జరుచుకొనుచుఁ బెద్దయుం బ్రొద్దు పెనఁగు నెడ నటం గూడిన ప్రేక్షకలోకంబు 99

తే॥ కరియు కలభంబు పోరాడు కరణి నున్న
దార! సుకుమారుఁ డీ యయోధ్యాధిపతియు
విధివిలాసం బదెట్టిదొ విదితమగునొ!
యది భువింబడెఁ జూడుఁడీ యసమరణము. 100

తే॥ అనుచు నుండఁగ నయ్యయోధ్యాధిపతియు
పగతు సత్తువ తఱిగిన పాటు తోపఁ
గెలనికి తొలంగి మారుతు కాలుఁ గేలు
కుదియ నిరికించి రేకెత్తు కోపమునను 101

తే॥ మనుజ విషకీట మిది దీని మసలకిపుడ
మ్రింగఁజేయుదు మానవ రక్షణార్థ
మనుచు గుమ్మడిచందాన నవని నెత్తి
వేయ నుంకింప నంత ను ద్విగ్నులగుచు. 102

తే॥ అంగరాజకళత్రంబు నాత్మజులును
కదురయమ్మున మాంధాతృ నడుగుదోయి
వ్రాలి "రక్షింపుఁ"డని వేడ "బ్రదుకుఁగాక
బుద్ధిమై" నంచును విడిచి పుచ్చె నతని. 103

తే॥ గండశిల ఘట్టితంబైన కరణిఁ గమరె
నురము వీపును భుజయుగ మూరుయుగళి

తనువు తనువెల్ల నాయంగ § ధరణిపతికి
నలిపివై చిన జంబీర § ఫలమువోలె. 104

తే॥ మనసులో వేఁడి యది మటు § మాయమయ్యెఁ
జేతనామాత్రసారమై § చిదిసినట్టి
మేనమాత్రము వేఁడిమి § మిగిలెనపుడు
బలము మిగిలెను వేఁడికో § ర్వాటియగుచు. 105

కం॥ అంగుని పిడికిటిపోటుల
నంగంబులు మర్దితంబు § లయ్యెఁ యువనా
శ్వాంగజు దేహము కాంచన
రంగద్ద్యుతినొప్పె తొంటి § రసలేపమునన్. 106

తే॥ మిసమిసనెసంగు మాంధాతృ § మేనుగాంచి
నివ్వెఱగు తోప నచ్చట § నిల్చినట్టి
వార లీతఁడు ధరణిని § గారణాంత
రమున నుదయించిన యమర్త్య § రమణుఁడగును. 107

తే॥ కాక యీ తేజ మీశక్తి § కలుగునెటుల?
మర్త్యమూర్తికిఁ గల్గద § మర్త్యమహిమ
యనుచుఁ బల్కెడి జనతతి § వినదమణచి
యంగభూపతి యల్లన § ననియెఁ బతికి. 108

ఆంగమహీపతి యౌవనాశ్వుని యాజ్ఞానువర్తి యగుట

మ॥ జనతాకల్పక! సార్వభౌమ! గనసా § జన్యంబు దర్పచ్యుతిన్
బొనరుం గొందఱికట్ల నాకు మది న § వ్యామోహంబుతో దర్పమున్
జనియెన్ ధర్మవు గోచరించెడిని సు § జ్ఞాన ప్రభల్ పర్వెడిన్
జనెఁ జంపాపతి యీతఁ డన్యుఁడు భవ § త్సంజ్ఞాప్రవర్తుండిలన్

తే॥ అనుచు విశ్రాంతుఁడైన యా § యంగవిభుఁడు
పుడమి సాగిలి యల్లన § ప్రమొక్కుచుండఁ
జెమరుఁ గన్గవఁ గనుచు § నాత్మీతివహాళి
పులకితకరాల నెత్తి త § ద్భూమిపతిని. 110

చం॥ కరయుగళంబున న్మిగుల గాజియు బెట్టిన పై రమూజ సు
స్థిరముగ మారుపుట్టుపుగ దీర్చి మిముల్ మము బ్రోచినట్టి యా
హారికి గృతజ్ఞతా వినతు లర్పణచేసెద నేటి కిమ్ముగా
పురి కరుగుండు వెండియు బ్రమోదముగా గలియంగ
నయ్యెడిన్. 111

తే॥ అని సమాదర వాక్సుధ దనిపి పురికి
ననిచె తానును జన సౌల నాధరిత్రి
ధర్మసమితుల నవ్యావి ధా ప్రశస్తి
నిలిపి యెల్లెడ దత్సీమ నృపతి విడిచె. 112

వ॥ అంత సమ్మానవలోకేందుప్రింధు తూర్పుదెస మొగంబై చనుచు
గ్రిమంబున దుర్గమశైల కాంతారంబులు గడచి బ్రహ్మదేశంబున
కరిగి యచటి మహీపతుల యాహ్వానంబులు సఫలంబులు గావించి
తత్ప్రజాసముదయంబునకు నూతనోత్సాహంబు రేకెత్తించి యచటు
వీడి దక్షిణపూర్వంబున ద్వీపంబుల జనులకు చతురుత్సవం బొన
రించి యటనుండి తిరిగి పశ్చిమాభిముఖుండై వెడలి దక్షిణభారతం
బున సంధ్రివిషయంబు జొచ్చుటయు నా నేలతే డసితుండనువాడు
దొంగమఱుగున దారికాచి యెదుర నరుదెంచు నరలోకనాథు
నవలోకించి యార్భటించుచు నిలువరించి 113

యావనాశ్వం డాంధ్రాధిపతి నరిగాపుగాం జేసికొనుట.

తే॥ ఔత్తరాహిక వేషాల యాగడముల
కాశ్రయంబీయ దీ యస్త్ర దాంధ్రభూమి
వైతొలగు మిచ్చ లేకున్న వైతొలంగ
యావనాశ్వుండ! యొక్కటి నని నిలుము. 114

తే॥ అనుచు నవ్వీశ్వనేతపై నంపవాన
బిట్టుగురియించి యెడమీక వెల్లువగను
వఱపి క్రొవ్వాడిముల్కులు బదను చెడగ
రథ్య రథ కేతనముల సారథిని నొంచె. 115

తే॥ మారుపల్కున కెడమీని మార్దు చెయ్యి
నుబుకు నెత్తుటఁ గెంపారు నొడలు వణకఁ
గనులు నిప్పులు కురియ విక్రమము రూపుఁ
దాల్చినవిధాన నడరి యా ధరణిధవుఁడు. 116

మ॥ ధనువుం ద్రుంచి కిరీటమూడిచి తనుత్రాణంబు చెండాడి కే
తనముం గూల్చి రథంబు తున్మి మఱి రథ్యశ్రేణిఁ దూలించి పె
ల్చిన శాతాసిఁ గరానఁ బూని భువిన్ లంఘించి విద్వేషిపైఁ
జని పైకెత్తిన ఖడ్గముం దునిమి విస్రస్తాత్ముఁడై పైవయిన్.

మ॥ బడు నవ్వైరిశిరోధి పట్టి వెస ద్రొబ్బన్ వెన్క శాతాకృతిన్
బడి మార్చెల్లె నతండు దాయ యిటు లాపన్నుండుగాఁ గిన్కయున్
విడిపో నయ్యెడ మావరించె మఱియున్ వ్రీడాభరంబంతఁ గ్రుం
గెడు నుల్లంబున వానిఁ జేరి కనలెం దేఁ గీడు దాఁకొల్పెడిన్. 118

మ॥ అనుచున్ భూపతి వైరిఫాలమునఁ జేలాగ్రంబునన్ వీచుచున్
దను నీక్షించి తటాలునం జకితుఁడై తద్వైరి మూయన్ గనుల్
చని యాత్మీయరథస్థుఁ డయ్యెను మహో జాడ్యంబు జారంగ నాం
ధ్రినరేంద్రుండు సనిష్టదర్శనమ యా నాఁ బక్ష్మరంధ్రమ్ములన్
గనుచున్ భీతితొలంగఁ దేరి తలచెన్ గర్తవ్య మిట్లాత్మలోన్.

తే॥ అతుల కరుణాన్వితుఁడుగాక యన్యుఁడైనఁ
దేర్చునే తలఁ గ్రూరాసిఁ ద్రెంచుఁగాని
ప్రాణములు తీయవచ్చిన పగతుఁ గాచు
హృద్యశీలుని ముందు నే నెంతవాడ?. 120

తే॥ ఇనుము హేమంబుగా మార్పు నెనసినట్లు
పరుసవేదిని తన్మహాభాగు పుణ్య
పాణిసంస్పర్శ సాత్త్విక ప్రియతరూవ
మడరె నాలోన నమ్మేటి నాశ్రయింతు. 121

తే॥ మేల్పొనర్చెడి సజ్జనో న్నిమద మర్ష
దుఃఖకరజీవితులకు ప్రదోవ మడఁచి

శక్తవైద్యప్రయుక్త విషంబు నొప
ధ్వసితిని రుగ్ణ జీవప్రదంబుగాదె!! 122

తే॥ ఇటులఁ దలపోసి యసితుఁడు మిటకరించు
నాత్మ పరివారమును బురి కనిచి కొంటి
వెడలి యమ్మానవేంద్రుని యడుగుదోయి
వ్రాలె నయ్యెడ నా సార్వభౌముఁ డతని 123

చం॥ వినయున నాదరించి ధరణీవర! ధర్మ పవిత్రమూర్తియై
యనుకలము౯ బ్రభుత్వము నియంత్రితమైనఁ బ్రజా
సమాజము౯
మనియెడి సత్యధర్మ రుచిమాంసలమై యనిశమ్ము ముందు మీ
మనుగడ సత్యధర్మగతిమానితమై వెలయింప నొప్పగు౯. 124

తే॥ ప్రజల కాదర్శరూపుడు పార్థివుండు
తాన ధర్మంబు తప్పినఁ దప్పుఁ బ్రజయుఁ
బ్రజలు పాడితొలంగినఁ బఱచు సిరియు
వ్యాధి దుర్భిక్షపీడలుఁ బట్టుఁ బ్రజల 125

తే॥ అనుచు బోధించి ధర్మకేతన మొసంగి
యానృపాలుని ప్రార్థన నాదరించి
యరిగె శ్రీకాకుళమునకు నతని పురికిఁ
దత్ప్రజాళికి బోధింప ధర్మగతులు. 126

యౌవనాశ్వుడు ఆంధ్రావని విడిచి క్రమంబున సింధుదేశమున కేగి
యా భూజానిని జయించి మరుత్తనగరమున కేగుట.

వ॥ అనంతర మా ప్రభుశిరోమణి యాంధ్రావని వీడి పశ్చిమ పారావార తీరస్థ పురవరంబులఁ దిలకించుచు నటనుండి యుత్తరాభిముఖుండై పయనించుచుఁ గ్రమంబునఁ గుశస్థలీపురంబునకుఁ జని శ్వశురునకు సంతసమ్మగా దివసత్రయంబు నివసించి పిమ్మట సింధుదేశంబున కరిగె. అట తద్భూమీశుండు బృహద్రథుండు సమరసన్నద్ధుండై నిల్చె. శూరశిరోమణియగు నాసార్వభౌముండు శరాసారంబున

శత్రుసైనిక నికరంబు దైన్యంబునొందించి యంత రోషభీషణుండై మీఁదికివచ్చిన యెదిరిని వ్రాలిన వ్రాలుచు, తొలఁగినఁ దొలంగుచు నిలిచిన నిలుచుచు గుర్రక్కతిరగనీకుండ వీరవిహారంబు చేయుచు తనయురవడికి నిలువనేరక పలాయనమార్గంబు పఠించు వానిఁ బట్టి వశంబునం బెట్టుకొని యటనుండి యుత్తరాభిముఖుండై చని మరున్నగరంబు కురంగటకుఁ జేరంజనుడు తత్పరివృఢుండు మరుత్తమహీజాని 127

సీ॥ "యువనాశ్వపుత్ర! శైశవమాది సంతోష
కరమైన భవదీయ చరిత మిపుడు
వృద్ధులమా మాదు విషయమ్మునంగూడ
నిశ్శంకతఁ జరించు నీదు మదుకు
తనమున నామ్మచే దర్పణమ్మట్టులు
మలినమై గరువంపు నెలవుఁ జూపె
సాగినయెడలందు సార్వభౌమపదంబు
చెల్లించికొనుట సుశ్రేయ మరయ

తే॥ వ్యగ్రగతి మాని రోజించి యడుగు ముందు
పెట్టుటయు లగ్గ" టంచు చెప్పించె నంత
దాని నాలించి మాంధాత తలచి యిట్టు
లమ్మరుత్త మహీజాని కంపె కబురు 128

ఉ॥ సంతసమయ్యె మీ పవిత్ర సంహిత విన్నను విశ్వమానవా
భ్యంతర బాహ్యవర్తన లవన్ని ముఖాముఖ తెల్పఁగా గృహా
భ్యంతరవాససంస్తుత వయఃపరిపాటిఁ జెలంగునట్టి మీ
యంతికి వచ్చినాడను యథార్థము తెల్పితి ధర్మరక్షకై. 129

తే॥ పెద్ద చిన్న యటంచును పద్దు లెంచి
ధర్మమును తీర్చుకాలంబు దాటిపోవ
కుదురు నెఱి లేనియట్టి కక్కురితి సరుకు
కోరకుండ దింక దొరకదే కుతలమందు. 130

తే॥ సన్నిహిత వస్తువులు గూడ సత్వమునకు
భిన్నముగఁ దోచు వృద్ధుల పేదచూడ్కి
దుడుకుతన మానొ కాదొ నా నడత యిద్ది
తెలుపు లోకమ యయ్యాజ్ఞ మెలఁగువాఁడ. 131

తే॥ సార్వభౌమత్వ మది మహా సంపదయని
క్షత్రియుని స్వప్రయోజన సాధకునిగ
ధాత సృజియించె ననియు మీ తలఁపులేని
తోడరు మీయిచ్చ ధాతకే దుడుకుతనము. 132

తే॥ విపుల సంపత్సమృద్ధులై విశ్వవ్యాప్త
మరయకయ మాకు ప్రజలపై దొరతనమ్ము
నెఱపు నెఱజాణ దొరలను నిలిచినట్టి
సృష్టికర్తృ చరిత్ర చర్చింపఁదగును. 133

మ॥ కన నస్మత్కులవృద్ధులున్ భువి నలంకర్మిణతాగ్రశ్రేష్ఠులున్
మునివర్గస్పృహణీయ సంచిత తపః పూతాత్ములున్ తత్త్రిలో
చనదత్తాక్షయకాంచనాఢ్యులు నమస్కారార్హులే మాకు శా
సనముల్ లెక్కకు తే రటేమొ ప్రజలున్ సామంతులున్
మీభువిన్. 134

తే॥ ఒక్క వ్రేలును ముందటి కొలిఁజూప
మూఁడు వ్రేళ్ళవి తనయెడ మొనసిచూపు
నుభయపక్షంబులకుఁ జెల్లు నుపమ యిదియు
ప్రభులవర్తన బింబించుఁ బ్రజలగతుల. 135

వ॥ భవదీయ భుజానియంత్రిత భూతలంబున. 136

ఉ॥ ధేనువపుస్సుధామధుర దివ్యపరీమళశూన్యగోష్ఠముల్
పూని పఠించు బాలకుల మోములఁ గానని పళ్ళికూటముల్
జానుగ నల్కుముగ్గుల ప్రచారము తప్పిన గేహవీథులున్
మానుగఁ బైరుపచ్చలకు మానిన మళ్ళు పొలంబులుం గనన్.

చం॥ విరహితచేతనంబులయి వేనకు వేలుగ కానవచ్చెడిన్
దొరతనముబ్బ మీవిషయ దోషము లాఱఁగ ధర్మభూసుధా

పరిచితిఁ జేతనంగొలిపి । భావము లిర్గడ నేకరూపమై
యురవుకొసంగ సాయపడి । యిమ్మెగ శాసనభంగమేర్చెదన్.

ఉ॥ శాసనభంగమేర్పుటకు । సాధ్యముకానిది రాచవానికిన్
మీసలుపట్టి క్రోల్పులుల । మీసరమానిపి ధర్మదేవతో
పాసన లెల్లెడ న్నిలుపు । వాడను సాయపునూర్యుఁ డగ్నికిన్
భాసిల తేజమిచ్చుకియు । భవ్యభవద్యుతి మాకొసంగుఁడీ. 139

తే॥ సాత్త్విక త్యాగ విస్ఫూర్తి । శాంతిఁ గొలువ
నస్మదీయ విధేయత । హాయినీయ
ప్రజలు ధర్మానురక్తులై । రక్తిఁ జూప
ధర్మరక్షణ వెలయుఁ డా । దర్శకలన. 140

వ॥ అని ప్రతిసందేశ మంపుటయు విని యమ్మరుత్తమహీశుండు. 141

ఉ॥ దాసరి శంఖమూదిన వి । ధంబునకున్ బధిరుం డపార్థమున్
జేసెనుభంగి మాసలుపు । శిష్టపరిష్కృత వర్తనన్ బరీ
హాసముచేసె బాలుఁ డను । రాధిపు గెల్చిన మమ్ము లెక్కకుం
గానునను గొనందు తమ । కంబు నడంచెద శూరమానికిన్. 142

వ॥ అని తలపోసి పదంపడి. 143

ఉ॥ "బాలక! మేముచూడవలెఁ । బాటవమెట్టిదొ నేడు శాసనో
ల్లాలనమందు నీకిచట । సంగరమందున నాయితుండవై
కాలు కదల్పకుండ నిలు । గట్టిగ" నంచని వార్తనంపె నా
శీలవిభూషణుండు విని । చెప్పెఁ దదుక్తుల కిట్లు వెండియున్ 144

తే॥ "మేదినీశ! భవచ్చిత్త । మూది నిల్తు
నేఁ బరీక్ష్యుండ మీరు ప । రీక్షకులరు
కాన మన నిర్వురము కేలుఁ । గలుపవలయు
పరుల కిందుఁ బ్రవేశంబు । వలను పడదు. 145

మరుత్తమహీజాని మాంధాతృనకు వశంవదుఁడగుట.

వ॥ జనమేజయా! విను మామరుత్తమహీపతి మాంధాతృని ప్రత్యుత్తర
మ్మాలకించి యందున కియ్యకొని యామరునా డుదయంబున

నరికేసరింగదిసి కదనం బొనర్పఁగడంగె నట్లా శూరశిరోమణు లిరువురు నన్యోన్య విజిగీషామనీషఁ గాలుకదపని! కఠోరదీక్షతో నొండొరులపై శరపరంపర బఱపుచుఁ దీవ్రముగ దురమొనర్ప సాగుటయు నొండొరుఁ గడవరాని యవ్వీరవరుల సమరంబు భీష్మ పరశురాముల రణంబున కెనయై యొప్పె నాసంగ్రామంబున నిరు చక్కియలఁ జూపఱ కచ్చెఱువుగ నడుగుమోప నవకాశములేనియ ట్లంపతునుక లతి సాంద్రముగ నవనిపైఁ బఱచినట్లు పడియుండెఁ గాని యమ్మేటిజోదుల మేనులందు వ్రేల్వెట్టి చూపుటకే నొక్క గాయంబును పుడమిపై నొక్క నెత్తురుబొట్టును గన్పింపదయ్యె. నట్లయ్యోధాగ్రణు లంతరంగమ్ముల నొండొరు నొంచి నేలఁ గూల్పఁ గ్రూరభావంబువీడి కేవల బలాబలప్రదర్శనంబునకుబలె నొకవిశిష్టక్రమంబునఁ గదనంబొనర్చుచుండ నవ్వీరవరుల రణకౌశ లంబు గాంచనో యన ఖరకరుం డాకాశమధ్యగతుండయ్యె నంత నరుత్తమహీపతి మందవేగుండై యంతకంత కగ్గలంబైన యాగ్రి హాతిరేకంబున విలువంచుచుండ గొనయంబు తెగుటయు నత్తతి గనయంబు బెడిసి పెడతలకు బిట్టుతాఁకె. తత్ప్రాఘాతంబునం దల తిరుగ నానృపాలుండు వ్రెల్కి మూర్ఛిల్లె. మాంధాతృమహీజానియు శరచాపంబు లట్లు విడిచి యొక్కయూపున నెదిరిచెంగట వ్రాలి తచ్ఛిరంబు నిజోరుతలంబున నునిచి శిశిరోపచారంబులు చేయించు చుండునంతలో నాపుడమి జేఁడు కన్నువ తెఱచి కకుత్స్థకులభూషణుం గాంచి యాతని వీఁపుపైఁ జెయివైచి నిమురుచుఁ గుమారా! వర్ధిల్లు మనుచు వెండియుఁ గనులుమూసె నప్పుడా నృపాలు సుత సచివులు మాంధాతృ ననుమతంబున నాతని రాజ ప్రాసాదంబు నకుం గొనిపోయిరి. పిమ్మట మాండవనాడు 146

సీ॥ ఆరాజకులవృద్ధుఁ ✤ డాయువనాశ్వుని
సచివాప్తసామంత ✤ సహితుఁడగుచు
నమృతఫేననిభంబు ✤ లైన తల్పంబులఁ
బ్రతిపదంబును నేలఁ ✤ బఱచిపఱచి

పువ్వులలోఁ బెట్టి పావనఁ దెచ్చు విధాన
భయభక్తి వినయ సంభ్రమము లొప్ప
తౌర్యత్రికంబులు ధరణీసురస్వస్తి
వాచనంబుల విరావంబు లెసఁగ

తే॥ శైలకాంతారసీమ నజ్ఞాతవాస
మాచరించు ప్రజాళి యహర్నిశంబు
కఠినశిక్షలఁ జెఱలందుఁ గ్రాఁగు చిపుడు
విడుమరను గన్న యాప్రజావితతి యెల్ల. 147

తే॥ ముఖ విన్యస్తజయశ్రీకి బుష్యముగను
గెలువుము గెల్వుము గెల్వుమీ కీర్తిరమ్య
సద్గుణోద్దామ మాంధాతృ సార్వభౌమ
యనుచు నెలుగెత్తి పాడు చాహ్లాదముగను. 148

తే॥ ధర్మమునకు జయమ్ము మాంధాతృ చక్ర
వర్తికి జయమ్మటంచు సంబరము మించ
నిసుకచల్లిన రాలని హెచ్చుతోడ
వెంటరాఁ దోడుకొనివచ్చె విశ్వమలర. 149

వ॥ అట్లు తోడ్తెచ్చునెడ మానవభాగ్య విధాతయగు నమ్మాంధాతం
గని మరుత్తనగర నారీమణు లిట్లు భాషింప దొరకొనిరి. 150

సీ॥ యువనాశ్వగర్భపయోరాశిసంభూత
శీతాంశుఁ డితఁడటే చెలువమిన్న!
స్తన్యంబులేక సుధాప్రవర్తితుఁడైన
తేజస్వి యితఁడటే రాజవదన!
బాల్యంబునన దస్యువారంబుఁ ద్రోలిన
బల్లిదు డితఁడటే పద్మగంధి!
అభిషేకవేళామరాధిపారోపిత
మాళి యీతఁడటే మధురవాణి!

తే॥ మానుషాకృతిఁ గొన్న ధర్మంబనంగ
ధర్మము చరించుచును సదా ధర్మనిష్ఠఁ

బ్రజలు వర్తింప సిరులను బరఁగఁ గూర్చు
మధురగుణశాలి యితఁ డటే మంగళాంగి. 151

వ॥ మఱియుఁ బౌరు లిట్లు భాషించిరి. 152

తే॥ వివిధ జాతీయ మానవ వితతిఁ గెరలు
కులమతాచార విద్వేష ములను గూల్చి
సమతఁ ద్రావించె నొక జలా శయము జలము
నవని వెలయింపఁ బుట్టిన హరి యితండు. 153

తే॥ ధరణి నెల్లెడఁ గల దొర తనములందు
భిన్నవై ఖరులను మాన్పి వెలయ నిల్పి
విమల ధర్మైక సూత్రతా విహితరీతి
దొరల తమ మాడిచిన జగ ద్గురు డితండు. 154

తే॥ బహుళ విజ్ఞాన వాహినుల్ పాఱఁజేసి
భూరి ధనధాన్యవస్తువి భూతి నితఁడు
హృద్యభోగంబులను గూర్చె నెల్లప్రజకు
వసుమతీదేవి నోముల పైఁడి పంట. 155

వ॥ ఇట్లు ప్రజాసముదయంబు తమహృదయంబులోని పవిత్రభావములు వెలువరించుచుండ నఖిల ప్రజానిచయజీవితేశుం డగు నమ్మహా మహీశుం దోడ్కొనివచ్చి మరుత్తమహీజాని, పేరోలగంబున మహార్హాసనంబున నునిచి మణికనకాభిషేకంబుగావించి యనర్ఘాంబరాభరణంబు లర్పించి కనక కలధౌత మణిమయనిధులు కానుకలు వెట్టి సార్వభౌమపదసంఘటిత సువర్ణ పుష్ప రమణీయ మణిహారంబు కరయుగంబునం గొని మ్రోలనిలిచి. 156

ఉ॥ రాజకులైకభూషణ! వి రాజదకైతవ ధర్మవర్తనో
త్తేజిత మర్త్యలోక! భవ దీయ సమర్థత నెంచఁబూను ట
ర్కౌజము నెంచఁ బూనినటు లయ్యె భవన్మహితోత్త
మాశ్రయో
ద్భ్రాజితమై ప్రభుత్వ మది భాసిలుఁగాక సుదర్శనస్థితిన్. 157

తే॥ అనుచుఁ గ్రైసేసి తన్మాంస ǂ లాంస యుగళిఁ
గేలు తెమలించి కొమరుని ǂ కెలన నిలిచి
సార్వభౌముని పౌత్రిలను ǂ సాగి మ్రొక్కఁ
బనిచె నతఁ డట్లుగావించె ǂ మనసువెట్టి. 158

తే॥ తండ్రి కొమరుల మాంధాతృ ǂ ధరణీపతియు
నమృతమొలుకెడు చూపుల ǂ నాదరించి
తానుగా వారిఁ బీఠాలఁ ǂ దవరనునిచి
యర్ఘ్యపాద్యాల నిలిచి తా ǂ ననియె నిట్లు. 159

మాంధాత మనుత్తమహీపతిని సముచితోక్తుల నాదరించుట.

సీ॥ ధరణిలో దైవత ǂ త్వమ్ము సృష్టించెడి
మనుజునిలోన ధ ǂ ర్మంబు కనుఁడు
విషమయుజ్వాలల ǂ వెలువరించు హృదగ్ని
కుండాన నమృతంబు ǂ నిండఁగూర్చు
ఘోరపాతక తమః ǂ కుహరజీవితమును
జ్యోతిర్మయంబుగా ǂ నూటిఁదీర్చు
జీవాలఁ బలిగొన్న ǂ చెనటి చేతులనెల్ల
సిద్ధహస్తములుగాఁ ǂ జెలఁగఁ జేయు

తే॥ నఖిలమానవసౌభాగ్యి ǂ మన్వయించి
ప్రజలకెల్లెడ సర్వతో ǂ భద్రమైన
యున్నతాదర్శరతిఁ గొల్పి ǂ యోమజగతి
తన్మహాధర్మదైవ స ǂ త్కారమిదియు. 160

తే॥ ధర్మమొక్కండె జనులకు ǂ తారకంబు
శ్రేయములఁ గూర్చు సేమంబు ǂ సిరులఁ గూర్చు
దానికిఁ గొరంతవాటిల్ల ǂ ధరణియెల్ల
లోపముల తాకరంబగు ǂ లోనలోన. 161

తే॥ అనుకలమ్మును ధర్మ మా ǂ యనిలమట్లు
నిరతిని జరించుచుండిన ǂ నిలుచుబలము

చిత్తమున శాంతిదాంతియుఁ ✽ జెలఁగుదాన
శాంతిదాంతుల వరలుఁ బ్రి ✽ శస్తవృత్తి. 162

తే॥ తల్లిదండ్రులు హితుఁడును ✽ ధర్మసత్య
ములును కులమును జనులకుఁ ✽ బుడమి జేడ
పాడితప్పక ప్రజల కా ✽ పాడుటొండె
యమలజీవన సర్వస్వ ✽ మవనిపతికి. 163

చం॥ తనువున శక్తికై వడిని ✽ తప్పులు నొప్పులుఁ దెల్ప రాష్ట్రపుం
దనువున సుస్థిరుండు వసు ✽ ధాపతి; ధర్మ్యయుతప్రవర్తనా
ఘనుడు నృపుండు మించునధి ✽ కారచతుష్టయ యుక్తుఁడౌట నా
యనిమిషనాథు, దండధరు, ✽ నప్పతి, విత్తపతిన్, జగమ్మునన్.

తే॥ అట్టి రాజన్యుఁ గనుబ్రామి ✽ నట్టిప్రజల
నమ్మిన ప్రజాళి మొఱగెడి ✽ నరపతులను
నిరుతెఱంగులవారి భ ✽ రింపననుచు
వసుమతీదేవి చౌడరి ✽ వట్టిపోవు. 165

వ॥ ఇంక నీరాష్ట్రంబున. 166

చం॥ కలకలలాడుఁగాక ధర ✽ కమ్మని తావుల పైరుపచ్చలన్
పిలపిలలాడుఁగాక పుట ✽ భేదనముల్ మఱి పల్లెపాలెముల్
కలుములమించు సుప్రజలఁ ✽ గామధుగాపణ హర్మ్యపంక్తులన్
మిలమిలమించు గోగణ స ✽ మిద్ధ తురంగమ వాహనంబులన్. 167

చం॥ అని నరపాలకప్రజల ✽ కాత్మకు రా వచియించి యంత త
ద్ఘనవసురాశి ముఖ్యమగు ✽ ధార్మిక సంస్థ కొసంగి యాసభన్
బనిచియు విశ్రమింపఁ గుల ✽ వంద్య మరుత్తుని పాదపాంసువుల్
గనులకు నద్ది తాఁ గదలెఁ ✽ గమ్మని వీపొఱలుపుల్ చెలంగఁగన్.

తే॥ కదలి కాశ్మీరముం జని ✽ కనుల కింపుఁ
గొలుపు నెలవుల దర్శించి ✽ యెలమితోడ
నమ్మహీశుఁ డొసంగెడు ✽ నర్చ లంది
కరలు నంగారు కొ్రవ్యార్పఁ ✽ దరలె నృపతి. 169

---

అధికారచతుష్టయము—పాలన, దండన, ధర్మ, ధనాధికారములు.

మాంధాత గాంధారమునకేగి యంగారుతోఁ బోరుట.

ఉ॥ భారత పశ్చిమోత్తరపు ✽ భాగము పర్వతరూపితంబు త
ద్ధారుణిఁబొల్చు నాటవిక ✽ ధామము నాగలిచూడనట్టి గాం
ధార సమాఖ్యమౌ జన ✽ పదంబు యయాతిసుతుండు ద్రుహ్యుడన్
భూరమణుండు తండ్రి మది ✽ పొందమి నీ భువిఁజేరి నేర్పుమై. 170

తే॥ ఏలసాగెను తత్ప్రజఁ ✽ గాలగతిని
విస్తృతంబయ్యెఁ ✽ దదపత్య విపినమచట
దరతరాలుగ నాక్షేత్ర ✽ ధర్మమునను
తజ్జనమ్మును దుష్టవృ ✽ త్తమునఁ బరఁగె 171

వ॥ ఆ ద్రుహ్యువంశజుం డగు నంగారుండు గాంధారమును పాలించు
చుండె నయ్యవసరంబున 172

మ॥ నరనాథాగ్రణి యేగ నయ్యెడకు గాం ✽ ధారేశ్వరుం డుగ్రుఁడై
పురికోటల్వెస నవచేతనం గొలిపి యా ✽ భూపాలుచే మున్ను ని
ష్ఠుర బాణాహతి మన్ను మెక్కిన ఖల ✽ స్తోమంబు నమాత్మకయున్
గరువంబారగ మీసలన్ మెలవుచున్ ✽ గాఢుల్ కడుం బ్రేలుచున్

మ॥ చిరకాలార్జిత రోష మారపగను న ✽ ర్చిష్మంతునిం గీటకో
త్కర మట్లుద్ధతి ముట్టె నా మనుజ లో ✽ కస్వామి నొక్కుమ్మడిన్
బరివిద్ధాంగులు కాఁగ వాడిములుకుల్ ✽ వర్షించి పైపై వెసన్
విరియించెన్ బరిపంథియోధవితతిన్ ✽ విశ్వంభరాజానియున్. 174

సీ॥ అవివేక మూర్ధన్యుఁ ✽ డైన యంగారుండు
వెండి మూకలఁ గూర్చి ✽ వేగఁ బంపె
గండుచీమల పిండు ✽ కైవడి నామూక
లార్భటించుచు వచ్చి ✽ యమ్మహాత్ము
యౌవనాశ్వని ముట్టె ✽ నాకస్మికస్థితి
నంతదత్తై నికు ✽ లాగ్రహమునఁ
బరగుభారద్వాజ ✽ వత్తులకైవడి
నంపముక్కులమేని ✽ యస్ర మురలఁ

తే॥ జెండ నిల జాల కాదండు । చెట్టు కొకఁడు
గుట్ట కొకడుగ వెసఁ బాఱెఁ । గట్టువీడి
యిట్టు లాదండు పలుసార్లు । పట్టువిడక
భంగ మొందియుఁ బైపయిఁ । బడుచువచ్చె. 175

వ॥ ఇటు లప్పలుగాక మూకలు శలభంబుల చందమ్మున సమయుటకు
సైఁపఁజాలక యవ్వాని సాధువృత్తిఁ జేసమకట్టి తత్రిత్యజన
నిచయ హృదయంబుల పడువున పరుషమ్ము నతివిషమమ్మునగు
నా గాంధార భూభాగంబున. 176

ఉ॥ గుట్టలమధ్యవాసమున । తున్ మదిపెట్టి మహామహేంద్రుడున్
నిట్టలమైన యోర్మినిడి । నెమ్మని తజ్జడజాతిఁ బట్టగాఁ
గట్టడిచేసె బంటులకు । కష్టములెన్నక వార లయ్యెడన్
గట్టులమధ్య లోయలను । కందరసీమలనుండు మూకలన్. 177

తే॥ వెదకి గాలించి పట్టి యు । ర్వీధవునకు
నప్పగించిరి వారల । నభయమిచ్చి
వలయు పరపతిఁ బరికర । ములనుగూర్చి
కాఁపులుగఁజేసె నాప్రజా । కల్పశాఖి. 178

తే॥ ఒక్కటొకటిగ నిట్టులు । దక్కకుండ
తనదుమూకలు చేపీడి । చనఁగ వైరి
యెల్ల నెలవుల నిండఁగ । నిల్లు బయలు
కాఁగ నంగారుఁ డల్కతోఁ । గదలె ననికి. 179

మ॥ అరి నుగ్రాకృతి వానియుద్ధతిని క । న్నారన్ విలోకించి యా
ధరణీజాని యొహోహొయితండో! విపస । త్వశ్రేణిగా నీవ్రిజన్
విరచించెన్ విమశిల్పి వీనిని సుధా । స్ఫీతోర్వికిం ద్రోసినన్
బరగున్ దజ్జకజీవితం బమృత రూ । పంబై సుచైతన్యమై. 180

వ॥ అని తలపోసి యగ్గలమగు నాగ్రహంబున నాఖలగ్రామణిపై. 181

తే॥ కార్ముకము చుట్టుకైదువు । కరణి పంచి
నిశితశరముల గుప్పె న । న్నీచు మేను

కరణి జల్లెడయయ్యెను § ధరయు నచట
శేషుఁడుఁ జలించు శిరములఁ § జిక్కఁబట్టె. 182

తే॥ వాని దేహంబు పాషాణ § వర్మితంబొ
స్వయము పాషాణమో! యయో § మయమొ! కాళ
తచ్ఛరాహతి కన్యంబు § తాళునొక్కొ!
యనుచు వెఱఁగొందెఁ జూచిన § మనుజవితతి. 183

చం॥ పిడుగులువోని యంపతెఱ § పీచమడంపఁగఁ దాళలేక తా
నడుగులు తొట్రిలన్ బుడమి § నస్త్రములం బడవైచి వాఁడు న
య్యొడయుని మ్రోల సాగిపడి § యుండెను మాటలుమాని
జేఁడు—నీ
పుడమిని వీడి వేగ మరు § భూమికిఁ బొమ్మనిపంచె నాఖలున్. 184

మాంధాత పనుపున నంగారు డుత్తరమరుభూమి కేగుట.

తే॥ తుచ్ఛ జీవంబు లాసించి § తుట్టతుదను
బంధువులతోడ జీవుఁడా! § బ్రిదుకుమనుచు
నుత్తరావని మరుభూమి § నుండఁ జనియె
నంత నంగారుఁ డాతేని § యాజ్ఞమీచి. 185

మ॥ క్షమి మూర్ధన్యుఁడు కోసలేశుఁ డిటు లా § గాంధార మీరేడు మా
సములం గైవసముంబొనర్చికొని పా § శ్చాత్యక్షమాసీమలన్
గమనార్హంబుగ నెంచి తాఁ దరలి పో § కన్ బారశీకావనిన్
గ్రమియించెన్ దగఁ దద్ధరావతుల కానుక్ల్గొంచు మున్ముం
దటన్. 186

మ॥ స్థిమితాత్ముండయి రాజ సంస్థలు ప్రతీ § చీన ప్రజాసంస్థలున్
శమముం గూర్చఁగ కేతుమాల ఘన ప § ర్షక్షోణి నవ్యోన్నతిన్
రమణీయంబగు రోమకాఖ్యపురిఁ ద § ద్రాజేంద్రుఁ డాతిథ్యమున్
సమదోత్కర్ష నొసంగఁ గైకొని యుదీ § చ్యక్షోణికిన్ బోవుచో.

వ॥ మార్గమధ్యంబున జగత్కంటకుం డైన దశకంఠుండు పర్వతునివలన
మాంధాతృమహీపాలు స్వరూప శౌర్యంబులు నాతని యుద్దేశ

విజయయాత్రను విని యామేటిబల్లిదునితో బవరంబు సల్పు
భావంబున బాట కాచి తన్ను డాసిన యా ధరణీపాలు గుర్తించి
యిట్లనియె 188

మార్గమధ్యమున రావణుడు మాంధాతతో బోరుట.

ఉ॥ క్షత్రియపుత్ర! భూతల మ - శౌర్యముగా గనుగొంటి నేఁడు నీ
మిత్రము భూతలమ్ము గడు - మెచ్చెడి నీ గురువిక్రమమ్ము మా
శ్రోత్రయుగమ్ము తూట్లువడ - చూపెద నీభుజవిక్రమమ్ము నీ
క్షేత్రమునందు రావణుడ - చివ్వకు నిల్వుము శక్తియుండినన్. 189

వ॥ అనిన విని యా శూరవరేణ్యుండు 190

చం॥ తెలిపెడి నీదు రావణ మపి - తీత భవన్మధురాఖ్య వింటి నీ
మలినచరిత్ర నీకిపుడ - మాన్పెద సంగరకాంక్ష ధీరతన్
నిలువుము, మానవప్రతతి - నీచముగాఁగను నీదుశౌర్యమున్
మలిపెద నంచు నవ్విభుడు - మార్గణజాలము గుప్పె వానిపై. 191

కం॥ కని యా యుఖములకా యా
చినుకులుమతి యంచు నవ్వి - సెలవులు విరియన్
గొనయము మ్రోయించుచు నా
దనుజుండును గుప్పె శరవి - తానము నరిపై 192

మ॥ తనపై వ్రాలెడి పంక్తికంఠు శరసం - తానమ్ము మున్ముంద య
మ్మనుజేశాగ్రణి మెచ్చు టంపవడి స - న్మానించి జోకొట్టి త
ద్దనుజాధీశు నురమ్ము ముద్గరమునన్ - తాడించుడున్ మూర్ఛవాం
ది నిశాటాగ్రణిలేచి చేఁగొని గదన్ - దృప్తారిపై నేయఁగాన్. 193

చం॥ పిడుగులువోని యంపవడి - వ్రీల్చెగదన్ నృపవర్యుఁ డిట్టులన్
బొడవడగంగఁ బైపయిని - ముల్కుఁ జడిం గురియించు చొండారుల్
తడబడకుండ నిర్వురును - తద్దయుఁ బోరిరి తచ్చరాహతిన్
బుడమివడంకెఁ దూటువడెఁ - బొక్కలికానువు గ్రుడ్డుచిప్పయున్.

వ॥ ఇట్లాశూరయుగళంబు సింహయుగళంబు చెలువున శూరవిలాసంబు
చూపుచుఁ గొంతవడి దివ్యాస్త్రప్రయోగ కౌశలంబు ప్రదర్శిం

చుచు బవరంబు సల్పె. తద్దివ్యాస్త్రప్రయోగంబు తుదముట్టింపఁ
దలంచి యప్పార్థివ శిరోమణి బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపఁ బంక్తి
కంఠుండు పాశుపతాస్త్రంబు ప్రయోగించె నంత నాయస్త్రద్వితయం
బనలకీలాకలాకలాపమ్ము జిమ్ముచు నభంబునఁ బోరాడుచుండె
నక్కతమ్మున లోకమ్ము లాకులంబులయ్యె నప్పుడు పులస్త్యబ్రహ్మ
యరుదెంచి యాయిరుపుర నడుమ నిలచి యిట్లనియె. 195

పులస్త్యుఁడు రావణమాంధాతృలకు సంధిచేయుట

ఉ॥ ఓయికుమారులార! యిటు లూరక పోరుట మాను డింక న
న్యాయముగా జగంబులు వినాశమునొందెడి వేగ నస్త్రముల్
తీయుడు వెక్కసము లు దీర్ఘపరాక్రము లిర్వురుర్వి దీ
ర్ఘాయువులై చరింతు రన నట్టులొనర్చిరి వారునిచ్చమై. 196

వ॥ పిమ్మటఁ బులస్త్యుండును వారల దీవించి నిజేచ్ఛంజనియె దశగ్రీ
వుండు తనయిచ్చననుసరించె. పిదప నమ్మహీకాంతుండు 197

చం॥ ఎలమి నుదీచ్యభూములకు నేగెఁ దదుజ్జ్వలవర్షసీమలన్
లలితగుణప్రభావృతకళామయజీవన నిత్యవైభవా
స్ఖలితజనుల్ నృపాలకులు సన్నిధిచేసిన ధర్మమూర్తికిన్
బులకితమూర్తులై మధురపూజలుసల్పిరి సత్కీర్తికిన్. 198

తే॥ అందు కురువర్షచిత్రికమైన సిద్ధ
పురిని జేరి తదుర్వీశు పూజలంది
సంతసముఁ గూర్చు మహిత విజ్ఞానగతులఁ
దనరు ప్రాగ్భూమి కరిగె మాంధాత యచట. 199

మ॥ అవనీపాలుర ధన్యులన్ గలుపు భద్రాశ్వాఖ్య వర్షస్థ సం
స్తవనీయ ప్రజవర్తనల్ మదికి విశ్రాంతిన్ ఘటింపంగ నా
యవకోటీపురిఁ జేరి తత్కటక భూపాధ్యుండు ప్రత్యగ్రతా
ధ్రువరేఖం దగు నర్చఁ దద్వసుమతీంద్రున్ దన్పె నబ్రమ్ముగాన్

వ॥ అట్లపూర్వపురుషోత్తముండు పుడమినల్గడలఁ గ్రుమ్మరి మరియుఁ
గడలి నందందు బెడఁగగు పెనుదీవులఁ బునీతములు చేయుచుం జని

యచటి పెద్దదొరలు తత్ప్రజానీకధర్మపథానువర్తనకుఁ బ్రథమాచార్యులై ధర్మదైవతోపాసకులై తనకెనగా ప్రవర్తించుచుండఁగని సంతుష్టాంతరంగుండై ప్రజల ప్రజాపాలకుల పూజలు గైకొని క్రమ్మఱ నజనాభంబునకుఁ జనుదెంచి కోసలేందిరకు సర్వేంద్రియాహ్లాదనంబుగాఁ దర్పరిసరంబుల నడుగువెట్టు నవసరంబున త్రిదివంబునుండి దివిజసత్తముని సారథి మాతలి మహితపుష్పకంబుతోఁ జనుదెంచి యమ్మాన్యవేదుర్తితో మహేంద్రువచనంబులుగా నిట్లు వచించె. 201

ఉ॥ మా కరతర్జనిం దొరగు ♦ మాధురిఁ గ్రోలుచు ప్రేమసారముల్
జేకొనినట్లు తోఁచెడిని ♦ జేరెడి సుస్మిత నేత్రరోచులన్
లైకొనఁగోరి మా హృదయ ♦ వల్లరి పావనధర్మయుక్తి భూ
లోకము నేక పాలనకు ♦ లోచిన నీతనుయష్టి నిమ్మెగాన్. 202

ఉ॥ మాదు మనోరథాప్తి సుర ♦ మండలికిన్ బ్రథమేందుదర్శనా
పాదిత లోచనోత్సవము ♦ పాటునుగూర్చుచుమించుఁ బల్కుఁగాఁ
గాదన కంత సైనిక ని ♦ కాయము నయ్యోడ నుండఁ బంచి యా
మోదముగా మహేంద్రునకు ♦ భూపతి మాతలితో జనెన్ రహిన్.

మహేంద్రుడు మాంధాతను దేవసభలో సన్మానించుట.

ఉ॥ అంత మరున్నియంత సక ♦ లాంబకముల్ పనిసేయ దిక్పతుల్
చెంతను జేరి రా నెదురు ♦ శీఘ్రముగాఁ జనుదెంచి భూసతీ
కాంతుని మ్రొక్కువాని బిగి ♦ కౌఁగిట గుర్చ్చి కరమ్ము వట్టి శ్రీ
కాంతుని గాంచినట్లు మదిఁ ♦ గాంచుచు హర్షము రాజమౌళికిన్.

ఉ॥ సూరెలనున్న దిక్పతులఁ ♦ జూపుచు నోలిన పేర్లు తెల్పన
వ్వారికి నా నృపాలమణి ♦ వందనముల్ పచరించె నవ్వుడ
వ్వారును నవ్వుమోముసిరి ♦ పర్వఁగఁ గౌగిలించి రోలి బృం
దారకు లాత్మతుల్య విశ ♦ ద ప్రసవమ్ములఁ జల్లుచుండఁగాన్. 205

తే॥ మాఁడులోకాల మేల్గీళ్ళ ♦ ముచ్చటించు
వేల్పుటోలగమునకు నా ♦ విశ్వమనుజ

భాగ్య సంధాత మాంధాతఁ § బాణిపట్టి
త్రిభువనేశుండు గొంపోయి § తియ్యమెసఁగ. 206

తే॥ ఆత్మసింహాసనమ్మున § నమర నునిచి
తనరు హరిచందనలతాంత § దామకంబు
కరములం బూని సభ్యులఁ § గలయఁ జూచి
పలికె నిట్టులు సందర్భ § లలితవృత్తి. 207

చం॥ సరసిజనాభు వంశమున § జన్మము నెత్తి మహీతలంబు ని
ర్జరవరులార! ఈ నృప వ § సంతుఁడు సుందరనందనమ్ముగాఁ
బరగ నొనర్చెఁ దా విటుగఁ § బండెడుఁ బైరులు పచ్చతోటలున్
విరతియులేక యెల్లెడల § వేడ్క జనించెడు నందు గ్రుమ్మరన్.

మ॥ మన కీమధ్యమ లోకపాలవిధి సం § భావ్యుండు విశ్వంభరా
జనతాపాలవిస్పష్ట బ్రహ్మలిపి ను § త్సారించి దేవాంశతో
మనఁగా నవ్యసువర్ణవర్ణతతి శుం § భద్రామపత్రమై నేటుగాఁ
గనిపింపన్ లిఖియించె భూతలము నా § కంబయ్యె రమ్యాన్నతిన్

ఉ॥ ఈనవశిల్పిశేఖర మ § హిష్ఠ సముజ్జ్వలసత్త్వసంస్కృతిన్
మానవలోక మేకత స § మాజ సముచ్ఛ్వసితాధికార సం
ధానిత సత్యవృత్త మహి § తద్యుతిఁ బొల్చెడి నిత్య తృప్తిపై
మానికలోకమట్టు లిల § మాయగ రోగభయాపమృత్యువుల్.

ఉ॥ మానుష జీవితం బది స § మాజహితాకృతి నవ్యపల్లవా
మ్లానసుగంధపుష్ప ఫల § మంజులమై మది వేడ్కనింపు సం
తానముమాడ్కిఁ బొల్చెడి సు § ధా మధుర ప్రసవార్థ పూర్ణ వి
జ్ఞానగరిష్ఠ వృత్తమయి § సర్వకలా ప్రతిభా మనోజ్ఞమై. 211

ఉ॥ అందఱు విప్రులే ధరణి § నందఱు రాజులె యందఱర్యులే
యందఱు శూద్రులాత్మ విష § యంబున నందఱు సంయమీం
ద్రులే
పొందుగ నేస్తులందఱును § బుద్ధులు నేర్చెడి బ్రహ్మచారు లిం
పొందగ నెల్లవారు సమ § మోచితు లీనృపు కీర్తి తీర్పఁగన్

తే॥ త్రాసము ఘటించి దస్యుల తంపి యార్చి
జగతి నిష్కంటకమ్ముగా నెగు లడంగ
శాంతిసుధఁ జల్లినట్టి యీ స్వాదుమతికి
నాఖ్య చెల్లెడి "త్రాసదస్యుఁ" డనఁగ మఱియు. 213

తే॥ జగములకు నెల్ల శత్రువై దిగులుకొల్పి
యెదురు లేమని మనమున నదురు లేక
తిరుగు దశకంఠు గర్వంపు తీట యుడిపి
మనకు ముదమును గూర్చిన మల్లుఁడితఁడు. 214

తే॥ జగములకు నెల్ల సంతోష సమయ మిద్ది
ధరణి యివ్వీరు బాహు పంజరముఁ జేరి
సుఖితయై కమ్మయూర్పుల చొక్కటముగ
విడుచుచున్నది నే డాట విడుపు మాకు. 215

తే॥ సమ్మదముగూర్చు నీసుఖ సమయ మందు
మధురగుణమణి నీసుహృ న్మణిని నిరతి
సత్కరించుట యిమ్మరు త్సభకు సర్వ
మమరమానవలోక భ ద్రాభికాంక్ష. 216

తే॥ అనుచు నాహుతఘనవృత్త మైనపారి
జాతసుమహారమును మహీ జానికంఠ
సీమనర్పించి చెలువుగఁ జేతికపుడు
చారుహరిచందనలతాంత చక్ర మొసఁగి. 217

తే॥ చప్పటులమ్రోత పెల్లున సభ చెలంగ
నర్ధసింహాసనమ్ము తా నాక్రమించె
తనరె మాంధాత యా పురం దరుని చెంత
గెలుపుసిరిరంజిలు నుపేంద్రు పొలుపు తెలియ. 218

తే॥ దామ మర్పింప నపుడు మాం ధాత లేచి
చిగురుపొట్టము లట్టుల చెలువుమీరు

కరతలమ్ముల శక్రుని చరణయుగళి
నంటి ప్రణమిల్లి సభ్యుల కనియెనిట్లు. 219

మ॥ అమరస్వచ్ఛయశస్కులార! తన మీ యౌదార్యమాశ్చర్యమా
తమయౌదార్యము మార్గదర్శకముగాఁ త్రైలోక్యనాథుండు మా
కమితంబైన మహత్త్వము న్నిలిపెఁ దద్వ్యాపారముల్ చూడ వే
దములంజొప్పడు నర్థవాదముల చందానన్ బ్రశంసార్హముల్.

మ॥ జనితోమానవులందు కొందఱకు సంజాతంబగున్ దేవతా
ఘనశీలం బది వాంఛనీయము ప్రజాకల్యాణ సంపాదనం
బనిశంబున్ ధరణీశుఁ డా యమరశీలా విష్టుఁడై యొప్పుచున్
మనుజశ్రేణికి దైవశీల మొదవం జాలించినన్ బూర్ణుఁడౌ. 221

తే॥ తన కనూచానధర్మ విధానమందుఁ
బూర్ణుఁ డగుతేఁడు దేవత్వపూర్ణుఁ డగును
పూజ్యుఁ డాతఁడె దేవతాపుణ్యపంక్తి
మాదృశా పూర్ణులకు పూజ కీదృశంబు. 222

తే॥ మీ యుదారత మీతాల్మి మీదుశాంతి
మీపటుత్వము వితరణ మీదుభాగ్య
మలవరచుదాక ప్రజలకు నఖిలదిశల
శక్రువాక్యంబు లుపదేశసరణిఁ గొనెద. 223

మ॥ మననీయం బగు యుష్మదీయ ఘనసన్మానంపు చిహ్నంబుగాఁ
జను నీదామకమందు వన్నెలవిరుల్ చాటించు నొక్కొక్కఁడే
గొనబౌ మీ గుణ మొక్కటొక్కటిగ మాకున్ తాల్తు మీ
దండశా
సన మట్లుక్కున దివ్య వాసనల సంస్థానంబు రూపింపఁగాన్. 224

తే॥ నేటి దివ్యానుభవ సుధానిత్యలహరి
మాదుశీలంపు వల్లరిఁ బ్రోదిసలిపి
కమ్మవిరులను పూయించుఁ గాక యెపుడు
మీప్రసన్నత మా యెడ మొఱయుఁగాక. 225

తే॥ అనుచుఁ బ్రణమిల్లి యుపవిష్టు । డయ్యె నృపతి
"మేలుమేలు సెబాస"ని । మెచ్చ లోలయు
కరతలమ్ములు దుందుభు । ల్కరణిమెరసె
నంత నమరేశు డిట్టుల । ననియె లేచి. 226

తే॥ ఎవ్వని చరిత్ర మాలింప । హృదయముబ్బు
నెవని యాదర్శములు విన్న । హెచ్చు వేడ్క
యెవని నిష్టుఁ బ్రణమిల్ల । నిచ్చవొడము
నతని బూజించి గర్వంబు । నందుచుంటి. 227

తే॥ పూజచేయు డెరింగిన । ప్రోడ పెరలఁ
బూజ సల్పుచుఁ బెరలచేఁ । బూజఁగాంచు
తన యుదారత మనదెసఁ । దాచిపెట్టి
మన యుదారత నెంచి తా । మహితుఁడయ్యె. 228

వ॥ అను నెడ నయ్యువనాశ్వనందనుం డుద్ధితుండై యిట్లు వచించె. 229

చం॥ "అమృత పరీమళాక్త వద । నాంబుజ నిర్గతభాషణంబు లా
విమల సుధారసంబు రుచి । వెల్వడుఁ గాక యు నుల్లమందు నె
య్యము కననీయ దవ్వలి య । థార్థము నెయ్యెడఁ బ్రాణదాతకున్
మమతయడంగునొక్కొ చను । మానము హెచ్చునుగాక యేరికిన్

వ॥ అని యుపవిష్టుం డగుటయు నావంక తిరిగి 231

చం॥ అనుగతి బొల్కు నవ్వు సిరి । యాడఁగ వాతెర వజ్రి యిట్లనున్
మనుజ జగచ్ఛుభంకర! ప్ర । మాణ పదంబది నీదువాణి కా
దన ముదమయ్యె నింక విబు । ధావళి నగ్నిముఖాన నిష్ఠమై
తనుపుము దేవమానవుల । ధర్మపథం బిటు సాగ మేలగున్. 232

తే॥ ఇష్టి ముఖమున మమ్ము ధ । రించుకతన
నెలమి "మాంధాత" యంచు మే । మిడిన పేరు
సార్థకంబుగ నితవరి । యాట మాకు
దర్పమొదవెడి నీ యరిం । దమునివలన. 233

తే॥ అనుచు మాంధాత కేల్వట్టి । యాదరమున
లలితగతి నెల్లవ్రజలు రం । జిలగఁ గెలువ

మైమఱపుఁ గొల్పునట్టి నీ కమరలఁ జూడఁ
గోరి వీడ్కోలు తెల్పెదఁ గువలయేశ. 234

వ॥ అని వీడ్కోలు తెలుపుటయు నంత 235

తే॥ నవ్వసిరి యెల్ల వారి యా ననములందు
తాండవింపఁగ మాంధాత తరలెఁ బుష్ప
కమునఁ గూర్చుండి దేవలో కమున వెలయు
వింతలనుగాంచుచును లోన వేడ్కలూర. 236

మాంధాత మరుల్లోకమునుండి తనశిబిరంబునకు చనుదెంచి
స్వపురంబున కరుగుట.

వ॥ అట్లమ్మానవేంద్రుం డమర్త్యభువనంబువీడి తనదళంబువిడిదల దిగి పుష్పకము ననిచి సపరివారుండై సాకేతపురంబుచేరంజనుదెంచు టయు నప్పుడు. 237

మ॥ లలితాత్మద్యుతి జంతుసంతతికి ను ల్లాసంబుగాఁ బద్మినీ
వలయానేతృఁడు నిత్యజీవమణి పూ ర్వక్షోణి భృద్దుర్గమ
స్థలులన్ దోఁచుచునుండెఁ దా నిజకుల స్వామిన్ గనంగాఁ గుతూ
హలియై పర్విడనోపుఁ గాని యెడ నా స్యంబేల కెంపారెడున్. 238

ఉ॥ కమ్మని తమ్మిపూవలపు గాడుపుపూపలు తీవెకన్నెలన్
గమ్మగఁ గూడియాడఁ దమ కంబున నభ్రము భూతధాత్రియున్
గిమ్మనకుండ నర్భకుల క్రీడలు చూచుచునుండ వారి వి
య్యమ్ముగ కొంగులమ్మడిచి హాస్యముచేసెడి నవ్వుచున్ దిశల్.

మత్తకోకిల॥ దోరపండిన జామకాయలఁ దొఱ్ఱటుల్ బొడిచేయుచున్
గీరనారము లారగించెడుఁ గేకరింతలు వెట్టుచున్
జారణం బొనరించెడిన్ గల మంపువెన్నుల ముక్కులన్
జారగొట్టుచుఁ బిట్టపుల్గులు సోయగంబుగ మళ్ళలోన్. 240

తే॥ ప్రోథితనక్షత్రపంక్తి నం బరముభంగి
ఫుల్లకైరవ కమలాళిఁ బొలుపు మీఱి

సరసకాసారములు వేడ్క § సలుపుచుండెఁ
జక్రవాకమరాళ సం § సారరుచుల. 241

ఉ॥ ముట్టినఁ బాలుగారు నను § బుగ్గల కెంజిగిజిల్గుబెండతోఁ
గట్టఁగమైత్రి; తియ్యనెబులు § కర్ నురుగారనిపాలు గ్రోలి చేఁ
బట్టిన చిన్నికోలఁ జెలు § వార నదల్చుచు వెన్క నర్భకుల్
ముట్టఁగఁ బర్వులెత్తుచును § ముద్దుగ లేగలు క్రేళ్ళుదాటెడిన్ 242

చం॥ పురగృహాలత్కుమ్మ లిర్వురు వి § భూషిత తోరణశేఖరాఢ్యలై
వరలు వితానపుం జెలుగు § వల్లియ మేలిముసుంగుఁ దాల్చి భి
త్తి రచితవర్ణలేపన వి § ధి ప్రధితామల నవ్యచేలముల్
బారి ధరియించి వాకిళుల § పొంతలఁ గాచిరి కాంతురాకకై. 243

ఉ॥ పౌరజనుల్ గృహాంగణము § పాలును చిందిన సేకరించు న
త్తిరునఁ దీర్చి యయ్యెడను § తీర్చిన పువ్వుల మంటపమ్మునన్
జేరి కుటుంబయుక్తులయి § చేతుల వాకకలశీ ప్రసూన క
ర్పూర సుగంధ పాత్రములఁ § బూనిరి భూపతి రాక వేచుచున్.

తే॥ పరిజనశ్రేణి యరిమురిఁ § దిరుగుచుండె
నగళులందున హాస్య వి § న్యాసమడర
నమల వేషంపు వన్నెలు § నాస్యరుచులు
ధవళకుడ్య ప్రదీప్తితోఁ § గవలు గట్ట. 245

ఉ॥ తా నయి దేవతావిభుఁడు § దార సుధర్మ నొనర్చినట్టి స
న్మానపు చిహ్నమైన సుమ § మాలిక సౌరభవాహినుల్ సమా
హ్వానము తెల్పినట్లు వసు § ధాధిపముఖ్యులు వ్రాలి రా యయో
ధ్యానగరంబుపొంత విభు ధర్మ జయోత్సవ భాగ్య లిప్సులై. 246

తే॥ ఘుమఘుమార్భటిఁ దావులు § గుప్పునట్టి
ఫుల్లమల్లీసుమంబుల § పోల్కి మధుర
భావ సంఫుల్ల హృదయముల్ § పర్వుతేత్తఁ
బ్రజలు దొరఁ గాన నిల్చిరి § బంతితీర్చి. 247

మాంధాత నిజకటకంబునఁ జొచ్చి విజయోత్సవమునకు చనుదెంచిన రాజన్య
ప్రజానివహంబు సన్మానించి వీడ్కొల్పుట.

వ॥ అయ్యెడ ననిమేష వృత్తి నవలోకించు నఖిలలోక విలోకనంబులకు నమృతవర్తిగా, వసుమతీదేవి జీవంబును, భారతేందిరా భాగధేయంబును, కోసల ప్రజాతపఃఫలంబును, సాకేతనగర శృంగారంబును, బంధుమతీదేవి మంగళసూత్రమ్మును, విశ్వమానవ సమాజసామ్రాజ్య మహాప్రాసాదంబునకు మూలస్తంభంబునైన మాంధాతృమహాసార్వభౌముం డయ్యెడ సాక్షాత్కరించె నంత జయజయధ్వానంబులు స్వస్తివాచన నినదంబులు మంగళతూర్య నాదంబులు మిన్నుముట్టె, నమ్మహారాజ పరమేశ్వరుండు మహారాజచక్రంబు బలసిరా మహేంద్రవైభవంబున నందనవనమ్ము కరణి నానందకందంబగు నయోధ్యాపురంబునఁ బ్రవేశించి పుష్పహారంబుల మునుంగుచుఁ బూలవానం దోగుచుఁ గప్పురంపు టారతులఁ గ్రాగుచు నరిగి పసిండిమొగసాల నరదం బవతరించి మహాసభాభవనంబు చొచ్చి భద్రాసనాసీనుండై, ఫలమంత్రాక్షత లొసంగి మంగళాశీర్వచనంబులు వచించువారలను పుష్పహారంబులు మెడవైచి సముచితసత్కారంబులు సలుపువారలను కానుకలు వెట్టి సాష్టాంగమెఱఁగి కైగవ గట్టి నిలిచి కౌతుకంబున నీక్షించువారలను భక్తి ప్రపత్తుల వెలయించువారలను క్రమంబున నమస్కారంబుల నువస్కారవచనంబుల కుశలసంప్రశ్నంబుల సాదరవీక్షణంబులను సత్కరించి, యెల్లరు నిజాసనంబుల నుపవిష్టులైయుండ నుత్థితుండై యవశిష్ట కర్తవ్యోపదేశంబుగా “సంయుక్తచిత్తులారా! ఆచరణ ప్రచార. పరిపూర్ణ పవిత్ర ధర్మము నన్నితోయముల నెంతెంత వినినను హెచ్చు కానేరదు. ధర్మంబ యెల్లరకు బలంబు తేజంబు నొదవించు. ధర్మబలంబునన పంచభూతములు దివాకర నిశాకరులును చరితార్థతాసమంచిత తేజంబున వెలుంగుచున్నవారు మృత్యువును ధార్మికుని చెప్పుచేతల మెలంగెడిని. మనుజలోకంబ నియతస్థితి మిత్తికెఱయగుట ధార్మికత్వ

సమర్థతకుఁ దార్కాణము. మానవునకు నాయుష్యంబు వేలకొలం
దిగా మృత్యు వాతని పలుకుబడిని మెలంగవలయు. తత్తాదృశ ధర్మ
బలంబున లోకం బాధి వ్యాధి గర్భ వైధవ్య విధురతా శోకవిరహి
తంబై నెగడు. ఏతాదృశసమున్నతి సర్వత్ర విశ్వమానవసమా
జంబునకు హస్తప్రాప్యమై యుండవలయు ననిన విశ్వైకతా
సౌభ్రాత్రంబులకు హ్రాసంబు లేకుండ వ్యక్తులు సమాజంబునకు
గూర్చుచుండ, సమాజంబు దేశంబునకుఁ గూర్చుచు సామ్రా
జ్యంబు పాలింపవలయు. అస్మదీయైతదాదర్శకృతకృత్యతా
విభవంబున నిఖిల మానవజగంబు సుచిరంబు మంగళాలయంబై
మెఱయుఁగాక." అని వచియించుచు సాధువాదంబులు కరతాళ
ధ్వనులును మిన్నుముట్టె. పిమ్మట నమ్మహాశయుండు సాదరంబుగ
సమితికి వీడ్కోలుఁ దెలిపె నంత ధర్మపూరుషస్తావకగీతంబులు
ప్రవర్తిల్లుటయు నెల్లరుఁ దమతమ నివాసంబుల కరిగిరి. పదంపడి
యామేటిగృహస్థు నభ్యంతరమందిరమ్మున కరుగువాడై యటనుండి
వెడలి— 248

మాంధాత మాతంగ తురంగ పశుపక్ష్యాదులఁ బరామర్శించి
యంతిపురమ్మున కేగుట.

ఉ॥ గజశాలల్ దిలకింప నేగె నట నాగశ్రేణి వీక్షించుచున్
నిజశుండా మృదువల్లికల్పయికి నెంతే ముద్దుగా నెత్తి య
క్కజమా దర్శనభాగ్య మిచ్చిన మహీకాంతున్ సమీపంబుగా
విజయం చేయుఁ డటంచుఁ బిల్చుక్రియ నూగెన్ గుంభముల్
వింతగాన్. 249

ఉ॥ కని రాజేంద్రుఁడు వాని వాంఛ కొనసాగన్ జేరి తన్మూర్తులం
దన పాణిన్ స్పృశియించి తుండముల మోదంబారగాఁ దువ్వినన్
మన ముప్పొంగగ బృంహితమ్ము సలిపెన్ మాతంగముల్
పట్టువున్
ఘనమాతంగము చెంతఁ జేరిన నృలోకస్వామి శుండాలతన్

తే॥ మాపునం దెక్క మనురీతి ✽ మోకరించి
మృదుగతిఁ జేరువకు లాగి ✽ కదలకున్న
నింగితజ్ఞుఁడు నృపతి త ✽ దీయ కాంతిఁ
దీర్చి దిగి మేను నిమిరె చి ✽ గిర్చెఁ గరియు 251

తే॥ తనయు మస్తంబు మూర్కొను ✽ తండ్రివగిది
లేచి కరమున మూర్కొనె ✽ లీల విభుని
శిరము నక్కరి యద్దాని ✽ చెయిదములకు
నశ్రువులు నిండెఁ గన్నుల ✽ నవనిపతికి 252

చం॥ ముసిముసినవ్వునన్ వెలయ ✽ మోము మహీశుఁడు నంతఁ జక్కనన్
మిసమిస లాడు సాహిణపు ✽ మేదిని బొల్చెడి వారువమ్ములన్
వెసఁ జని గాంచె మోములన ✽ వీస వికాసము మించ వాజులున్
గొసరెడి కూర్మి మోరలను ✽ గోమలభంగిమఁ జాచి హేషలన్. 253

చం॥ సలుపుచు ముందుకాళ్ళ నొగిఁ ✽ జక్కన నెత్తి నమస్కరించు న
చ్చెలువము చూపె నా మృదుల ✽ శీలుఁడు తద్రమణీయ చేతనా
కలన నెఱింగి యన్నిటిని ✽ గమ్మని చేతులఁ దట్టి మేనులన్
బొలుపుగ దువ్వె విస్ఫురిత ✽ మూర్తులఁ బొల్చెను సైంధవాళియున్

తే॥ మధుర పీయూష సౌరభ ✽ మహిమఁ దనరు
గోష్ఠమున కేగె గృహమేధి ✽ గోవు లపుడు
చెవులు రిక్కించి చూడ్కుల ✽ చెలువ మొప్ప
సామిఁ గనుగొని మాఁజూచి ✽ చనువుఁ దెలిపె. 255

వ॥ అంత నా రసికావతంసుండు

శా॥ పూదోటన్ గననేగ నందు సరసీ ✽ పుష్పాంగి పూర్ణాత్మయై
స్వాదిష్టాంబుతరంగ హస్తముల న ✽ బ్జమ్ముల్ నివాళించుచున్
మోదంబార మరందగంధిల మరు ✽ త్పోతమ్ములన్ ముట్టి త
త్ఖేదమ్మున్ దొలగించి స్వాగతము ✽ పల్కెన్ తేఁటి గీతమ్ములన్.

శా॥ ఆరామక్షితికాంత నాథునకు దూ ✽ ర్వాంకూర రోమాంచ మే
పారం గోమలవల్లికామృదుల లా ✽ స్యంబుల్ ప్రదర్శించుచున్

స్ఫార శ్వేతరుచిప్రఫుల్లకుసుమ ~ వ్యాకీర్ణ నేత్రప్రభా
పూరాన్ బెన్నైచి పూర్ణ ఫలముల్ ~ పొందించు సంతృప్తిగాన్.

ఉ॥ చైత్రరథమ్ము చందమునఁ ~ జక్షురుదంచన దృశ్యసంపుటిన్
మైత్రిఘటించి చూపరుల ~ మానసముల్ హరియించునట్టి యా
చిత్ర వనమ్మువీడి యను ~ జీవి హితంకరు డిందుకాంత వై
చిత్రి నెసంగు నేలపయిఁ ~ జెల్వుగ శోణ సరోజ చిత్రముల్. 259

చం॥ వెలయఁగఁ బాదచారమున ~ వెంబడివచ్చెడి సేవకాళిచేఁ
గులమున నెల్లవారి కను ~ కూలవిధమ్ములు భాగ్యభోగముల్
తెలియుచు వచ్చుచుండఁ గని ~ తియ్యములొల్కెడు కూజితమ్ములన్
జెలువమునింపు రూపులు వ ~ సించిగరుల్ గలయంచ లిమ్ముగాన్.

తే॥ శోణసారసకోరక ~ సుందరముల
మృదులచంచుదళమ్ముల ~ మేదినీశు
నరుణకిసలయ మృదుల ప ~ దాగ్రములను
ముద్దుపెట్టెను హృదయ స ~ మ్మోహనముగ. 261

వ॥ అంత నాలలితహృదయుండు సవిలాసమ్ముగ నవ్వాని నొక్కొక్కం
డుగ ప్రవాళమృదుల పాణిపుటంబుల సితశతపత్రంబు చెలువున నెత్తి
శిరంబుమూర్కొని గరులునిమిరి విడుచుటయు నవియు తృప్తిఁజెంది
యథేచ్ఛంజనియె వెండి యాగృహపతిప్రథమగృహప్రాంగణమ్ము
దాటి 262

చం॥ అరుగుచునుండ లోనికిఁ ద ~ దంతరమందున జోతపెట్టుచున్
పరిజన మంతలంతలన ~ పజ్జకొదుంగగ వారినెల్ల నా
దరమున గాంచుచున్ జనఁగ ~ దగ్గరి కేకికలాప మాదొరన్
సరగున గాంచి ముందెటనొ ~ జారినవస్తువు చిక్కినట్లుగాన్. 263

చం॥ గనిపటికంపుఁగుట్టిమము ~ గారుడరత్నరుచిప్రదీప్తమై
తనర గలాపముల్ విరియ ~ దాల్చి ప్రదక్షిణ రూపమొప్పు వి

న్ననువుగ పాదముల్ విడక । నాట్యముసల్పఁదొడంగె నంత రం
బున విభునాస్యముం గనుచు । ముద్దుగ కేకలఁ బల్కరించుచున్.

వ॥ అంత నక్కుశలుండు. 265

తే॥ కదలనీని తెలుంగునఁ । బొదలునట్టి
వాని నొకడొక్కడుగఁ జక్కఁ । బట్టి పాణి
మృదులగతి దువ్వివిడిచెను । మించుగరులు
సొరుఁ గురియంగఁ గేకిసం । చయము వెడలె. 266

వ॥ తదనంతరమ్మయ్యాశ్రితవత్సలుండు సంభ్రమత్పరిచారకమ్మగు శుద్ధాంతమ్ముఁజొచ్చి, యందు మణిఖచితహైమపంజరస్థమ్ములు వివిధవర్ణ రమణీయమ్ములు నగు శుకశారికాప్రముఖ గృహ్యాశకుంతమ్ములా ప్రభువతంసము నవలోకించి యరుణోదయమైన తెలుంగున తెక్కలువిదిర్చుచు నిసర్గమధురవాసితమ్ముల నమ్మందిరమ్ము బూరటిల్లంజేయుచు వెలి కుసుకుతమకంబునఁ బంజరశలాకల గరచుచు మిగులనార్భటించుటయు వాని నెల్ల మొలకనవ్వుల నును పల్కుల నాదరించి బహిఃప్రాణంబగు బంధుమతీదేవి నలరింప తన్నికేతనంబు దెస మొగంబై వెడలి తన్నుంగాంచి తత్తరించు తత్సఖీజనంబు నపవారించుచు నొయ్యన నేగుచుండె. అంతనెదుర మణిమయపంజరమ్మున భాసిల్లు బంధుమతీదేవి ప్రాణసఖియగు పంచవర్ణ రాజకీరంబీ మారాజుం గాంచి యాత్రంబున నెలుగెత్తి. 267

తే॥ "అక్కయక్కయ్య బావగా । రరుగుదెంచి
ర"నుచు నుండఁగ ముక్కున । నంగుళి నిడి
సరగ జేఁగొని చనియె నా । చతురనృపతి
యదియు నంగుళి కరచుచు । నట్లయుండె. 268

వ॥ అట బంధుమతీదేవియు. 269

చం॥ తెలతెలవారు నప్పటికిఁ । దీపితలంపులు సందడింపఁగా
లలి జలకమ్మొనర్చి పద । లంబికచాళిఘటించి వేల్మిడిన్

చెలువుగ చంపకప్రసవ § శేఖరమూని పసిండిపట్టుదు
వ్వలువ ధరించి ఫాలమునఁ § బ్రస్ననిబొట్టునుతీర్చి కస్తురిన్. 270

ఉ॥ ఆసనబంధధీరత'ను § పాసనసల్ప నిజావలగ్నపుం
గాసెగ, పైఁటచెంగును సు § ఖస్థితిఁ ద్రిప్పి బిగించి, యూర్పులన్
వీసముఁ బోవనీక పతి § విగ్రహమూలిఁ బవిత్రచిత్త సిం
హాసనమందు నిల్పి యట § నచ్యుతరూపము లోముఖమ్మునన్.

మ॥ గనుచున్ లోవెలి సర్వమున్ గ్రమత శ్రీ § కాంతస్వరూపమ్ము కాఁ
గని యాత్మీయవిభిన్నతా కలిత సం § స్కారమ్ము సాంతంబుగాఁ
జన, నొండేది యెఱుంగకుండె యటు ని § ష్ఠాయుక్త పూర్ణంబుగాఁ
తనవంకన్ విభుఁడేగుదెంచునటుగాఁ § దస్వాంగియున్ స్వస్థయై. 272

తే॥ తనదుసౌభాగ్యదైవమ్ముఁ § దారసిల్లి
స్వాగతింపంగ లేచి యా § సరసిజాక్షి
నవ్యవేషంబు సవరించి § సలువుతోడ
నిలువుటద్దముముందఱ § నిలుచునంత. 273

తే॥ పారిజాతంపుఁ బొలపంబు § బంధురముగ
వీచుటయుఁ జిల్కపల్కులు § వినగరాఁగ
లలితగతి నేగె నెదురుగా § లలన వేడ్క
నంతఁ బ్రత్యక్షమయ్యె న § య్యతివ వేల్పు. 274

తే॥ చక్షు రిందీవరమ్ముల § చలువజేని
యమలపాదాగ్రములకు ని § జాత్మలొసఁగ
మోకరించెను పతిముందు § ముద్దుగుమ్మ
కేలనెత్తుచు సతిఁబల్కె § లీల విభుఁడు. 275

తే॥ "సుదతి! నెఱజాణవైతి వీ § శుకము కతన"
"పరిమళోదార భవదీయ § పారిజాత
చారుహారమ్మ మున్న నన్ § జాణఁజేసె"
"వలపుఁ జిలికెడి నిది నిన్ను § వలచి తరుణి" 276

తే॥ అనుచుఁ జేదోయి నా రసికాగ్రగణ్యు
డమర సుమహార మింతి భుజాంతరమున
నునిచె నత్తఱిఁ గిరమ్ము నంచితముగ
"మేలు మేలంచు దనచోటి నేలఁ జనియె" 277

తే॥ చెమరుఁ గన్నుల వెలయు సుస్మిత మరీచు
లొండొరులఁ జూచికొని రంత నువిదఁ గేలు
వట్టికొనిపోయె లోని కాప్రణయమూర్తి
శారికాకీరములు వల్కె జయ మటంచు. 278

వ॥ అంతఁ గాలక్రమంబున నమ్మానవలోకపాలుండు విశ్వమానవ సమాజ శాంతి భద్రతాభ్యుదయ నిర్వహణ సంరక్షణ సహస్రాక్షుండై ప్రవర్తిల్లుచు భూలోకంబు విబుధలోకంబుగా నొనర్చి గంగాతరంగిణీప్రముఖ పుణ్యనదీతీరంబుల బృందారక నికరంబునకు సంతృప్తికరంబుగా ననేకాధ్వరంబు లాచరించి యందు విలాసంబుగా విప్రులకు సువర్ణమయ మీన మకర తిమింగిలాది జలజంతువులు దక్షిణలుగా నొసంగె. మఱియు నాపుణ్యశ్లోకుండు బంధుమతీదేవి వలన ముచికుం దాంబరీష పురుకుత్సులను మువ్వుర గుమారుల నేబండ్రు కూతుండ్రను గాంచి కృతయుగాలంకారుండై తేజరిల్లె నని మంగళంబు వినిపించి వైశంపాయనుండు ప్రణమిల్లు జనమేజయ జనపాలు నాశీర్వదించి యథేచ్ఛం జనియె. 279

మంగళమహాశ్రీ వృత్తము

శ్రీ లలిత శేషగిరి శృంగధృతమత్కనక సేవధి! మదీయ దురితౌఘా
భీల వనకీలి! పరిపీత జనపాలన సువేష! వరధర్మపరిపోషా!
శీలనుత శిష్టజన సిద్ధనిజతేజ! ఖల శిక్షణ నిశాత ఘనచక్రా!
కాలయుత చిత్ప్రకృతి కల్పిత జగన్నిచయ కారణ! సుమంగళ మహాశ్రీ. 280

మ॥ పరమాచార్య! భవత్కృపామహిమ ని ప్వాటన్ బ్రకాశించు నీ
వరకావ్యమ్ముల్ భవత్పదాశ్రయ మహా త్వత్ప్రాప్త నిత్యాదృతిన్
బరగుంగాక చిరంబునై జగుణరూ పస్థేమరమ్యోన్నతిన్
వరదా! వేంకటశైల రమ్యవలయ ప్రాంచన్మణీ! మన్మణీ. 281

తే॥ అస్మదభిమతదాత్రి! రమా యమ్మ! పద్మ!
శ్రీనివాసకృపామూర్తి చెల్లి నిచ్చ
విశ్వరూపక భవదీయ విభునికొల్వ
నలుపు నిక్కావ్యకోమలి సాకుమిలము. 282

గద్యము॥ శ్రీ శ్రీనివాసకృపాసమాసాదిత కవితావిభూషితుండును, కృష్ణా మండలస్థ కృష్ణాస్రోతస్వినీశీతలప్రాక్తీరవర్తి "శ్రీరంగపురాగ్రహార వాస్తవ్యుండును, బళ్ళారిమండలస్థ "హొసపేట" పురపాలకోన్నత పాఠశాలాప్రధానాంధ్రోపధ్యాయపదవీ విలసితుండును, శ్రీమత్పదసంస్తుత "ఆసూరి" సముపజ్ఞక 'తిరుమల'పదోపబృంహిత 'కొండూరు' గ్రామనామ ప్రతీత 'పంచాంగా' న్వర్థ నామధేయ 'హారిత' గోత్ర పవిత్ర కృష్ణమాచార్య తనూభవుండును, ఆంధ్ర విశ్వవిద్యాలయాధిగత "ఉభయభాషాప్రవీణ" బిరుదాంకితుండు నగు "వేంకటాచార్యు"నిచే రచింపఁబడిన కృతులం దృతీయంబగు ఆదర్శ ప్రభుత్వాపరనామక "సమాజసామ్రాజ్య" మహాప్రబంధం బీతృతీయఖండంబుతో సంపూర్ణము.

శ్రీ శ్రీ ని వా సా ర్ప ణ మ స్తు

శుంగళం మహా శ్రీ

శ్రీ శ్రీ శ్రీ



# శుద్ధపత్రము

| పుట. | పద్య సంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 128 | సద్యస్సక్త | సద్యస్సిక్త |
| 22 | 133 | చవిఁగన | చవిఁగన్న |
| 25 | 156 | చవన | చ్యవన |
| 26 | 162 | గశిష్ఠ | గృశిష్ఠ |
| 29 | 178 | మెలపన | మెలపున |
| 30 | 184 | యామవతీదే | యామవతీదేవి |
| ,, | ,, | ర్పంగ | తీర్పంగ |
| 31 | 189 | మృదును | మృందును |
| 32 | 197 | పూదడ | పూదండ |
| ,, | 198 | శిషుల | శిష్యుల |
| 35 | 218 | జాతని | జాతిని |
| 41 | 256 | మచ | మతి |
| ,, | 258 | ధనులరై తిరి | ధన్యులరై తిరి |
| 45 | 280 | ముహిత | మహిత |
| 50 | 313 | ఁదెమ్మెరి | ఁదెమ్మెర |
| ,, | 314 | దిక్కు-భాంగికిఁ | దిక్కుభాంగికిఁ |
| 52 | 326 | పంకికి | పంక్తికి |
| 53 | 335 | దేవత | దేవతల్ |
| 59 | 375 | తృప్ప | తృప్పు |
| 60 | 377 | జటుగతి | బటుగతి |
| 62 | 395 | యలన | యల్లన |
| 66 | 426 | జాపియున్మనస్కు-లై | జాపియున్మ నస్కు-లై |
| 68 | 432 | కట్టడి | కట్టిడి |

| పుట. | పద్య సంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 69 | 440 | మెరసె | మెఱసె |
| 72 | 457 | లుచ్ఛ్రుకత | లుత్సుకత |
| 76 | 482 | గదేసు | గడేసుకీ |
| 80 | 508 | ప్రిజాతతి నేలగ | ప్రజావితతి నేలగ |
| | | భద్రితకాంతి | భద్రతకాంతి |
| | | నెకొల్కొనన్ | నెకొల్కొనన్ |
| ,, | 509 | బ్రిజనేఁగ | బ్రజలనేఁపఁగ |
| ,, | ,, | తత్పాలికిన్ | తత్క్షాలికిన్ |
| 82 | 518 | సంధాని | సందాని |
| 85 | 536 | భృగుపకాని | భృగునాయని |
| 93 | 34 | సంతిక్రై | సంతతిక్రై |
| 95 | 53 | తొ్రక్కిడి | త్రొక్కిడి |
| 96 | 57 | జవిపై | జవపై |
| 98 | 69 | నొష | నొష్ట |
| 110 | 144 | నిష్ట | నిష్ఠ |
| 112 | 156 | నసుష్టాన | నసుష్ఠాన |
| ,, | 160 | పల్లెపాళ్ములు | పల్లెపాళెములు |
| 116 | 187 | పదచ్యుతు | పదచ్యుతి |
| 141 | 352 | డీయుఖి | డీయూఖల |
| 148 | 396 | దశ్యాశికిన్ | దస్యాళికిన్ |
| 158 | 52 | కళారహాశ్యంబుల | కళారహాస్యంబుల |
| 184 | 195 | కీలాకలాకలాపమ్ము | కీలాకలాపమ్ము |
| 189 | 226 | మెరసె | మొరసె |
| ,, | 227 | నిష్టకు | నిష్ఠకు |